# చతుర ప్రపంచం

## గోల్డ్‌రష్

1848లో ఉత్తరకాలిఫోర్నియాలో జేమ్స్ మార్షల్ అనే వ్యక్తికి ఓ చిన్న నీటివాగులో మెరిసే పదార్థం ఒకటి కనపడింది. 152 ఏళ్లక్రితం కనపడ్డ అది బంగారం. త్వరలోనే ఈ వార్త అమెరికా అంతటా వ్యాపించింది. దాంతో అనేక ప్రాంతాలనుంచి బంగారం వేటలో ప్రజలు కాలిఫోర్నియాలోని 'యెర్బా బ్యూనా' కి చేరుకున్నారు. నేటి శాన్‌ఫ్రాన్సిస్కోనే అది. ఇంక ఈ బంగారం అన్వేషణలో లాయర్లు, జడ్జిలు, డాక్టర్లు, క్లర్కులు,




సైనికులు... ఉత్తరంనుంచి దక్షిణం దాకా 190 కిలోమీటర్లు, తూర్పునుంచి పడమరకి 95 కిలోమీటర్ల పొడవునా బంగారం అన్వేషణలో పడ్డారు. 'గోల్డ్‌రష్' గా పేరొందిన ఈ కార్యక్రమంలో కొందరు ఆస్తులన్నీ పోగొట్టుకుని బికారులయితే, మరికొందరు బంగారం లభించి ధనవంతులయ్యారు. యూబా నదినుండి ఒకతను 15 కిలోల బంగారాన్ని సాధించగలిగాడు.

1848లో అప్పటి అమెరికన్ ప్రెసిడెంట్ బంగారం మాట నిజమేనని ప్రకటించాడు. దాంతో అక్కడికి అదృష్టం పరీక్షించుకోడానికి వెళ్లినవారి సంఖ్య అధికమయింది. రెడ్ ఇండియన్స్ వీరి గుర్రాలను దొంగిలించడంతో ఈ ఇరు పక్షాలమధ్య పోట్లాటలు సర్వసాధారణంగా ఉండేవి. చేతుల్లో గునపాలు, గొడ్డళ్లు, పారలు, గమేళాలతో లక్షల మందికి తక్కువకాకుండా బంగారం అన్వేషణ సాగించారు. ఎక్కడో భూమిలో గనుల్లో కాక భూమిపైన నదుల్లో, వాగుల్లో ఈ బంగారం కణికలరూపంలో లభ్యంకావడం విశేషం. రెడ్ ఇండియన్స్‌ను చంపి తెల్లవాళ్లు బంగారంకోసం వారి భూములను ఆక్రమించుకున్నారు. ఈ బంగారంకోసం హత్య చేయడాలు సర్వసాధారణమైపోయింది. లక్షన్నర జనసంఖ్య గల రెడ్ఇండి



యన్స్ ఏడాదిన్నరకల్లా 30,000 కి తగ్గిపోయారు.

ఈ గోల్డ్‌రష్ కోసం ధరించే బూట్లు, తవ్వేసామాగ్రి అమ్మిన వ్యాపారస్థులు బంగారం వెతికేవారికన్నా ఎక్కువ ఆర్జించారు. వారి కోసం తయారుచేసిన బట్టతో కుట్టిన ప్యాంట్లే నేటి జీన్స్‌కి మూలం.

న్యూయార్క్‌నుంచి కాలిఫోర్నియాకి ఉత్తరాలు బట్వాడా చేసే సోన్ ఎక్స్‌ప్రెస్, టెలిగ్రాఫ్ సౌకర్యం, ట్రాన్స్ కాంటినెంటల్ రైల్వే లైన్ మొదలయినవి ఈ గోల్డ్‌రష్ వల్ల ఏర్పాటు చేశారు.

మొదటి బంగారు కణికను కనుక్కున్న జేమ్స్‌మార్షల్ 1880లో మరణించినప్పుడు అతని అప్పులన్నీ తీర్చడానికి అతని ఆస్తి వేలం వేస్తే వచ్చిన మొత్తం 150 డాలర్లు మాత్రమే.

## నీళ్ళల్లో చదివే పుస్తకాలు

స్నానం అనేది జపాన్‌లో ఓ సాంస్కృతిక, ఆధ్యాత్మిక కార్యక్రమం. నిద్రపోబోయే ముందు జపనీయులు విధిగా స్నానం చేస్తారు. ఆ సమయంలో బాత్ టబ్‌లలో వారి సమయం వృధాకాకుండా ఉండటానికి గాను జపాన్‌లో పుస్తక ప్రచురణదారులు వాటర్‌ప్రూఫ్ పుస్తకాలను ముద్రిస్తున్నారు.

'ఇంగ్లీషులో మాట్లాడ్డం', 'బాత్‌రూమ్‌లో ఎక్సర్‌సైజులు' అనే రెండు పుస్తకాలు విడుదలై 3,20,000 కాపీలు మొదటివారంలో అమ్ముడయ్యాయి. ఒక్కోటి 16 పేజీలు మాత్రమే గల ఈ పుస్తకం ధర 480 యెన్లు.(130 రూపాయలు )

స్నానాల తొట్టిలో ఉన్నవారు కుటుంబసభ్యులనుంచి ఇతర నిత్య కృత్యాలనుంచి ఫ్రీగా ఉంటారు. కాబట్టి ఆ సమయంలో చదవడంమీద పూర్తిగా శ్రద్ధ చూపగలరు. 'సంఖ్యలను గుర్తుంచుకోవడం ఎలా? లాంటి పెర్సనాలిటీ డెవలెప్‌మెంట్‌కి చెందిన పుస్తకాలు అధికంగా అమ్ముడుపోతున్నాయి. తర్వాతి స్థానం పిల్లల కథలపుస్తకాలు, జోక్స్‌పుస్తకాలది.

అయితే పుస్తకాలను వేడినీళ్లలో ముంచితే బొమ్మల రంగులు మారతాయి అలాగే ఊరికే ఔట్‌లైన్స్ గల పుస్తకాలని వేణ్ణీళ్లలో







ముంచితే వాటికి రంగులు వచ్చి జంతువుల బొమ్మలుగా మారుతాయి.

ఓ ఫిన్‌లాండ్ పబ్లిషర్ ఫిన్నిష్ భాషలో ఆ తరహా పుస్తకాలని ముద్రించి సరఫరా చేయమని కోరాడు. ఇది పాప్యులర్ అయితే ఇకమీదట దినపత్రికలు, పాఠ్యపుస్తకాలు కూడా వాటర్‌ప్రూఫ్ కాగితాలమీద రావచ్చేమో.

---

## అతిపెద్ద కట్టడం

ప్రపంచంలో కెల్లా అతి ఎత్తయిన కట్టడం కెనడాలో ఉంది. అది కెనెడియన్ నేషనల్ టవర్. దాన్నే 'సి.ఎన్. టవర్' గా వ్యవహరిస్తూ ఉంటారు. 553.33 మీటర్ల ఎత్తుండే దాన్ని 40 నెలల కాలంలో నిర్మించారు. 1537 మంది కార్మికులతో, 5 కోట్ల, 70 లక్షల డాలర్ల ఖర్చుతో దీన్ని నిర్మించారు. జూన్ 1976 న దీనిమీదికెక్కేందుకు ప్రజలను అనుమతిస్తున్నారు. ఆ విధంగా ఏటా 16 లక్షల మంది దీన్ని సందర్శిస్తున్నారు.

కెనేడియన్ టీ.వీ ప్రసారంకోసం దీన్ని నిర్మించినా ఇది టూరిస్టులని బాగా ఆకట్టుకుంటోంది. నిమిషానికి 360 మీటర్ల వేగంతో లిఫ్ట్‌లో పైకి చేరుకోవచ్చు పైన రివాల్వింగ్ రెస్టారెంట్ ఉంది. సి.ఎన్. టవర్ లోని 'సావనీర్ షాప్' లో దాన్ని దర్శించిన గుర్తుగా ఏవైనా కొనుక్కుని తీసికెడుతూ ఉంటారు యాత్రికులు. 342 మీటర్ల ఎత్తులో స్కైప్యాడ్ మీద నిలబడి టొరంటో నగరాన్ని చూడచ్చు ప్రతి అయిదు అంగాళాలకీ ఊచలుండటంతో ఎవరూ పైనుంచి దూకి ఆత్మహత్య చేసుకునే అవకాశం లేకుండా చేశారు. ఈ టవర్ నిర్మాణానికి సంబంధించిన ఫొటో మ్యూజియమ్ ఇక్కడ ఉంది. దాన్ని సందర్శిస్తే చాలు అన్ని విషయాలూ తెలుస్తాయి.




1889 లో ప్యారిస్ లో నిర్మించిన ఈఫిల్ టవర్ ప్రపంచంలో ఎత్తయిన కట్టడంగా ఉండేది. 1931 లో అమెరికాలోని ఎంపైర్ స్టేట్ బిల్డింగ్ నిర్మించాక 1976 దాకా అదే ఆ స్థానాన్ని ఆక్రమించింది. 1976 నుంచి సి.ఎన్. టవర్ ఆ రికార్డును కొట్టేసింది.

చుట్టూ అద్దాలు అమర్చిన లిఫ్టులో పైకి వెడుతూ కిందికి చూడడం ఓ మధురానుభూతి. ఇక్కడ 525 మంది ఉద్యోగస్థులు పనిచేస్తున్నారు. వారిలో సగంమందికి 12 అంతర్జాతీయ భాషలు వచ్చు కాబట్టి అక్కడికి వచ్చే సందర్శకులకి భాషాసమస్య లేదనే చెప్పొచ్చు



# చతురెరా

సంపుటి: 23
సంచిక: 9
అక్టోబర్: 2000

వృత్తిపరంగా అతడో చిత్రకారుడు. కానీ ప్రవృత్తి అతన్ని కళతోపాటు కాంతలకూ అంకితమయ్యేలా చేసింది.

అణుకువ గల అందమైన ఇల్లాలూ, ముత్యాల్లాంటి పిల్లలూ అతని ఆ ప్రవృత్తిని ఏమాత్రం ప్రభావితం చెయ్యలేకపోయారు.

నెలలో ఏ రెండురోజులో ఇంట్లో గడిపి తన చిత్రాల్ని అమ్మగా వచ్చిన సొమ్ములో ఏ కొంచెమో భార్య చేతిలో పెట్టి తిరిగి చక్కని, తెల్లని, ఇస్త్రీ బట్టలు, సెంటు నూనెలు, అత్తరు పరిమళాలతో చక్కాపోయే దేశదిమ్మరి అతను.

భర్త బలహీనతలు తెలిసినా అటు సంప్రదాయాన్ని,
కట్టుబాట్లనూ వదులుకోలేకా... ఇటు... ఆయన వైఖరి సహించనూ లేకా నలిగిపోయిన ఆ ఇల్లాలి స్వభావవైచిత్రి ఎలాంటిది?
ఇహ లాభంలేదనుకున్నాక జీవితంలో ఆవిడ చేపట్టిన సాహస కార్యాలెలాంటివి? వాటి ఫలితం ఏమిటి?

మనసుకు హత్తుకునే సహజ సంఘటనల సుమహారం





తనికెళ్ల కల్యాణి రచన

# రజని

ఈ నెల చతుర సమగ్ర నవల.

సూర్య కిరణాలు తీక్షణతను సంతరించు కొంటూంటే తోటలోని ప్రతి ఆకు, మొక్క ఆ బంగారు కిరణాల కాంతికి తళతళ మెరుస్తు న్నాయి. రకరకాల మందారాలు తోట నాలుగువైపులా, తోటకే తలమానికంగా ఉన్నాయి. రేక మందారం, ముద్దమందారం, పసుపుమందారం లాంటి రకరకాల రంగుల పూలు తోటకే అందం తెచ్చాయి. ఇల్లు ప్లాటుకు మధ్యగా ఉంది. ఇంటికి ముందూ, వెనుకా ఉన్న ఖాళీ జాగా అంతా పరిశు భ్రంగా ఉండి మొక్కలతో కనువిందుచే స్తోంది.

మందార చెట్లకి మధ్య రకరకాల గులా బీలు, మరొకవైపు చేమంతులు, దడికి దగ్గ రగా అరటి, దానిమ్మ. ఆ మొక్కలన్నీ మంచి సంరక్షణలో వున్నట్లు పువ్వులతో, కాయలతో ఆగంతకులను ఆహ్వానిస్తున్నట్లు చూస్తున్నాయి. ఇంటికి అటూ ఇటూ ఖాళీ ప్రదేశాన్ని కొంచెం కూడా వదలకుండా ఆ సందుల్లో తోటకూర, కొత్తిమీర, గోంగూర వేసి ఉన్నాయి. ఇంగ్లీషు బచ్చలి ఒకటి నాదే రాజ్యం సుమా అన్నట్లు ఎక్కువ ప్రదేశాన్ని ఆక్రమించుకొని ఏపుగా పెరిగింది. సందు చివరి ప్రదేశంలో మల్లె మొక్కలు, కాకర పాదు, చిక్కుడుపాదు దడిమీద నుండి మందారచెట్లవైపు పాకిపోయాయి.

మొక్కల మధ్యగా నున్న ఇల్లు మట్టిగోడ లతో కట్టబడినా దృఢంగానే ఉంది. ఇంటి ముందు కళ్లాపి చల్లి, అందంగా ముగ్గులు వేసి ఉన్నాయి. చెక్కల గేటు తీయగానే సన్నటి సిమెంటు రహదారి ఇంటి అరుగువ రకూ ఉంది. ఇంటిముందున్న నూతి నీరు వృథాకాకుండా మొక్కలకు కాలువలాగ అందేలా ఏర్పాటయి ఉంది. నూతికి ఒక పక్క సిమెంటుతొట్టి నీటితో నిండి ఉంది. పెరటివైపు తాటాకులతో కట్టిన స్నానపు గది కన్పడుతోంది. అక్కడకూడా ఒక తొట్టి నిండా నీళ్ళు నింపి చెక్క మూతపెట్టి ఉంది.

రాధాకృష్ణమూర్తి నూతి దగ్గరకి స్నానా నికి వచ్చారు. ఆయన కొన్ని క్షణాలు అక్కడి చెట్లను, మొక్కలను, పూలను ముగ్ధుడైనట్లుగా చూశారు. తర్వాత వెంటనే అలవాటుగా "ఓయ్ కామాక్షీ! నేను స్నానం చేస్తాను. తుండుగుడ్డ తెచ్చిపెట్టు" అన్నాడు.

రెండు నిముషాలు గడవక ముందే కామాక్షమ్మ తువ్వాలుతో ప్రత్యక్షమైంది.

"ఆ పంచె, లాల్చీ ఇలా ఇవ్వండి లోపల పెడతాను" అందావిడ. తువ్వాలు కట్టుకున్న ఆయన పంచె ఆమె చేతికి ఇచ్చారు. లాల్చీని మాత్రం తొట్టి గట్టుమీద పెట్టారు.

"అదేంపని? నీళ్ళలో పడిపోతే కష్టం కదా!" అంటూ ఆవిడ లాల్చీ అందుకోబో యింది. "అబ్బెబ్బే... ఏంపడదు. నేను చూస్తానుగా! ముందు నువ్వు లోపలికి వెళ్ళి వంటపని చూడు" అన్నారాయన.

ఆవిడ చిరునవ్వుతో అంది "వంటకేం? మీరు స్నానంచేసి వచ్చేటప్పటికి కమ్మగా వండి వడ్డించేస్తాను" అంటూనే లాల్చీ చేతి లోకి తీసికొంది.

ఆయన తన ప్రాణం అంతా ఆ లాల్చీలోనే ఉన్నట్లు గబుక్కున దాన్ని లాక్కొన్నారు. పట్టుకొన్న ఆ కొన్ని సెకండ్ల లోనే లాల్చీ జేబు బరువుగా ఉందని గ్రహిం చిందావిడ.

"ఇంత అనుమానం మనిషిని ఎప్పుడూ చూడలేదు" ఆవిడకినుకగా అంది, 'నిన్నటి బొమ్మలు బాగానే అమ్ముడయ్యాయన్న మాట' అని మనసులో అనుకొంటూ!

"ఛ...చ... నీపై అనుమానం కాదు. బజారునుండి వచ్చాక నేనే ఇస్తాను కదా సొమ్ము" అన్నాడాయన.

ఆవిడ లోపలికి నడుస్తూ నిరసనగా అంది, "ఈ మాట ఇన్నేళ్ల సంసారజీవి తంలో కొన్ని వందలసార్లు విన్నాను"

ఆయన గండం తప్పినట్లు ఊపిరి పీల్చుకొన్నాడు.

కామాక్షి ఇంతటితో వదిలింది. జేబులోని

డబ్బు ఆమె కంటపడితే ఏమన్నా ఉందా? పప్పు, ఉప్పు, బియ్యం అంటూ అంతా లాగించేస్తుంది. తన పని, తన జేబుపని ఖాళీ' అనుకున్నాడాయన.

ఆయన స్నానం పూర్తిచేసికొని లోపలికి వచ్చి ఒంటికి పౌడరు రాసుకొన్నారు. మనిషి మంచి పొడుగు. దానికి తగ్గట్టు పనసపండు తొనలాంటి బంగారు ఛాయ. మనిషి కాస్త సన్నంగా ఉంటారు. పౌడరు ఒంటికి పట్టిస్తున్న ఆయనని చూసి ఆమె మనసులో విసుక్కొంది. "ఈ రంగు, ఈ ఉంగరాల జుట్టు చూసి మా నాన్నగారు మోసపోయారు. రూపం వెనుకనున్న బుద్ధి తెలుసుకోలేకపోయారు" అనుకొంది.

ఆయన గ్లాస్కో పంచె కట్టుకొని భోజనానికి కూర్చున్నారు. "ఈరోజు ఐటమ్స్ ఏమిటి? " ఆవిడ వడ్డించేలోపు అడిగారు.

ఆవిడ నవ్వింది. ముక్కునున్న ఒంటి పొడి ముక్కుపుడక తళుక్కున మెరిసింది. "చింతచిగురు పప్పు, బెండకాయ వేపుడు, చారు" అని చెప్పింది.

ఆయన ఇష్టంగా చింతచిగురు పప్పు కలుపుకొని తిన్నారు. వేడి అన్నం తింటూంటే ఒంటినిండా చెమటలు దిగసాగాయి.

ఆవిడ నిమ్మకాయకారం కొంచెం ప్లేటులో వడ్డించింది. ఆయన దాన్ని కలుపుకొని రెండు ముద్దలు తిని, "నీ చేతిలో ఏదో అమృతం ఉంది సుమా! ఇక్కడ, ఇలాగ కూర్చుని తింటూంటే ఉడిపి హోటల్, స్టార్ హోటల్ అనవసరం అన్పిస్తోంది" అన్నారు.

ఆవిడ విసన కర్రతో ఆయనకి విసురుతూ అంది, "అబ్బే... తొందరపడి అనెయ్యకండి. అక్కడ ఇడ్లీ, సాంబారు, అల్లంచెట్నీ, కారప్పొడి తినేటప్పుడు ఇవి నామమాత్రంగా కూడా గుర్తురావు"

ఆయన ఇబ్బందిగా చూస్తూ మంచినీళ్ళ గ్లాసు అందుకొన్నారు.

తల్లి సౌంజ్ఞని అర్థంచేసికొని చిన్న కూతురు గిరిజ తండ్రి దగ్గరికి వచ్చింది. "నోట్సులు కొనుక్కోవాలి నాన్నగారూ, అమ్మ నడిగితే లేవంటోంది. డబ్బులివ్వరా" గోముగా అడిగింది.

"అవును మరి. ఈ నోట్సులు, చదువులు ఎంతకని సాగేను. అదంతా మానేసి హాయిగా ఇంటి పని చూసుకోండి" కామాక్షమ్మ స్పష్టంగా చెప్పేసింది.

ఆయన మాట్లాడకుండా భోజనం చేసేశారు. తర్వాత ఓ అరగంట మంచంమీద విశ్రాంతి తీసుకొని, ఇస్త్రీ చేసిన పొందూరు ఖద్దరు పంచె, లాల్చీ వేసికొన్నారు. జరీ అంచు కండువా మెడచుట్టూ కప్పుకొని బొమ్మలు రెండూ తీసుకొని బయటకి నడిచాడు.

గిరిజ ఆయనతో గోముగా "నాకు డబ్బులివ్వరా నాన్నగారూ" అంది.

ఆయన గిరిజవైపు ప్రేమగా చూస్తూ "సాయంత్రం ఇస్తానమ్మా! నీకే కాదు. మీ అమ్మకి కూడా" అన్నాడు.

'డబ్బు జేబులోనుండి తీయడం అంటే ప్రాణం మీదికి వచ్చినట్లే బాధపడతారు కదా! ఎప్పుడైనా, ఏనాడైనా అడగగానే డబ్బు ఇచ్చారా? ఎంత మురిపించుకోవాలి? ఎన్ని సార్లు అడిగించుకోవాలి? ఎన్ని అవసరాలు ఏకరువు పెట్టాలి' ఆవిడ మనసులో అనుకోగానే చేదు తిన్నట్లయింది.

భర్తని భార్య ఇంటి అవసరాల గురించి డబ్బు అడగడమే ఒక దౌర్భాగ్యం. భర్త అన్నవాడు, కుటుంబ యజమాని అన్నవాడు కుటుంబ వ్యక్తుల అవసరాలు గమనించవద్దా? పోనీ గమనించే విజ్ఞత కొరవడినపుడు చెప్పినపుడు వినిపించుకోవాలి. ఇంటి అవసరాల గురించి ఇలా అనుకోగానే ఆమెకు భర్త మాటలు గుర్తుకు వస్తాయి.

"అవసరాలకేం ఉంది? లక్షా తొంభై ఉంటాయి. ఇంతకు మించి జీవితం లేదా? భర్త అన్నవాడు కంటికి కనబడగానే జన్మజన్మల అవసరాలన్నీ ఏకరువు పెట్టెయ్యడ

మేనా? ఏదో కాబూలీవాడు వెంటబడినట్లు పీకెయ్యడమేనా? అలాగైతే భర్తకి ఇంటి మీద, ఇల్లాలిమీద ఏం అనురాగం కలుగుతుంది? అసలు జీవితం అంటే ఈ దిక్కుమాలిన అవసరాలేనా? "

ఆయన గంభీరంగా అనే ఆ మాటలు ఆవిడకి కంఠోపాఠాలే!

పెద్దకూతురు పద్మజ వచ్చి "అమ్మా! ఏం ఆలోచిస్తున్నావు? " అంటూ కదపటంతో ఆవిడ ఈ లోకంలోకి వచ్చింది. కూతురిని సాభిప్రాయంగా చూసింది. ఈ ఇంటి గురించి, ఈ పిల్లల గురించి తప్ప తనకి ఏం ఆలోచనలుంటాయనుకొంది.

"ఆయన ఇవ్వరని తెలిసి అన్నిసార్లు అడగడం మనదే బుద్ధితక్కువ" చిన్న కూతురు గిరిజ చిరాకుగా అనేసింది.

"రాక్షసుడి ప్రాణాల గురించి కథలో చెపుతారే అలాగ నాన్నగారి ప్రాణాలు చొక్కాలోని డబ్బుల్లో ఉంటాయి" ఇంకా గొణుక్కొంటూనే అంది గిరిజ.

బయటి పిల్లల్ని చూస్తే ఆ అమ్మాయికి అసూయగా ఉంటుంది. పిల్లలకి గౌన్లు తెచ్చే తండ్రులు, గారాబంచేసే తండ్రులు, పిల్లల్ని సినిమాలకి, షికార్లకి తీసికెళ్ళే తండ్రులను ఎప్పుడూ చూస్తూ ఉంటుంది. స్కూల్లో సైతం మా డాడీ ఈ బొమ్మ కొన్నారు, ఈ ఫ్రాక్ తెచ్చారు లాంటి కబుర్లు వింటూనే ఉంటుంది. కానీ తన తండ్రిమాత్రం ఇంట్లో ఉండటమే అపురూపం.

గిరిజ చిన్నతనంనుండీ ఎప్పుడూ తల్లిని అడిగే ప్రశ్న, వేధించే ప్రశ్న "నాన్నగారు ఎప్పుడు వస్తారు? "

కామాక్షమ్మ ఏంచెపుతుంది? ఎప్పుడు అడిగినా రేపు వస్తారనే అనేది. గిరిజ ఒక్కొక్కసారి ఆవిడని విసుగ్గా చూసి "అంతా అబద్ధం. నిన్న కూడా రేపు వస్తారనే అన్నావు. వచ్చారా? " అని నిలదీసేది.

తల్లికి విసుగొచ్చి రెండు వీపుమీద కొడితే "నాన్నా" అంటూ ఏడ్చేది. ఎవరైనా పిల్లలు బాధకలిగితే అమ్మా అంటూ ఏడుస్తారు. ఇదేం పిల్ల? ఏడ్చినా తండ్రినే అడుగుతుంది అనుకొనేదావిడ.

సాయంత్రం తండ్రి వస్తాడనీ, స్వీట్లూ అవీ తెస్తాడనీ పిల్లలు అంతలేసి కళ్ళు చేసుకొని ఎదురుచూడసాగారు. కామాక్షమ్మకి వాళ్ళ ఎదురు తెన్నులు చూస్తే జాలి వేసింది. నేను వేరుసెనగ పలుకులు వేసి ఉప్మాచేసి పెడతాను. మీరు ముగ్గురూ లోపలికి రండి అని పిలిస్తే మాకు ఉప్మా వద్దు, స్వీట్లు కావాలి అంటూ పండుగాడు పేచీ మొదలుపెట్టాడు.

తను ఎన్నోసార్లు చెపుతుంది భర్తకి. "ఏ వస్తువులైనా తెచ్చి ఇచ్చాకే పిల్లలకి చెప్పండి. అనుకోకుండా తెచ్చి ఇస్తే వాళ్ళు ఆనందపడతారు. ముందుగా చెప్పి కూడా తేకపోతే వాళ్ళు నిరాశపడతారు" అని. ఆయన వింటే కదా!

మీకు అది తెస్తాను, ఇది తెస్తానని కబుర్లు చెపుతారు. తీరా ఒక్కొక్కసారి ఇంటికిరాకుండా తలాయిస్తాడు. పెద్దపిల్ల పెదవి విప్పదు. ఏదీ అడగదు. గిరిజ, పిల్లవాడు అలాగకాదు.



రాత్రి ఏడుగంటలు దాటాక చేతుల




నిండా పొట్లాలతో ఆయన ఇల్లు చేరారు. నాన్నగారు వచ్చారు, నాన్నగారు వచ్చా"రంటూ పండు, గిరిజ గెంతులేశారు.

ఆయన తెచ్చిన వాటిని చూసిన కామాక్షమ్మకి ఉసూరుమనిపించింది. పకోడీలు, కాజాలు, ఉల్లిదోసెలు నాలుగు, పూరీల పొట్లాలు రెండు, బిస్కట్ పాకెట్లు తెచ్చారు. పిల్లలు అప్పుడే టిఫిన్లమీద దండయాత్ర ప్రారంభించారు. కామాక్షమ్మ నిట్టూర్పుతూ వండిన పదార్థాలవైపు చూసింది.

'ఈ భోజనాల సమయంలో టిఫిన్లు తింటూ వాళ్ళు అన్నం ఇంకేం తింటారు. అన్నం అంతా వృథాగా పోతుంది. ఏ వేళలో ఏవి పిల్లలకి తేవాలో కూడా చూసుకోరు' అనుకొంది.

ఆయన ఆవిడవైపు చూసి "నువ్వు కూడా ఉల్లిదోసె తిను. చాలా బావుంది" అన్నారు.

"చిన్న తల్లీ, అమ్మకి పెట్టమ్మా" అన్నారు.

ఆయనకి ఆడపిల్లలంటే ఎంతో ముద్దు. పెద్ద తల్లీ, చిన్న తల్లీ అని పిలుస్తారు. గిరిజ తన చిన్న చేతులతో "నాన్నగారూ! మీరూ తినండి అంటూ చిన్న దోసెముక్క తెచ్చి పెట్టింది. వెంటనే పండుగాడు 'నాన్నకి నేను పూరీ పెడతా' అంటూ లేచాడు. ఆయన ముందు వద్దన్నా, తరువాత మురిపెంగా వాళ్ళిద్దరు పెట్టిందీ తిన్నారు.

ఆయన భార్యవైపు చూశారు. ఆమె ఆయనని, పిల్లల్ని చూస్తోంది. ఆయన వెంటనే లేచి తనే పొట్లం విప్పి భార్య చేతికి అందించారు. "నువ్వు ఎంత బాగా చేయగలిగినా, వీటి రుచి కూడా తక్కువకాదు. అప్పుడప్పుడు అన్నీ రుచి చూడాలి" అన్నారు.

"నేను వండిన అన్నం వృథాగా పోతుంది. పిల్లలు ఎలాగూ ఇంక భోంచేయరు. నన్నయినా తిననీయండి"

ఆవిడ మాటలు ఆయన నవ్వుతూ విన్నారు: "చూడు... నువ్వు గొప్ప తెలివైనదానివి. ఈ అన్నం అంతా ఏమీ పారేయవు. రేపు దీని రూపం మార్చి ఏ పులిహోరగానో, దద్ధోజనంగానో మాకు పెట్టేస్తావు. మేం వెర్రివాళ్ళలాగ దాన్ని చచ్చినట్లు తింటాం. ఇంక ఆ గొడవ వదిలి ఇది తిను" అంటూ తనే ఒక ముక్క తుంచి ఆవిడ నోటికి అందించారు.

పిల్లలు స్వీట్లు కూడా అప్పుడే తినడం మొదలుపెట్టారు. "రేపు అన్నది లేదా? ఎవరైనా మీ వంతు తినేస్తారా?" అంటూ ఆవిడ దెబ్బలాడి వాళ్ళ దగ్గరనుండి ఆ పాకెట్లు లాక్కుంది.

పండు తండ్రికి ఫిర్యాదు చేశాడు "చూడు నాన్నా! అమ్మ స్వీట్లు దాచేస్తోంది"

ఆయన భార్యవైపు చూసి నవ్వారు "నీకు రేపు అన్నదానిమీద ఎందుకింత తాపత్రయం? రేపు ఉంటామో చస్తామో! ఈ క్షణమే మనది. వాళ్ళని బాధపెట్టక ఇచ్చెయ్యి" అన్నారు.

ఆవిడ బుగ్గలమీద చెయ్యి వేసికొంది. "రేపు ఉండమా? ఇప్పుడే మనదా? అలాంటప్పుడు ఉన్న డబ్బేదో నా మొహాన కొట్టొచ్చుకదా! ఆ దాచుకోవడం దేనికి?" అంది.

ఆయన సమాధానం చెప్పలేనట్లు చూశాడు.

పిల్లలు తండ్రితో కాసేపు కబుర్లు చెప్పి, ఆటలు ఆడి పడుకొన్నారు. ఆకలి లేదని చెప్పి ఆయన కాస్త మజ్జిగ తాగారు. ఆవిడ మనసులోనే విసుక్కొంది. బయటికి వెళితే ఒళ్ళు తెలియదు. రెండు మూడు టిఫిన్లు తినడం, భోజనం మానడం. కాస్త పొద్దుగడిచాక ఆవిడ భోజనం ముగించి, ఇల్లు సర్దుకోవడంలో మునిగింది.

ఆ ఇంట్లో పిల్లలు, ఆవిడ ఒక గదిలో పడుకొంటారు. ఆయన ఇంట్లో ఉన్నా లేకపోయినా ఆయన కొరకు ఆ గది ఉంచేస్తుంది. పిల్లలు కాస్త ఎదిగాక ఆవిడ హాలులో పడుకోవడం చేస్తోంది. ఎదురుగుండా పిల్లలు గదిలో కన్పిస్తూ ఉంటారు.

ఆవిడకి నేల మీద తలగడ ఒకటి వేసికొని పడుకోవడం అంటే ఎంతో ఇష్టం.



పెద్ద పిల్ల నిద్రపోకపోతే తల్లికి ఒక బొంత తెచ్చి పరిచి, దుప్పటివేసి పడక సిద్ధంచేస్తుంది. కొడుకు పేచీపెట్టినపుడు వాడిని దగ్గర పెట్టుకొని నవ్వారు మంచంపై పడుకొంటుంది.

ఆయన గదిలో పాతకాలంనాటి పెద్ద పందిరి మంచం ఉంది. దానిమీద దూది పరుపు, తలగడలు, తెల్లటి ఉతికిన దుప్పటి పరిచి ఉన్నాయి. ఆయన మంచంపై పడుకొని ఆవిడ కదలికలను గమనిస్తున్నారు.

తలుపులన్నీ వేసి ఆవిడ పిల్లల గదివైపు నడిచి, వాళ్ళని ఒకసారి చూసి, పలుచటి దుప్పట్లు తీసి వాళ్ళకి కప్పింది. తలగడ తీసుకొని హాలువైపు నడవబోతుంటే ఆయన సన్నగా దగ్గారు.

"ఇదిగో! కాసిని మంచినీళ్ళు ఇస్తావా? "

ఆవిడ చెంబుతో మంచినీళ్ళు తీసుకెళ్ళింది. ఆయన దాన్ని అందుకొని కొద్దిగా తాగారు. "రెండు అగరువత్తులు వెలిగించకూడదా? "

ఆవిడ ఏమీ మాట్లాడకుండా ఆ పని చేసింది. ఆయన వెళ్ళబోతున్న ఆవిడ చేతిని పట్టుకొని ఆపారు. "ఇదిగో! కాసేపు నా దగ్గర కూర్చో"

ఆవిడ ఆయనవైపు ఓరగా చూసింది. 'కోరికలేమీ దాచుకోరు' అనుకొంది. ఆయన తలగడ కిందనుండి రెండు మిఠాయికిళ్ళీలు తీశారు. ఆవిడ నోటికి ఒకటి అందించారు.

"ఇదిగో! చూడండి. మీరు ఈ కుటుంబ బాధ్యత సక్రమంగా నిర్వహించే వరకూ నన్ను ముట్టుకోవద్దు"

ఆయన ఆవిడ మాటలకి నవ్వారు. "నేను కాకపోతే ఎవరు వహిస్తున్నారు? పండు పుట్టాక నువ్వు నా మాట అసలు నమ్మడం లేదు. నాకు మాత్రం బాగా సంపాదించాలని, మిమ్మల్ని సుఖపెట్టాలని ఉండదా? నిన్ను ఒక మహారాణిగా భోగాలనుభవించేలాగ చూడాలనిపిస్తుంది"

ఆవిడ ఆయన మొహంలోకి తేరిపార చూసి నెమ్మదైన స్వరంతో అంది. "నాకు మహారాణిగా బతకాలని, అష్టైశ్వర్యాలు అనుభవించాలని లేదు. ముగ్గురు బిడ్డల తల్లినైనా నా మనసు మీకు అర్థమవలేదు"

ఆయన ఆవిడ బుగ్గపై చిటికవేశారు. "నువ్వేమిటో నీ మనసేమిటో మన పెళ్ళికి ముందు మీ నాన్నగారు నాకు కబురు పంపినప్పుడే అర్థమైంది"

ఆవిడ మొహం సిగ్గుతో ఎర్రబడింది. పాత జ్ఞాపకాల దొంతరలు మిగిల్చిన ఆ అనుభూతిని ఆయన మనస్ఫూర్తిగా ఆస్వాదించారు.

"ఇదిగో! ఇలాంటి సాదా చీరలు నా ముందు కట్టకూడదు. ఉదయం డబ్బు ఇస్తాను. చక్కటి జరీచీరలు తీసుకో! వీలు చూసుకొని గాజులు కూడా చేయిస్తాను" ఆయన ఆవిడ చుబుకం ఎత్తి ప్రేమగా చూశారు.

"మీరు నాకు ఏ ఆశలూ పెట్టవద్దు. నాకు, మన పిల్లలకి కడుపునిండా కాస్త అన్నం పెట్టండి చాలు. బాధ్యతగా ఇంటిపట్టున ఉండి మా కష్టసుఖాలు చూసుకొంటే చాలు" ఆవిడ మూసిన కనురెప్పలనుండి రెండు కన్నీటి బిందువులు రాలాయి.

ఆయన సుతారంగా ఆ రెప్పలపై చుంబించారు. "నాకు అన్నీ తెలుసును. నువ్వు ఇంక నిశ్చింతగా ఉండు. మనమిద్దరం సంతోషంగా గడిపి ఎన్ని రోజులైంది చెప్పు? "

ఆవిడ ఇంకా పిల్లలు తండ్రికోసం ఎలా అల్లల్లాడుతున్నారో, తను ఎన్ని బాధలు పడుతోందో ఆయనకి చెపుదామనుకొంది. కానీ ఆయన పడనీయలేదు.

రాత్రి కబుర్లు ఉదయం వరకు ఉంటాయా అనుకున్న ఆవిడ అంచనా తప్పయింది. ఆయన మూడు వందలు తీసి ఆవిడ చేతికిచ్చాడు. "మంచి చీర కొనుక్కో" అన్నారు.

"చీరకేం తొందర, ముందు ఇంట్లో సరుకులు నిండుకొన్నాయి" అందామె.

మరొక రెండువందలు అందించాడు. "సాయంత్రం కొత్త చీరలో కన్పించాలి" అంటూ హెచ్చరించాడు. ఆవిడ అలాగే అంటూ ఐదువందలూ పెట్టెలో పెట్టింది.

"ఊ... త్వరగా బజారుకు వెళ్ళి తెచ్చుకో" అన్నాడు.

కామాక్షమ్మ పలుచగా నవ్వింది "లేడికి లేచిందే పరుగు. అలాగుంది మీ హడావుడి. వంట అయ్యాక వెళతాను" అంది.

పాలవాడిని కేకలువేసి మరొక లీటరు పాలు పోయించారు ఆయన. "ఉదయం అరలీటరు, సాయంత్రం అరలీటరు ఏంసరిపోతాయి? మన పూర్వీకులు జమీందారులు. మనం ఆ ఫాయిదాలో బతకాలి. ఒరే అబ్బీ నువ్వు రేపటినుండి రెండు లీటర్లు పొయ్యి, ఉదయం లీటరు, సాయంత్రం లీటరు పొయ్యి. తెలిసిందా? " ఆయన పాలవాడిని హెచ్చరించాడు.

ఆపూట దోసకాయ పప్పు, వంకాయ ఉల్లి కారం కూరా వండమన్నారు. పాలతో సేమ్యా చేయమన్నారు. గడ్డపెరుగు, ఆవకాయ వగైరా తన కోరికలన్నీ బయటపెట్టారు.

తీరా భోజనాల వేళ బిలబిలమంటూ ఆయన అన్నగారు, వదిన, పిల్లలు దిగిపోయారు. "మావాడు ఇంటిపట్టునే ఉన్నాడే" అంటూ అన్నగారు కళ్ళు ఎగరవేశారు.

"మా చెల్లెలు సామాన్యురాలు కాదు. మరిదిని కొంగున ముడివేసుకొంటుంది" తోడికోడలు వేళాకోళంగా అంది.

గిరిజకి వాళ్ళందరినీ చూస్తే ఒళ్ళు మండింది. తండ్రి ఇంటిదగ్గర ఉన్నప్పుడు పిండివంటలు, సినిమాలు, షికార్లు ఉంటాయి. తండ్రికి చుట్టాలంటే పిచ్చి ఇంక వాళ్ళతో పగలు, రాత్రి ఒకటే కబుర్లు... ఛీ... ఈ చుట్టాలు ఇప్పుడే రావాలా అనుకొంది.

కామాక్షమ్మ గిరిజని బతిమాలి కొట్టుకు పంపి బంగాళాదుంపలు తెప్పించింది. భోజనాల దగ్గర సేమ్యా, పెరుగు అవీ చూసి "మా మరిది రెండుచేతులతో సంపాదిస్తున్నాడన్నమాట" అంటూ డేగకళ్ళతో చూసింది తోడికోడలు.

కామాక్షమ్మ పెదవులపై పలుచటి దరహాసం విరిసింది. తన పిల్లలు చారు, కొత్తిమీర కారంతో తినలేక పేచీలు పెడుతూ, ఏడ్చిననాడు ఎవరూ రారు. అదేం ఖర్మో భర్త ఇంట ఉంటే ఇల్లు పెళ్ళివారి ఇల్లులాగే అవుతుంది.

సాయంత్రం ఆయన మేనమామ కొడుకు, భార్య దిగారు. వాళ్ళందరినీ చూసి ఆయన పొంగిపోయారు. వంటింట్లోకి వచ్చి భార్యతో "చూడు... నేను నీకు ఇచ్చిన డబ్బు ఖర్చుపెట్టు. రెండు బొమ్మలు వేశానంటే మళ్ళీ సంపాదిస్తాను. డబ్బుదేం ఉంది? ఇవాళ వస్తుంది. రేపు పోతుంది. కానీ మన పరువు, ప్రతిష్ట మనం నిలుపుకోవద్దా? " అన్నారు.

ఆవిడ మారుమాట్లాడకుండా బియ్యం, కూరలు మొదలైనవన్నీ ఆ డబ్బు తీసి తెప్పించింది.

"వదినకి సినిమాలంటే సరదా! పిల్లలు, నువ్వు, వదిన వెళ్ళండి" ఆయన ఆజ్ఞ జారీ చేశాడు.

బంధువులు మూడవనాడు వెళతానన్నా వెళ్ళనీయలేదు. మరో రెండురోజులు బలవంతంచేసి ఉంచేశారు. ఈ నాలుగురోజులూ బొమ్మలూ లేవు, మరేమీ లేవు. తాతలనాటి కబుర్లతో, పిండివంటలతో, నవ్వులతో ఇల్లు సందడిగా మార్చేశారు.

"మా కృష్ణుడి మనసు అమృతం. వాడికి ఎప్పుడూ నలుగురు కావాలి" వెళుతూ వెళుతూ అన్నగారు ఒక సర్టిఫికెట్ పడేశారు.

అందరూ వెళ్ళిపోయాక చిందరవందరగా ఉన్న ఇల్లంతా సర్దుకొంది కామాక్షమ్మ. డబ్బు క్షణాలలో ఖర్చయిపోయింది. కొట్టువాడికి పాత బాకీ కట్టలేదు. పాలవాడికి



రెండు నెలల డబ్బు ఇవ్వాలి. బియ్యం రేప టితో నిండుకొంటాయి. ఆవిడకి ప్రాణం ఉసూరుమంది.

'ఇల్లన్నాక బంధువులు రాకుండా ఉండరు. కానీ మరీ ఇలాగ ఒంటిమీద బట్ట లుంచుకోకుండా గెంతాలా? అలవికాని మర్యాదలు చేయాలా? వాళ్ళకి ఉన్నంతలో తాము తినేదే వాళ్ళకీ పెట్టవచ్చునుకదా! అబ్బే... అలాగ కుదరదు. గొప్పకి పోవద్దూ... వాళ్ళందరూ మెచ్చుకొంటే చాలు ఐరావతం ఎక్కి ఊరేగినంత సంతోషం' ఆవిడ మనసులో చిరాకుని అణు చుకొని, భర్తవైపుతిరిగి "మీకు కాస్త ఉప్మా చేసి పెడతాను. టిఫిను తిని, కాఫీ తాగి బొమ్మవేసుకొందురుగాని అంది"

"బొమ్మా! ఇప్పుడా! నాకు మూడ్ లేదు. నీతో, పిల్లలతో సరదాగా గడపకుండా అస్త మానూ ఎంతకని వేస్తాను? " అన్నారు.

ఆవిడ విస్మయంగా చూసింది. "అస్త మానూ ఎక్కడ వేస్తున్నారు? మీ వాళ్లు ఉన్న ఈ నాలుగు రోజులూ వాటి జోలికే



వెళ్ళలేదుకదా! పైగా మీ బావగారు అడిగా రని వేసిన లక్ష్మీదేవి బొమ్మ ఇచ్చేశారాయె"

ఆయన ఉంగరాల క్రాఫ్ సర్దుకొన్నారు. తర్వాత తన పొడుగాటి, సుకుమారమైన వేళ్ళవైపు చూసుకొన్నారు. "ఈ చేతులలో శక్తి ఉంది. అలాంటి లక్ష్మీదేవి బొమ్మలు వంద వేస్తాను. సరేనా? ఆ బొమ్మ ఇచ్చి నందుకు వాడు ఎంత ఆనందించాడు?" అంటూ ఆయన పరవశంగా తన చిన్ననాటి కబుర్లు జెప్పసాగారు. ఆయనని బొమ్మల వైపు నడిపించాలన్న ఆవిడ కోరిక తీరక పోగా, ఆవిడని తన శ్రోతగా చేసుకొనే ఆయన కోరిక మాత్రం తీరింది.

ఎంతసేపూ మా తాతలు నేతులు తాగారు. మా మూతులు వాసన చూడం డనే ఆయన కబుర్లంటే ఆవిడకి చిరాకు. వాస్తవాన్ని గుర్తించని ఆ గొప్పలు ఎందుకు? కబుర్లతో కడుపులు నిండవు కదా?

చద్దన్నం తినకుండా సాంబారు, ఇడ్లీ కావాలని పేచీ పెడుతున్న పండుని ఆవిడ నాలుగు బాదింది. తండ్రి వచ్చాడంటే చాలు ఒక్కళ్ళూ మాట వినరు. ముగిసింద నుకొన్న బొమ్మను తృప్తిగా చూస్తున్న ఆయన దాన్ని వదిలి, వచ్చి కొడుకుని ఎత్తు కొన్నారు.

"అమ్మ మంచిది కాదు. నేను బజారుకెళ్ళి బొమ్మ ఇచ్చి బోలెడు ఇడ్లీలు, పూరీలు తెస్తాను. అందాక పేచీ పెట్టక పెరుగు అన్నం తిను" అంటూ బుజ్జగించారు.

ఆవిడ గయ్యిమని లేచింది. "వెధవ వేలె డున్నాడో లేడో, ఇప్పటినుండే పేచీలు. ఇంట్లో ఉన్నవి పనికిరావుట. వీడేం లక్షాధి కారి కొడుకా? కోరినవన్నీ రావడానికి?"

పండు తండ్రి వీపుమీద వాలి వెక్కిళ్ళు పెట్టాడు. ఆయన కాస్త గట్టిగా అన్నారు. "నామీద కోపం వాళ్ళపై చూపిస్తావెం దుకూ? వాడు పసివాడు. ఏమీ తెలియని వయసు."

ఆవిడ విసురుగా అంది. "ఈ ఇంట్లో పెద్దవాళ్లూ పసివాళ్ళల్లాగే ఉన్నారు. బాధ్యత ఏ మాత్రం తెలిసినా ఇల్లు ఇలా ఉండదు"

మధ్యాహ్నం పడుకొన్నా ఆవిడకి నిద్రపట్ట లేదు. పూర్తిగా డబ్బు అయిపోతే గాని బొమ్మ గీయడు. బొమ్మలు అమ్మిన డబ్బు పోనీ చేతిలో పెడతారా అంటే అదీ ఉండదు. పదీ, పరకా ఏదో ముష్టి వేసినట్లు బుద్ధి పుట్టినప్పుడు ఇస్తారు.

ఇంటికి కావలసిన సరుకులు, బియ్యం అవీ చూస్తాడా అంటే అదీ ఉండదు. ఎలా ఇల్లు నడపాలి? ఏ ఆశతో బతకాలి? ఆశల మాట దేముడెరుగు. అసలు తమ అవసరాలు ఎలా తీర్చుకోవాలి?

ఈ గాలివాటం మనిషినిచ్చి పెళ్ళిచేసిన తండ్రిమీద ఆవిడకి చెప్పలేనంత కోపం వచ్చింది. పెద్ద జమీందారుల ఇంటి ఆడప డుచు. అయితేనేం బతుకు ప్రతీపూటా ఎలా నడుస్తుందా అన్న బెంగే. మెట్టినింటివారు భూస్వాములు. పెద్ద పేరున్న వంశం వారిది. అదృష్టం మాత్రం ఇలాగ వెక్కిరి స్తోంది.

ఆవిడ చూపులు ఇంటి పైభాగానికి మళ్ళాయి. ఈ మాత్రం గూడు నిలబెట్టుకో వడానికి ఎన్ని పాట్లు పడవలసివచ్చింది. ఆవిడకి ఆ స్థలాన్ని అతితక్కువ ధరకి తనకి ఇచ్చిన సన్యాసిరాజుగారు ఆ క్షణంలో గుర్తు వచ్చారు. ఆవిడ ఆయనని ఎప్పుడైనా మరి చిపోతేకదా! ప్రతీ రాత్రీ పడుకొనే ముందు ఆయన చల్లగా ఉండాలని భగవంతుడిని ప్రార్థిస్తుంది. ప్రతి ఉదయం దేవుడికి దీపం పెట్టుకొనేటప్పుడు ఆయన వంశం అభివృద్ధి చెందాలని నివేదించుకొంటుంది. మేలు చేసి నవారిని గురించి ఆ మాత్రమైనా స్మరించు కోవడం మనిషి యొక్క ప్రాథమిక ధర్మ మని ఆవిడ ఉద్దేశం.

ఆ స్థలంలో అతిసులభంగా మూడు ఇళ్ళు చిన్నవి కట్టుకోవచ్చును. కానీ ఆవిడ ఐదుగ





దులే వేసింది. మిగిలిన స్థలమంతా మొక్కలు రకరకాలవి పెంచుతోంది. మూడు గదులు పెంకులతో వేస్తే రెండు రేకులతో ఉంచింది. ఎప్పుడో కాలం కలిసి వచ్చినప్పుడు డాబా ఇల్లు కట్టుకోవచ్చున న్నది ఆవిడ కోరిక.

భార్యా పిల్లలకి సదుపాయం కలిగించక పోయినా వాళ్ళని నష్టపరచడంలో రాధాకృ ష్ణమూర్తిది పెట్టింది పేరు. ఆయన తెచ్చే తగాదాలకి ఆవిడ ఎన్నో ఇళ్ళు మారవలసి వచ్చేది.

ఉద్యోగం ఉన్నవాళ్ళకీ, స్థిర ఆదాయం ఉన్నవాళ్ళకే ఇళ్ళు అద్దెకి దొరకడం కష్టం. అలాంటిది నికరమైన ఆదాయం లేని ఈ కుటుంబానికి ఇల్లు అద్దెకిచ్చారంటే ఆవిడ మంచితనమే కారణం. కొన్నిసార్లు నెలనెలా అద్దె చెల్లించలేకపోయేది.

ఆరునెలలు గడిచేసరికల్లా ఆయన ఇంటి వాళ్ళతో ఏధోరకంగా పేచీకి దిగేవాడు. వాళ్ళు అద్దె అడగడానికి వచ్చారా ఏదో రకంగా తగాదా పెట్టేవాడు. బాత్‌రూం సరిగ్గా లేదనో, కుళాయి నీరు సరిగ్గా ఇవ్వడం లేదనో ఏదో ఒక లోపం చూపే వారు.

అద్దెకున్నవాడే నోరు పారేసుకుంటే ఇంటి యజమానులు ఊరుకొంటారా?

"మూడు నెలలకొకసారి అద్దె ఇచ్చే మీలాంటి వారికి ఈ మాత్రం ఇల్లు చాలులే" అని ఒక రంటే,

"వెళ్ళెళ్ళవయ్యా. ఆడది, పిల్లలతో ఉందని ఇచ్చాంగానీ నీ మొహం చూసి ఇవ్వలేదు" అనేవారు మరొకరు. "భార్యాబిడ్డలను పోషించలేనివాడివి, నీతో మాకు మాటలేమి టని" మరొకరు దులిపేవారు.

దానితో ఆయన వీరావేశం ప్రదర్శించే వారు. తనలాంటి ఆర్టిస్టు ఉండే లొకాలిటీ అది కాదని, వాళ్ళు సంస్కారహీనులని తిట్టి ఇల్లు ఖాళీ చేసేవాడు.

మొదట్లో పెద్ద ప్రేమ కారిపోయేవాడి లాగ ఎక్కువ అద్దెకి డాబా ఇళ్ళల్లో దింపే వాడు. ఇరవైరోజులు ఇంటిపట్టున ఎలాగో ఉండి, ఒక నెల అద్దె చేతిలో పెట్టి దేశా టనం వెళ్ళిపోయేవాడు. మళ్ళీ ఎప్పుడు వస్తాడో తెలియదు. మనీఆర్డర్లు పంపుతాన నేవారు. ఆవిడ ప్రతిరోజూ ఎదురుచూడ టమే. పిల్లలతో పడే బాధలు ఇన్నీ అన్నీ కావు. ఈ ఇబ్బందులు పగవాడికి కూడా వద్దురా బాబూ అని బాధపడిన రోజులెన్నో!

ఏ రెండు మూడు నెలలకో ఆయన వచ్చే వారు. "శుభ్రమైన ఇంట్లో నిన్ను ఉంచితే ఉండలేవా? ఈ రెండుగదుల ఇల్లు ఏం బావుంది? నీకు బాగా బతకడం రాదు. పెద్ద వంశంలో పుట్టినంతమాత్రాన పెద్ద బుద్ధులు అబ్బవు. విశాలమైన పరిసరాలలో బతకాలి. విశాలంగా ఆలోచించాలి. ఈ ఇరుకు గదులలో బతకడం గొప్పా?" అంటూ నోటికి వచ్చినట్లు తిట్టేవారు.

"ఫలానా ఆర్టిస్టు రాధాకృష్ణమూర్తి ఆ మారుమూల సందులో, ఆ మురికి కాలవల దగ్గర్లో, ఆ ఇరుకుగదుల్లో ఉన్నాడంటే నాకు ఎంత నామర్దా! ఎంత అవమానం? నా పరువు ప్రతిష్టల గురించి నువ్వు ఆలోచిం చావా?" అని కళ్ళెర్రచేసేవారు.

కామాక్షమ్మ పైటకొంగుతో మొహం గట్టిగా తుడుచుకొని నెమ్మదిగా జవాబు చెప్పేది.

"ఫలానా రాధాకృష్ణమూర్తి భార్య ఇంటి అద్దె నెలనెలా ఇవ్వదు. ఇంటివాళ్ళచేత తిట్లు తింటుంది. అసలు ఆవిడకి భర్త అండ ఉందో, లేదో అనుమానమే అని నలు గురూ నాలుగు రకాలుగా అంటే ఫర్వాలేదా?

"ఏవమ్మా! అద్దె సక్రమంగా ఇస్తావా? ఇల్లు ఖాళీచేస్తావా? మంచి మనిషికి ఒక మాట, మంచి ఎద్దుకి ఒక దెబ్బ. మరి మౌనంగా ఉండటం మా వలన కాదు. దయచేసి ఖాళీ చెయ్యి తల్లీ! అని వాళ్ళచేత మేం అన్పించుకొంటూంటే మీ పరువు బజా



సచిత్ర విచిత్రం



# లేడీస్ మాన్

బ్రియన్ జెంబిక్ (37) వృత్తిరీత్యా జూదరి. ఓసారి మిత్రులతో మాట్లాడతూంటే వాళ్లు "మగవాళ్లకి వక్షోజాలుంటే బాగుండదు" అన్నారు. "బావుంటుంది. అలాంటి మగవాళ్ల వెంట ఆడవాళ్లు పడతారు కూడా" అన్నాడు బ్రియన్. ఆ విషయం మీద లక్ష డాలర్లు బెట్ కట్టమన్నారు వాళ్లు. బ్రియన్ '38 సీ' సైజులో తన ఛాతీ మీద ఓ ప్లాస్టిక్ సర్జన్‌తో వక్షోజాలని ఇన్‌ప్లాంట్ చేయించుకున్నాడు. అందుకు 4500 డాలర్లు ఖర్చయింది. బెట్ ఓడిపోవడంతో అతని మిత్రులు అతనికి లక్ష డాలర్లు సమర్పించుకున్నారు. అంతేకాదు బ్రియన్ చెప్పినట్టు ఆడవాళ్లు అతని వెంట పడుతున్నారు కూడా.

రున పడదా?

"ఇల్లు ఇరుకుగా ఉన్నా ఫర్వాలేదు. మనిషి మనసు ఇరుకుగా ఉండకూడదు. ఈ ఇల్లు, ఈ రెండు గదులూ నాకు రెండం తస్తుల భవనాలు. నేను, నా పిల్లలు తల దాచుకొందుకి ఇవి చాలు" అని నిష్కర్షగా చెప్పేది. ఆయన నాలుగు రోజులవరకూ గొణుగుతూనే ఉండేవారు.

పిల్లల చిన్నప్పుడు ఆయన మొదట్లో ఊళ్లు తిప్పేవాడు. కొన్నాళ్ళు రాజమండ్రే నా వృత్తికి తగిన ఊరు అనేవారు. కొన్నాళ్ళు ఏలూరు, మరికొన్నాళ్లు కాకినాడ. ఆవిడ కొద్ది సంవత్సరాలు అలాగే పెళ్ళయ్యాక ఆయనమాట కొట్టిపారేయలేక కొంతా, జీవితంలో అనుభవం లేక కొంతా ఆయన వెనకాల తిరిగేది. కుక్కతోక పట్టుకొని గోదావరి ఈదిన చందంలాగ అయ్యేది పరిస్థితి. చివరికి పిల్లలతో తెలిసిన ఊళ్లోనే స్థిరంగా ఉండిపోయింది.

కామాక్షమ్మ ఉండే ఇంటికి దగ్గర్లో సుబ్బమ్మగారు ఉండేవారు. ఆవిడకి కామాక్షమ్మంటే ఇష్టం. కామాక్షిలోని నీతి, నిజాయితీ, ధైర్యం, పట్టుదల ఆవిడకి నచ్చాయి. పాపం పెద్దింటి బిడ్డ పిల్లలతో కష్టపడుతోందని బాధపడేవారు. పక్కవీధిలో ఖాళీగా పడున్న ఈ స్థలం గురించి ఆవిడే చెప్పారు.

"కామాక్షీ! నేను నా బొందిలో ప్రాణం ఉండగా ఈ ఊరు వదలను. నా భర్త ఇక్కడే కన్ను మూశారు. నేనూ ఇక్కడ మట్టి కొనుక్కొన్నాను. మగబిడ్డలిద్దరూ డబ్బాశకొద్దీ విదేశాలు పోయారు. పోతే పోనీ! నా జీవితం మాత్రం ఇక్కడే గడవాలి. నువ్వు ఆ స్థలం యజమానిని కలుసుకో. ఆయన మంచివాడు. ఎంతో కొంత రేటుకి దాన్ని స్వంతం చేసుకో. నేను నీకు డబ్బు అప్పు ఇస్తాను. నెమ్మదిగా తీర్చు" అందామె.

కామాక్షమ్మకి సుబ్బమ్మగారిలో దేవుడే కన్పించాడు. "సుజనులందు తరచు సొచ్చి యుందు" అన్నట్లు సుబ్బమ్మగారి మనసులో ఆ దేవుడే ఉండి ఈదారి చూపించాడేమో! గ్రాసం లేకపోయినా వాసం అయినా ఉంటే చాలనుకొంది.

చెమర్చిన కళ్ళతో సుబ్బమ్మగారికి రెండు చేతులూ ఎత్తి నమస్కరించింది. "నా శక్తికొద్దీ మీ సేవ చేసుకొంటాను. మీకు ఏమిస్తే ఈ రుణం తీరుతుంది?" అని అంటూంటే "పిచ్చిపిల్లా! మనిషికి మనిషి అండ. అంతే!" అని ఆమె తలనిమిరారు.

ఆడపిల్లలిద్దరినీ పెద్దక్కగారి దగ్గర ఉంచి, నాలుగు రోజులలో వస్తానని సుబ్బమ్మగారితో కలిసి హైదరాబాద్ వెళ్ళి ఆ స్థలం ఓనర్ సన్యాసిరాజుగారిని కలిసింది.

ఆయనతో తన కష్టం గురించి చెప్పుకొంటూంటే ఆవిడకి గొంతు వణికింది. "బాబుగారూ! కష్టాలే తప్ప జీవితంలో సుఖం ఎరగనిదాన్ని. భర్త ఉన్నా ఆసరా అన్నది అవడంలేదు. ఈ బిడ్డలతో ఏ దారీ కన్పించక బాధపడుతున్నాను. మీరు ఆ స్థలం మాకు ఇస్తే మీ ఇంటి ఆడబిడ్డగా భావించి, మీ సుఖం కోరుతూ నిత్యం భగవంతుడిని ప్రార్థిస్తాను. నా జీవితానికి ఒక నీడ చూపిన వారవుతారు. చావడానికి పిల్లలు అడ్డు వస్తే బతకడానికి వంశం, ప్రతిష్ట అడ్డుపడుతున్నాయి" అంది.

ఆమె మాటలు ఆయనని కదిలించాయి. ఒక స్త్రీ మూర్తి అంత దూరంనుండి సహాయమర్థించడానికి తన వద్దకి వచ్చింది. పిల్లలు బెంగుళూర్, హైదరాబాద్‌లలో ఇళ్లు కట్టుకొన్నారు. తనకి తమ ఊరు వెళ్ళి ఉండాలన్న కోరికగాని, అవసరంగాని లేవు. స్థలం వట్టినే వదిలేసే బదులు దీపం పెట్టుకొంటామన్న వాళ్ళకి ఇవ్వడమే మంచిదనుకొన్నారు. పిత్రార్జితంగా దాన్ని ఇన్నాళ్ళూ ఉంచుకొన్నారు. ఇప్పుడు అది ఒక కుటుంబానికి ఆసరా అవబోతోంది.

ఆయన స్థలానికి డబ్బు పుచ్చుకోనన్నారు. కానీ కామాక్షమ్మ ఒప్పుకోలేదు. తను



ఇచ్చేది స్వల్పమే అవవచ్చును. కానీ ఎంతో కొంత ఇవ్వడం అన్నది ఆవిడకి తృప్తినిచ్చే విషయం. ఎన్నో కాలేజీలు, హైస్కూళ్ళు ఉండి ఎంతో జనసమర్థం కలిగిన ఆ ఊళ్లో స్థలం ఎక్కువ ఖరీదే చేస్తుంది. కానీ ఆయనకి ఆమెనుండి డబ్బు పుచ్చుకోవాలన్పించ లేదు. వీలు చేసుకొని వచ్చి పైసా ఆవిడకి ఖర్చవకుండా స్వయంగా రిజిష్ట్రేషన్ చేయించి కాగితాలు ఆవిడకి అప్పచెప్పి వెళ్లారు.

★ ★ ★

కొన్నాళ్లకి రాధాకృష్ణమూర్తి ఇంటికి వచ్చాడు. భార్య స్థలం కొందని తెలిసి నానా రభసా చేశారు. ఆయన మగబుద్ధి పోనిచ్చుకున్నారు కాదు. "ఏ సంబంధమూ లేకపోతే ఆయన నీపై జాలితో అంత చవకగా స్థలం ఇస్తాడా? " అని గొడవ.

"వీడు ఇంటిపట్టున లేడుకదా. ఏం చేసినా చెల్లుతుందనుకొంటున్నావు కాబోలు. నిన్ను వీధిలోకి ఈడుస్తాను. మీ పుట్టింటి పరువు తీస్తాను" అంటూ రంకెలు వేశారు.

కామాక్షికి ఒళ్ళు మండింది. అమ్మ పెట్టదుట. అడుక్కుతిననీయదుట. అలాగుంది ఈ గొడవ. ఆవిడ సూటిగా ఆయన మొహంలోకి చూస్తూ అంది.

"నేనే గనుక తప్పుదారిలో నడవాలనుకొంటే ఇంతకాలం పట్టదు. ఏనాడో ఆపని చేసేదాన్ని. ఇన్ని పస్తులు, ఇంత దరిద్రం అనుభవించవలసిన అవసరమే లేదు. కామెర్ల రోగికి లోకం అంతా పచ్చగా కన్పిస్తుందిట. అలాగ మీరు ఎందుకు ఊళ్లు పట్టుకుని తిరుగుతున్నారో, ఆయా ఊళ్లల్లో మీ నిర్వాకం ఏమిటో తెలియనిదాన్ని కాను. నా నిజాయితీ గురించి, పాతివ్రత్యం గురించి ఒకళ్ళకి నేనెందుకు సంజాయిషీ ఇవ్వాలి? ఈ వాదన అనవసరం"

ఆవిడ మాటలు చెళ్ళుమని కొరడా దెబ్బల్లాగా ఆయనకి తగిలాయి. ఆయన ఎన్ని సార్లు గొణుక్కున్నా ఆమె పట్టించుకోలేదు. "ఇవన్నీ పట్టించుకొంటే ఈ పిల్లల్ని పెంచలేను ఈ జీవితం గడపలేను" అనుకొంది. ఆవిడకి తన తండ్రి ఈ సంబంధం విషయంలో చూపిన పట్టుదల గుర్తురాని క్షణాలంటూ ఉండవు.

ఏం పెద్దవాళ్ళు? ఏం సాంప్రదాయాలు? వాళ్ళు పట్టిన కుందేలుకి మూడేకాళ్ళంటారు. ఈనాటి తన దైన్యస్థితి ఆయన చూస్తే తెలిసేది. తను ఆనాడే నెత్తీ నోరూ కొట్టుకొంది. ఎవరు తనమాట విన్పించుకున్నారు? ఆమె మనసు గతంలోకి వెళ్ళింది.

పద్మనాభంగారికి నలుగురు ఆడపిల్లలు. మీనాక్షి, వనజాక్షి, కామాక్షి, విశాలాక్షి. ఆడపిల్లల నలుగురి మధ్య ఒక్క కొడుకు. ఎన్నో పూజలు చేయగా పుట్టాడు. అతడంటే ఆయనకి అపురూపం. యశోదమ్మకి నలుగురు ఆడపిల్లలూ ఒక ఎత్తయితే కొడుకు శ్రీరామ్ ఒక్కడూ ఒక ఎత్తు. అందంగా, అపురూపంగా పుట్టిన కొడుకుని ఆవిడ అరచేతుల్లో పెట్టుకొని పెంచింది.

పద్మనాభంగారికి వంశం, సాంప్రదాయం అంటే ప్రాణం. ఎప్పుడూ వచ్చీపోయే చుట్టాలతో ఇల్లు పెళ్లివారిల్లులాగ ఉండేది. ఊరికి పెద్దమనిషవడంవలన ఎవరు ఊళ్లోకి వచ్చినా అన్నపానాలు ఆయన ఇంట్లోనే.

ఎంత పెద్ద జమీందారయినా అడ్డూ, ఆపు లేని ఖర్చులు సాగిస్తే ఇల్లు ఏమవుతుంది. ఈయన జమీందారేం కాదుగానీ ఆస్తిలో అంతటివాడే.

పెద్దకూతురు మీనాక్షికి, రెండవ కూతురు వనజాక్షికి తన స్థాయికి మించి పెద్ద సంబంధాలు చేశారు. ఆ పిల్లలిద్దరూ అష్టైశ్వర్యాలతో తులతూగుతున్నారు. మూడవ కూతురు కామాక్షి దగ్గరికి వచ్చేసరికి ఆయన జోరు కొంచెం తగ్గించుకోవలసివచ్చింది. ఈ ఇద్దరు ఆడపిల్లలని సాగనంపాలి. కొడుక్కి ఎలాగైనా ఎక్కువ ఆస్తి ముట్టచెప్పాలి లేకపోతే వాడు ఇబ్బంది పడడూ?

యశోదమ్మకి ఏనాడూ ఇంటి విషయాలు





పట్టలేదు. భర్త మాటకి ఎదురుచెప్పకపోవడమే పాతివ్రత్యం అనుకొన్నది. "చూడండి. మీరు ఏంచేసినా సరే. నా కొడుకు మాత్రం యువరాజులాగా బతకాలి" అని ఏకాంత సమయాల్లో ఆయనకి విన్నపాలు చేసుకొనేది.

"ఈ ఆడపిల్లలకి ఎంత పెట్టినా ఇక్కడి వారా ఏమన్నానా? అత్తవారింట్లో బతికేవాళ్ళు. మన ఇంటిపేరు నిలబెట్టేది, మన వంశం నిలబెట్టేది రేపు మన గొంతులో గుక్కెడు నీళ్ళు పోసేది నా చిట్టితండ్రే! వాడి విలువ వాడిదే"అంటూ యశోదమ్మ చెప్పే కబుర్లు ఆయనకి జీవితసత్యాలుగా అన్పించేవి. స్వతహాగా కొడుకంటే ప్రాణమైన ఆయనకి, భార్య హితబోధలతో కొడుకు మరింత అపురూపం అయ్యాడు.

కామాక్షికి సంబంధం అమలాపురం కరణంగారి మూడవ అబ్బాయితో స్థిరం చేశారు. నందమూరు జమీందారుగారితో సంబంధం కలుపుకోవడమే చాలు. ఇంకా ఆలోచించవలసిన విషయం ఏమిటి? పిల్ల బుద్ధిమంతురాలు, కళ గల మొహం అని రాధాకృష్ణమూర్తి తండ్రి సంబరపడ్డారు.

ఓరోజు భోజనం చేశారు. మధ్యాహ్న సమయంలో కాసేపు నిద్రపోవడం పద్మనాభంగారికి అలవాటు. ఆయన నిద్ర లేచేసరికి కామాక్షి మంచినీళ్ళ గ్లాసుతో ఎదురుగా నిల్చొంది. ఆ పిల్ల అందిచ్చిన మంచినీళ్లు తాగాక ఆయన ఆ అమ్మాయి మొహంవైపు చూశారు.

నలుగురు ఆడపిల్లల్లో కామాక్షిది ధైర్యమైన స్వభావం. మిగిలిన పిల్లలు తండ్రి దగ్గర ఎదురుపడటానికే భయపడతారు. కామాక్షికి అమలాపురం సంబంధం చేస్తే, తర్వాత దానికి తన చెల్లి కొడుకుని ఖాయం చేయవచ్చు ఆడపిల్లలు పెళ్ళిళ్లై ఒక ఇంటివారై వెళితే తనకి బాధ్యత కొంత తెమిలినట్లే. ఆయన ఆడపిల్లలకి పెద్దగా చదువులు చెప్పించలేదు. పెద్ద పిల్లలయ్యాక బయటికి పంపడానికి ఆయన ఒప్పుకొనేవారు కారు. మిగిలిన వారికన్నా కామాక్షే ఎనిమిదవ తరగతివరకు చదువుకొంది. తర్వాత పెద్దదవడంతో ఇంట్లో ఉండిపోక తప్పలేదు.

ఆయన కూతురిని అభిమానంగా చూస్తూ, "ఏవమ్మా! బట్టలేవైనా కొని తేవాలా? " అని అడిగారు.

కామాక్షి తల అడ్డంగా ఊపింది. "నాన్నగారూ! మీరు కుదిర్చిన ఈ సంబంధం నాకు ఇష్టంలేదు" అంది.

ఆయన ఆ మాటలకి విస్మయపడ్డారు.

"ఎందువలన? ఆ అబ్బాయి బావుంటాడమ్మా! వాళ్ల వంశం, పరువు, ప్రతిష్ఠ చాలా గొప్పవి. మన సంబంధం అంటే వాళ్ల ఎంత మొగ్గు చూపుతున్నారో? " ఆయన గర్వంగా మీసాలు దువ్వుకున్నారు.

కామాక్షి కళ్లెత్తి తండ్రి మొహం వైపు చూసింది. తను చెప్పదలుచుకున్నది స్పష్టంగా చెప్పకపోతే తండ్రికి అర్థమవదనుకుంది. "ఆ అబ్బాయికి చదువు లేదు. ఒక స్థిరమైన ఉద్యోగం లేదు. ఎలా? ఎలా నాన్నగారూ ఆ అబ్బాయిని పెళ్లి చేసుకునేది? "

ఆయన ఆ అమ్మాయి మాటలకి ఖంగుతిన్నారు

"వాళ్లకి ఇల్లు, భూములూ ఉన్నాయమ్మా. ఉమ్మడి కుటుంబం. పదిమంది కలిగిన వాళ్లు. మా అమ్మ ఏమనేదో తెలుసా? "

ఆయన కళ్లు తల్లిని గురించిన జ్ఞాపకంలోకి వెళ్లాయి. "ఒరేయ్ అబ్బిగా! ఆడపిల్లని చ్చేచోట పదిమంది ఉండేలాగ చూసుకోవాలి. పదిమంది కంచాల దగ్గర మెతుకులైనా మన పిల్లలు తినడానికి చాలు" అనేది

"మనలాగే వాళ్లదీ పెద్దకుటుంబం. మర్యాద, మన్నన ఎరిగిన వాళ్లు. అదీకాక ఆ అబ్బాయి ఆర్టిస్టు అమ్మా! ఎంతో చక్కగా బొమ్మలు గీస్తాడట. ఆ అబ్బాయి బొమ్మలు చూసి అందరూ ఎంత మెచ్చుకుంటారో"

కామాక్షి తన వేలికున్న లక్ష్మీదేవి

ఉంగరం వైపు చూసింది. ఉంగరాన్ని ముందుకు, వెనుకకు నడపడం ఓ అల వాటు. కానీ అది కేవలం తన మాటలను ధైర్యంగా చెప్పడానికే. ఆయనని వాదనలో ఎవరూ ఓడించలేరు. అయినా ఎలాగో ఒప్పించడానికి ఆమె ప్రయత్నిస్తోంది.

"నూరేళ్ల జీవితం సజావుగా నడుపుకోవా లంటే వధూవరులు ఒకరినొకరు చూసుకో వాలి. భావాలు తెలుసుకోవాలి. ఉమ్మడికు టుంబం రేపు విడిపోవచ్చు నాకు స్థిరమైన జీవితం కావాలి నాన్నగారూ! ఆ అబ్బాయికి ఉద్యోగం చేసే ఉద్దేశ్యం ఉందో లేదో నాకు తెలియాలి. అతడిని చూసిన మీరు చదువే మిటో, ఉద్యోగం చేసే ఉద్దేశం ఉందో లేదో కనుక్కోలేదు కదూ!"

ఆయన ఆ పిల్ల మాటలకి భయపడ్డారు. ఒక అయినింటి ఆడపిల్ల. అందులో తన వంశంలోని ఆడపిల్ల ఇలాగ మాట్లాడ టమా? తన వరుడి విషయంలో తన నిర్ణ యానికే విలువ ఈయమని అన్యాపదేశంగా చెప్పడమా?

"మీ అక్కలిద్దరికీ నేను మంచి సంబం ధాలు చేయలేదా? మీ బావలెవరైనా ఉద్యోగం చేస్తున్నారా? మన వంటి జమీం దారుల ఇళ్లల్లో మగబిడ్డలు పొట్టచేత్తో పట్టు కొని వెళ్ళవలసిన పనిలేదు. వాళ్ళు మనంత ఆస్తిపరులు కాకపోయినా కలిగినవాళ్ళే. నువ్వు లేనిపోనివి ఊహించుకొంటున్నావు. నేను వాళ్ళకి మాట ఇచ్చానమ్మా"

కామాక్షి కూడా తన అభిప్రాయం గట్టి గానే చెప్పింది. అక్కలిద్దరూ తెల్లగా, అందంగా ఉంటారు. తనకి అటువంటి రూపం లేకపోవచ్చును. రూపానిదేం ఉంది? భగవంతుడు ప్రసాదించేది. గుణం ముఖ్యంగా కావాలి. బతకడానికి భరోసా కావాలి. బొమ్మలు వేసి, అమ్మి బతుకు గడపడం సాధ్యమా?

పద్మనాభం కూడా వదలలేదు. కళలు అన్నవి దేవుడి వరప్రసాదాలు. ఒక మంచి చిత్రకారుడు తన వంశంలోకి అడుగుపెడు తున్నాడంటే గొప్ప కాదా? అబ్బాయి చిత్రాలు బాగా వేస్తాడని తనకి చాలామంది చెప్పారు. అబ్బాయి వంశం గొప్పది. అంతో, ఇంతో భూములున్నాయి. ఆయనకి ఆ సంబంధం విషయంలో ఏ ఆక్షేపణా కన్పించలేదు.

అబ్బాయి పచ్చటి ఒంటిరంగుతో ఎంతో బుద్ధిగా ఉన్నాడు. పెద్దవాళ్ళమైన తాము మాట్లాడుకొంటుంటే ఒక్కమాట పెదవివిప్పి పలకలేదు. అలాంటిది పిల్లని చూడకుండా తమ గొప్పతనం చూసి వాళ్ళు అంగీకరిస్తే, తాము మాత్రం అబ్బాయిని వంకపెట్టి ఏమ నగలరు?

కానీ కామాక్షి తాను అబ్బాయిని చూడందే, అబ్బాయితో మాట్లాడందే పెళ్లి చేసుకొనే ప్రశ్నే లేదంది.

ఆయనకి ఈ చిక్కుముడి ఎలా విప్పాలో అర్థమవలేదు. ఇటుచూస్తే కామాక్షి అంటే ఆయనకి చురుకైనదని, తెలివైనదని అభి మానం. తల్లి మాత్రం కామాక్షిని ఒక్కలాగ తిట్టిపోసింది. అక్కలని చూసైనా బుద్ధి తెచ్చుకోమంది.

అక్కలకైతే రెండు మూడు తరాలు కూర్చుని తిన్నా తరగని ఆస్తిగలవారు భర్త లుగా వచ్చారు. వాళ్ళకి డబ్బూ, దస్కం కావాలి తప్ప మిగిలిన విషయాలు పట్టవు. అక్కలూ, వాళ్ళ సంసారాలూ చూస్తే కామా క్షికి నవ్వు వస్తుంది. వాళ్ళకంటూ ఒక అభి ప్రాయం ఉన్నట్లే కన్పించరు. ఇక్కడ ఉంటే తల్లిదండ్రుల మాట, అక్కడ ఉంటే వాళ్ళ అత్తమావల మాట వేదవాక్కులాగా బతికే స్తున్నారు. ఎప్పుడు వచ్చినా ఏ నగలు చేయించుకొన్నారో, ఏ పట్టుచీరలు కొనుక్కొ న్నారో ఇవే కబుర్లు. వాళ్ళ అత్తగారి గొప్పలు, వాళ్ళ గొప్పలు చాటి చెపుతూ కబుర్లు.

ఏదో పనిమీద పుట్టింటికి వచ్చిన వన జాక్షి, ఆమె భర్తా ఈ విషయం విని కామా





క్షిని ఒకటే ఎగతాళి పట్టించారు.

"పెళ్లి కొడుకుని చూడాలనుకొంటున్నావా మరదలా! పద. మనమే వాళ్ళ ఊరు వెళ్ళి వద్దాం. మా మరదలు అందరి అమ్మాయి ల్లాంటిది కాదని చెప్పేస్తాను" అంటూ అతడు నవ్వు.

కామాక్షికి తల్లిపై కోపం వచ్చింది. తల్లిగా కూతురి అభిప్రాయాలకి విలువ నివ్వక, ఇలాగ నలుగురి ముందూ నవ్వుల పాలు చేస్తుందా?

ఎగతాళి చేసిన చిన్నబావే మావగారికి ఒక ఉపాయం చెప్పాడు. బావమరిదికి ఉప నయనం చేయమన్నాడు. చిన్న వయసులో ఒడుగు చేస్తే ముద్దుగా ఉంటుంది. పెళ్లివా రినీ రమ్మనవచ్చును. వధూవరులిద్దరూ చూసుకొంటారు ఒకరినొకరు.

అన్నీ మాట్లాడుకొన్నాం అనుకున్న సమ యంలో కూతురి గొడవ ఆయనకి చిరాకుగా ఉంది. వాళ్ళ అబ్బాయి వాళ్ల మాట వింటా డని, పిల్లని చూడవలసిన అవసరమే లేద న్నాడని వాళ్ళు గొప్పగా చెప్పారు. అలాంట ప్పుడు మా అమ్మాయి మీ అబ్బాయిని చూడాలంటోందని ఎలా చెప్పగలరు? అందువలన చిన్నల్లుడు చెప్పిన ఉపాయమే బావుందనుకొన్నారు.

కామాక్షమ్మ ఒక్క నిట్టూర్పు విడిచింది. వివాహాలు స్వర్గంలోనే నిర్ణయమవుతా యన్న నాన్న మాటలు ఎంత నిజం? భగ వంతుడు నొసటిన్రాత ఒకసారే రాస్తాడు. ఆయన నిర్ణయాన్ని అనుసరించే తమ అదృష్ట దురదృష్టాలుంటాయి. ఏదో తన కంటితుడుపుకి అలా ఆ అబ్బాయిని చూపిం చారు. ఒక్కటి మాత్రం నిజం. వరుడి రూపం అందరినీ మైమరపింపచేసింది.

ఆవిడ తమ పెళ్లినాటి ఫొటోవైపు చూసింది. జీవితంలో ఓడిపోతున్నకొద్దీ పట్టుదల పెరిగిపోతుందేమో. ఈ కాస్త జీవి తానికి ఎన్ని అనుభవాలు? ఎన్ని అనుభూ తులు? తమ ఊరిలో తను గడిపిన బాల్యమే ఆమెకి అపురూపంగా అనిపి స్తుంది.

ఏ చీకూచింతా లేని రోజులు. అక్కలు, అన్న, చెల్లి అందరూ సరదాగా గడిపిన ఆ రోజులు మళ్ళీ రావేమో. తండ్రి పోయాక ఆ ఊరు వెళ్ళడమే తగ్గించుకొంది. ఎందుకు? వెళ్ళి ఏం బావుకోవాలి? వదిన గారికి అహంకారం ఎక్కువ. తను ఆవిడ దృష్టికి ఆనదు. వంటినిండా బంగారం దిగేసుకొని, గాస్ సిలెండర్‌లాగా ఉండే ఆవిడ రూపం గుర్తుకువచ్చి నవ్వుకొంది.

పాపం కొడుక్కి అత్తవారివైపు కూడా డబ్బు వచ్చిపడాలని చూసి చేశారు. అయి నింటి సంబంధం కనుక కోడలు ఏది చేసినా తలవంచుకుని వాళ్ళు భరించవల సిందే? తనకి ఏం ఖర్మ?

★ ★ ★

"అమ్మాయి కామాక్షీ! ఏం చేస్తున్నావు?" అంటూ సుబ్బమ్మగారు వచ్చారు.

కామాక్షి వెంటనే లేచి "రండి పిన్నిగారూ" అంటూ ఆహ్వానించి, పళ్లెంలో బియ్యంతో ఆవిడ ఎదురుగా కూర్చుంది.

"అల్లుడుగారు వచ్చి వెళ్లారుట"

కామాక్షి బరువుగా నిట్టూర్చింది. "ఊ... రావడం ఎంతసేపు? మళ్లీ వెళ్లడం ఎంత సేపు?"

సుబ్బమ్మకి ఆమెని చూస్తే జాలేసింది. "నాలుగు రోజులై నువ్వు కనబడకపోతే అనుకొన్నానులే! గిరిజమ్మ కన్పించి మా ఇంటికి చుట్టాలు వచ్చారంటూ కబుర్లన్నీ ఏకరువు పెట్టింది. ఏం చేసినా నాకు పంపందే నీకు తోచదుకదా! చుట్టాలతో ఖర్చుతో ఏం ఇబ్బంది పడుతున్నావో అన్పిం చింది"

"ఏవిటో పిన్నిగారూ! ఆయన వచ్చి నాలుగు రూపాయలు ఇంట్లో ఉంచుతారను కొంటే ఈ చుట్టాల బెడద వచ్చిపడుతుంది. వాళ్లూ ఆయనా కూడబలుక్కొని వస్తారా అన్పిస్తుంది నాకైతే" కామాక్షి గొంతులోని బాధ ఆవిడ దృష్టిని దాటిపోలేదు.

సుబ్బమ్మ కామాక్షమ్మవైపు సానుభూతిగా చూసింది.

కామాక్షి బియ్యంలోని వడ్లగింజలు ఏరుతోంది. ఆ గింజలని చేత్తో పట్టుకొని గట్టిగా చేటకు రాసి వాటినుండి బియ్యం తీసి పొట్టు ఊదిపడేస్తోంది. పిచ్చిది... ఎంత పొదుపో. ఒడ్ల గింజలని కూడా పోనీయదు అనుకొందావిడ. తను చేస్తున్న పని ఆవిడ చూసి నవ్వడంతో కామాక్షికి కూడా నవ్వు వచ్చింది.

"చూశారా పిన్నిగారూ! నేను అతి పొదుపు చేస్తాను. ఆయన అతి దుబారా చేస్తారు. ఆ భగవంతుడు మమ్మల్ని అతి విచిత్రంగా కలిపాడు"

సుబ్బమ్మగారు కామాక్షిని సమర్థించారు. "నీ ముందు అంటే ముఖస్తుతిలాగ ఉంటుంది. అంత పొదుపు అయిన దానివి కనుకనే నా అప్పు నయాపైసలతో తీర్చావు. అన్నానని కాదుగానీ అతగాడి ప్రసక్తి లేకుండా బిడ్డలకి ఒకదారి చూపించి నువ్వు నిశ్చింతగా బతికే దారి చూసుకో! మళ్లీ పలాయనంట కదా!"

కామాక్షికి నోట్లోంచి మాట బయటికి రాలేనంటోంది. తననితాను సంభాళించుకొని అంది, "ఆయన వస్తే రాజభోగాలు అమరుస్తారు. పిల్లలు నాన్నగారు, నాన్నగారు అంటూ క్షణం వదలరు. తండ్రికోసం వాళ్లు పడే ఆరాటం చూస్తే నాకు బాధ అన్పిస్తుంది. కానీ ఇవేమీ ఆయనకి..."

మాట పూర్తి చేయలేనట్లు ఆగిపోయింది. కాసేపు ఇద్దరూ ఏమీ మాట్లాడుకోలేదు. ఆవిడ వెళ్లబోయే ముందు అంది "మన సావిత్రి మొగుడుకి పనుండి విజయవాడ వెళితే అక్కడ మీ వారు ఎవరితోనో కలిసి సినిమా హాలులో కన్పించారుట. ఇంట్లో రంభలాంటి భార్యని పెట్టుకొని అతగాడికి ఏవిటో ఈ బుద్ధి"

కామాక్షి బలవంతంగా నవ్వింది.

"సావిత్రి భర్త వచ్చి ఈ విషయం చెబితే మేం చాలా బాధపడ్డాం. కాస్త గట్టిగా మందలించు. ఇంటిపట్టున ఉండేలాగ కట్టడిచెయ్యి"

"పుర్రెకోబుద్ధి, జిహ్వకోరుచి అన్న సామెత విన్నారుకదా! అది ఆయన పేరు మహత్యం పిన్నిగారూ! కృష్ణుడి పేరు సార్థకం చేసికొంటున్నారు. మనం ఎన్ని అన్నా పట్టించుకొంటేకదా!"

కామాక్షి మాటలకి ఆవిడ కూడా "అంతేనమ్మా! మనమాట వాళ్లు చెవినపెడితేకదా" అంటూ వెళ్లడానికి లేచారు. ఏరిన బియ్యం భద్రపరచుకొని పెరటివైపు నడవబోతుంటే పిల్లలు "అమ్మా! ఆకలేస్తోందమ్మా!" అంటూ తల్లిని చుట్టుకొన్నారు. ఆమె గిరిజ మొహం చూసింది. కాస్త ఆకలికి కూడా పండూ, గిరిజ తట్టుకోలేరు. వాళ్ల మొహం ఆకలేసినపుడు నయాపైసంత అయిపోతుంది.

ఆవిడ ఇంట్లోకి నడిచి డబ్బాలు వెతికింది. ఇక దాంట్లో మూడు గరిటల మైదా పిండి కన్పించింది. అది తీసి కొద్దిగా జీలకర్ర, పచ్చిమిరపకాయలు, ఉప్పు దంపి వేసింది. బంగాళాదుంపలు పలుచగా ముక్కల్లాగ తరిగి, ఆ ముద్దలో కలిపి, బజ్జీలు వేసింది. పండుకి నాలుగు వేసి తీశాక కాస్త ఎండుకారం కలిపి మిగిలినవి వేసింది. ప్లేట్లలో పెట్టి పిల్లలకి అందిస్తూంటే ఆవిడ మనసు బాధపడింది.

ఈ లోకంలో ఏ తల్లి అయినా పిల్లలకి ఏం చేసినా చేయకపోయినా ఆకలి మాత్రం తీర్చాలి. కాకపోతే 'అమ్మ' అన్న పదానికి విలువ ఉండదేమో.

పద్మ తన ప్లేటులోని బజ్జీలు తీసి తల్లి దగ్గరికి వచ్చి తల్లి నోటికి అందించింది. ఆవిడ వద్దన్నా విన్పించుకోలేదు. అక్క వెనకాలే గిరిజ, పండు కూడా తమ దగ్గరివి కొద్దిగా తీసి బలవంతంగా పెట్టారు. ఆవిడకి కళ్లనీళ్లు తిరిగాయి. పిల్లలు చూడకుండా పక్కకి తిరిగి అద్దుకొంది. 'ఈ పిల్లలకి నేను,




నాకు ఈ పిల్లలు ఆసరా! బతకడానికి ఈ ధైర్యం, ఆలంబన ఏర్పాటు చేశావా ప్రభూ! అనుకొంది.

"అక్కా! బజ్జీలు చాలా బావున్నాయి కదూ!" పండు వాటిని తింటూ సంబరంగా అన్నాడు.

పద్మ నవ్వింది. "అమ్మ ఏం చేసినా అమృతంలాగే ఉంటుందిరా"

వాళ్ళకి కూడా ఆ మాటలు నిజమే అన్పించాయి. కామాక్షి వాళ్ల మాటలకి నవ్వుకొంది.

కామాక్షి పిల్లలను ఏనాడూ కష్టపెట్టలేదు. తమకి ఎదురైన దరిద్రం పంటి బిగువున భరించడానికే అలవాటు పడింది. పిల్లలకి ఆవిడ రకరకాల టిఫిన్లు పెడుతుంది ఆకలంటే అన్నం తీసి దద్ధోజనం రుచిగా చేసి పెడ్తుంది. మరోసారి ఉల్లిపాయముక్కలు, అల్లం, వేరుసెనగ పలుకులు వేసి పోపు అన్నం అంటూ మినపప్పు, సెనగపప్పు, ఆవాలు, పచ్చిమిరపకాయ ముక్కలు వేసి పోపుపెట్టి వేడిగా అందిస్తుంది. మరొకసారి చక్రపొంగలి అంటుంది. చివరికి ఏమీ దొరకకపోతే తెలివిగా మరమరాలు, ఉల్లిపాయలు, వేరుసెనగ పలుకులు, నిమ్మకాయ రసం వేసి పిడతకింద పప్పు అంటూ పెడుతుంది.

పద్మజకి తల్లి అంటే ఆరాధన, తండ్రిపై కోపం. అందరిళ్లల్లో ఆడవాళ్లు హాయిగా నవ్వుతూ చీకూచింతా లేకుండా ఉంటారు. తమ ఇంట్లో మాత్రం తల్లి ఆనందంగా లేదు.

పద్మజకి తల్లి అంటే ప్రాణం. ఆమె ఏం చెపితే అది వేదం. ఎన్ని చిరాకులు ఎదురైనా తల్లి పెదవులపై చిరునవ్వు పక్కకి తొలగదు. స్నేహితురాళ్లు అందరూ తాము కట్టుకొనే బట్టలవైపు ఆరాధనగా చూస్తారు. తల్లి చేతికుట్టుతో తమకి ఫాషన్‌గా గౌన్లు, డ్రెస్‌లు కుడుతుంది.

మూటలవాళ్లు బట్టలు అమ్మకానికి తెచ్చినపుడు అమ్మ రకరకాల చీరలు తక్కువ ఖరీదువి బేరం చేసి కొంటే పద్మ ఎందుకనుకొనేది. ఒక చీరచింపి తనకి, చెల్లికి చక్కగా గౌనులు, డ్రెస్‌లు కుట్టేది. డ్రెస్‌లు తయారయ్యాక చూస్తే అవి చీరలు కొని కుట్టించినవని ఎవరూ అనుకోలేకపోయేవారు. తల్లి అంటే ప్రేమ, గౌరవం ఎంత ఎక్కువో తండ్రి అంటే అంత భయం. చెల్లెలు, తమ్ముడూ కబుర్లు చెప్పినట్లుగా తను ఆయన దగ్గరికి చేరదు. దూరంగా నిలబడి అడిగిన వాటికి జవాబులు చెపుతుంది అంతే. పద్మకి చిన్నతనం నుండే వయసుకి మించి ఆలోచించడం అలవాటైపోయింది.

ఒకసారి పద్మజకి అమ్మవారు వచ్చింది. పెద్దపెద్ద పొక్కులు పోసి చాలా తీవ్రంగా జ్వరం వచ్చింది. ఎప్పుడూ జ్వరతీవ్రతలో గాబరాపడిపోతూ పక్కమీద అశాంతిగా దొర్లేది. తల్లి తన మంచం దగ్గరే వేపమండలు పట్టుకొని విసురుతూ కన్పించేది. తనని ఒళ్లోకి తీసికొని అనునయించడం, కనిపెట్టుకొని కావలసినవి అందించడం, రాత్రి ఏ సమయంలో లేచినా తల్లి తనవైపే చూస్తూ విసురుతూ కన్పించేది.

ప్రతీ ఇంట్లో పిల్లలకి అనారోగ్యం వస్తే తల్లి, తండ్రి కలిసి ఆ బాధ్యత వహిస్తారు. తమ ఇంట్లో మాత్రం ఒక పక్క వంట పనులు చేస్తూ మరొకపక్క తనని కంటికి రెప్పలాగ కాపాడుతూ మరొక పక్క ఇంటి ఖర్చులకి వ్యాపగిస్తూ ఆవిడ పడిన బాధ తానుచూసిందే. తనకి పూర్తిగా తగ్గేటప్పటికి తల్లి ఎంత నీరసపడిందో? స్నానం చేయించాక తనని అమ్మవారి కోవెలకి తీసికెళ్లింది. పనితో నిద్రలేమితో అలిసిపోయినా ఆమె మొహంలో ఎంతో తృప్తి. తనని దగ్గరికి తీసికొని నుదిటిపై ముద్దుపెట్టుకొన్న తల్లి రూపం పద్మకి మనసులో హత్తుకొనిపోయింది.

తండ్రి తమ బతుకులో అడుగడుగునా ఎలా అడ్డు తగిలేవాడో ఆ చిన్న మనసుకి



బాగా గుర్తుండిపోయింది. చెల్లి, తమ్ముడు లాగ తండ్రి తెచ్చే టిఫిన్లకి, స్వీట్లకి ఆ పిల్ల ఆశపడలేకపోయేది. వాటిని తల్లి ఇస్తే తీసి కొని తినేది. కానీ తండ్రి అంటే కృతజ్ఞతగా అన్పించేదికాదు. గిరిజ "మా నాన్న బంగారు, మా డాడీ ఎంతో మంచివారు" అంటూ ఆయన భుజాలచుట్టూ చేతులు వేసి గారాలుపోయేది.

ఆయన దగ్గర్నుండి గౌన్లుకని, బొమ్మలకని డబ్బులు అడిగి తీసికొనేది. తాను మాత్రం ఆయనంతటఆయన ఇస్తేనే పుచ్చుకొనేది. పద్మ మా అమ్మలాగ అమాయకురాలు. ఎలా బతుకుతుందో అని ఆయన అనడం పద్మకి గుర్తే. ఆయన తల్లి పేరు పద్మావతి. మొదట ఆడపిల్ల పుట్టగానే తన తల్లి పేరు పెట్టాలని ఆయన పట్టుపట్టారు. కామాక్షి తెలివిగా ఆ పేరు కలిసే లాగ పద్మజ అని పెట్టింది.

అందరి ఇళ్లల్లో తల్లి, తండ్రి, పిల్లలు కలిసి భోజనాలు చేయడం, కలిసి షికార్లకి, సినిమాలకి వెళ్లడం చేస్తారు. కానీ తమ ఇంట్లో తల్లి, తాము తప్ప తండ్రి ఊహ ఉండదు. ఎప్పుడో రావడం, ఒక నాలుగు రోజులు చుట్టాలలాగా ఉండటం, మళ్లీ వెళ్లిపోవడంతో ఆయన ఆ ఇంటిలో ఓ సభ్యునిగా అన్పించడమే మానేశారు.

కామాక్షి మనసులో సుబ్బమ్మ మాటలే మెదులుతున్నాయి. తాను ఎలాగైనా స్థిరపడాలని ఎన్నో ప్రయత్నాలు చేసింది. అసలు మనకి తెలియకుండా ఒక్కొక్కసారి బతకడానికి ఆధారం అదే దొరుకుతుంది.

గిరిజని కడుపుతో ఉన్నప్పుడు అందరూ వేరుపడ్డారు. తమ వంతు రెండెకరాల పొలం వచ్చింది. భర్త అక్కడే ఉంటే తన వృత్తికి అవకాశం తక్కువని, పేరు ప్రతిష్టలు, డబ్బు సంపాదించాలంటే బయటికి వెళ్లక తప్పదని పోరు మొదలు పెట్టాడు. ఆయన బాధపడలేక వేరు వచ్చేశారు. కడుపులో శిశువు, వెంట ఎడపిల్ల, భవిష్యత్తు మీద కోటి ఆశలతో భర్తమీద అంతులేని నమ్మకంతో బయటికి వచ్చింది.

అతికొద్ది రోజులకే తెలిసింది. ఇంటిదగ్గర అంతవరకూ తండ్రి, తల్లి అజమాయిషీతో అన్నదమ్ముల ఆంక్షలతో విసిగిన అతడు స్వేచ్ఛా జీవితం కొరకే వేరుకాపురం ఎన్నుకొన్నాడు తప్ప భార్యాబిడ్డలపై ప్రేమతో కాదు. రోజూ పెళ్లికొడుకులాగ ముస్తాబయ్యేవాడు. సాయంత్రం ఇల్లు చేరగానే "ఏమండీ! ఉద్యోగం దొరికిందా? " అని ఎంతో ఆశగా అడిగేది.

ఒకరికింద నేను పనిచేయనన్నాడు. ఏ వారపత్రిక ఆఫీసుల్లోనో ఆర్టిస్టుగా చేరమంది. వాళ్లు చెప్పిన బొమ్మలు వేస్తూ వాళ్లు ఇచ్చే డబ్బు కళ్లకద్దుకొని పడుండటం నావల్ల కాదన్నాడు. "చిత్రాలు గీయడం మీ వృత్తి. దానికి సంబంధించిన ఉద్యోగం చేయడంలో తప్పు ఏమిటి? స్థిరమైన పని చేయడంవలన ఆదాయం వస్తుంది. భవిష్యత్తుపై నిశ్చింత ఉంటుంది. పేరు ప్రతిష్టలూ వస్తాయి" అని ఎంతో ఓర్పుగా నచ్చచెప్పేది.

రాధాకృష్ణమూర్తికి ఒళ్లుమండిపోయేది. పెళ్లివద్దనీ, తాను కళకే అంకితమవుతాననీ అంటే తల్లిదండ్రులు ఒప్పుకోలేదు. కోడలిని తీసుకొస్తే బాధ్యత తెలుస్తుంది. పెళ్లాంకోసం అయినా వాడు ఇంటిపట్టున ఉంటాడు అంటూ వాళ్లుఒకటే పోరు. తండ్రిపోయాడు. ఎవరికి వాళ్లు ఉన్నదేదో పంచుకొని స్వేచ్ఛగా బతకవచ్చునంటే ఇప్పుడు ఈమె పోరు.

కామాక్షి భర్తని చిరాకుగా చూస్తూ అంది, "మీరు ఒక ఇంటికి యజమానినని గుర్తుపెట్టుకోవాలి. మీపై ఆధారపడ్డ భార్యా బిడ్డలున్నారని గుర్తుపెట్టుకోండి"

రాధాకృష్ణమూర్తి ఆమెని నిశితంగా చూసి అన్నాడు. "కళాకారుల్ని పెళ్లి చేసికొనేవాళ్లు కొంత త్యాగం చేయాలి. మొదటినుండీ నాది స్వేచ్ఛా ప్రవృత్తి. ఒక పరిధిలో ఇమిడి





బతకడం నాకు చేతకాదు. ఉద్యోగం ఉద్యోగం అంటూ నా ప్రాణం తినవద్దు"

కామాక్షి స్థాణువే అయింది. "అయితే మీరు ఏ ఉద్యోగం చెయ్యరా? మరి మమ్మల్ని ఎలా పోషిస్తారు? మన జీవి తాలు ఏమవబోతున్నాయి" అంది దుఃఖంతో.

"ఉద్యోగం చేయని వాళ్లందరూ బతకడం లేదా? నా ఈ బొమ్మలే మనకి అన్నం పెడ తాయి. కళని నమ్ముకొన్నవాళ్లు ఈ లోకంలో బతకడంలేదా? "

ఆయన తిరస్కారంగా మాట్లాడిన మాటలు ఆమె మనసుని బాధించాయి. "అయితే మన పెళ్లికి ముందు మీరు నాతో ఉద్యోగం చేస్తాననీ మీమీద నమ్మకం ఉంచ మనీ ఎందుకు చెప్పారు" అని నిలదీసి అడి గింది.

ఆయన సమ్మోహనంగా నవ్వాడు. "మీ నాన్నగారు అలాగ చెప్పమన్నారు. మా అమ్మాయి ఉద్యోగస్తుడు భర్త కావాలనుకొం టోంది. మేమే మీకు మంచి ఉద్యోగం చూస్తాం. చేయవచ్చునన్నారు. అయినా నీ పిచ్చిగాని మీ నాన్నగారు, మా నాన్నగారు ఉద్యోగాలు చేసే కుటుంబాలను పోషిం చారా? మా అన్నలు ఉద్యోగాలు చేస్తు న్నారా? మీ అన్న చేస్తున్నాడా? "

ఆమె ఊరుకోలేక అంది. "వాళ్లు వ్యవ సాయం చేస్తున్నారు. అదీ ఒక వృత్తే. మీరూ వారిలాగ వ్యవసాయమో, వ్యాపా రమో ఏదో ఒకటి చేయండి. దయచేసి నామాట వినండి"

ఆయనని ఆమె విన్నపం ఏమీ కదిలించ లేదు. నిన్నగాకమొన్న వేరుకాపురం పెట్టారో, లేదో ఏదో ఒక పని చూసుకోం డని తినేస్తోంది. తన ఆలోచనలన్నీ గాలికి ఎగిరిపోయాయి. అత్తవారు కలిగినవారు కదా ఆసరా అవుతారనుకొన్నారు. వెళ్లిన పుడు ఏదో కాస్త డబ్బు పడేసి వాళ్లు చేతులు దులుపుకొంటున్నారు. భార్యకి చూస్తే తగని అభిజాత్యం. తను ఏం చేయాలి?

తన కళమీద తనకి నమ్మకం ఉంది. అది తనని అన్యాయం చేయదు. గొప్ప కళా కారునిగా పేరు తెచ్చుకోవాలని తన తపన. చిత్ర కళాకారునిగా ఈ ప్రపంచం తనకి జేజేలు పలకాలి. ప్రతీ ఇంట్లో తన చిత్రాలు విడిదిచేయాలి. ఆబాలగోపాలం తన ఆర్ట్ చూసి ఆనందపడాలి.

ఆర్టిస్టుగా తను షైనవ్వాలంటే కుటుంబీ కుల ప్రోత్సాహం ఉండాలి. కన్నవారో, అత్త వారో అండగా నిలబడి ఉత్సాహాన్నివ్వాలి. పెళ్లైన కొత్తలో కామాక్షికి తను వేసిన బొమ్మలు చూపించి తన కలలు, తన ఆశయం ఉత్తమ చిత్రకారునిగా ఖ్యాతి గడించాలనే తన మనసులోని మాటెంత వివరంగా, ఎంత ఉత్సాహంగా చెప్పాడు? ఏం లాభం? ఆమె కూడా అంతే ఖచ్చి తంగా చెప్పింది, "బతకడానికి ఏదో ఒక స్థిరమైన పని చూసుకోవాలి. పక్కన మీ ఇష్టం, కవులే అవుతారో, చిత్రకారులుగా ఖ్యాతి గడిస్తారో. ఏదైనా దైనందిక జీవితా నికి అనుబంధంగా మాత్రమే ఉండాలి. లేక పోతే రోడ్డున పడతాం. కళలు కడుపులు నింపవు. 'కళ' చూసి ఆనందిస్తారు కానీ కాసులు రాల్చరు"

రాధాకృష్ణమూర్తి నాలుగు రోజులు భార్యతో మాటలు మానేశాడు. ఆమె అభి ప్రాయాలు వింటుంటే కంపరం కలగసా గింది. డ్రాయింగ్ పరీక్షలు పాసవ్వాలట. ట్రైనింగ్ అవ్వాలిట. డ్రాయింగ్ టీచర్‌గా ఉద్యోగం చూసుకోమంది.

అతనికి ఒళ్లు మండింది. "నలుగురు పిల్లల్ని ప్రోగుచేసికొని ఉదయం వెళ్లి సాయంత్రం వస్తూ ఏ వంకాయో, వాన పామో బోర్డుమీద గీస్తూ బతకాలా? తనకి నచ్చిన బొమ్మలు నచ్చినప్పుడు వేసికొని తృప్తి పొందడానికి. వీల్లేదా? నీకు ఇంత పట్టుదల ఎందుకు? నా జీవితం నాదని

ఎందుకు గ్రహించవు?"

"స్వేచ్ఛగా గాలిపటంలాగ తిరుగుదామను కొన్నవాళ్లు సంసారి ఎందుకయ్యారు? సన్యాసిగా ఉండిపోక పోయారా?" అందామె.

"కామాక్షీ!" ఆయన మృదువుగా పిలిచాడు. "నేను... నేను పెద్దల మాట కాదనలేకపోయాను. నువ్వు తెలివైన దానవని, చురుకైన దానివని అందరూ చెప్పారు. అందరిలాగ గృహస్థ జీవితం గడుపుదామనుకొన్నాను"

ఆమె హేళనగా నవ్వింది. "గృహస్థ జీవితం! ఆ జీవితం గడపడానికి కొంత శ్రమ పడాలి. కొన్ని బాధ్యతలు స్వీకరించాలి. కొన్ని నియమాలను పాటించాలి. ముక్కుమూసుకొని నాలుగు బొమ్మలు వేస్తే ముక్తి రాదు. ఇహలోక ధర్మం నెరవేరిస్తే పరలోక పుణ్యం దక్కుతుంది. లేకపోతే ఇహం పరం రెండూ దక్కవు"

కఠినమైన ఆమె మాటలకి అతను స్థాణువయ్యాడు.

బొమ్మలు అమ్మడంలో రాధాకృష్ణమూర్తికి ఒక టెక్నిక్ ఉంది. సాధారణంగా అతను దేవుళ్ల పటాలే వేస్తాడు. రాధాకృష్ణులు, లక్ష్మీదేవి, సరస్వతి, వినాయకుడు... ఇలాగ ఏ దైవం తోస్తే ఆ దైవం పటం ప్రజల ఇంట్లో వెలుస్తుంది. ఆ చిత్రాలు చూసిన వారెవరైనా ఆయన నైపుణ్యం మెచ్చుకోకుండా ఉండలేరు. భగవంతుడు ఆయనకి ఇచ్చిన ఆ వరాన్ని గౌరవించకుండా ఉండలేరు. వాటర్, ఆయిల్ కలర్స్‌తో వేసిన ఆ చిత్రాలు కళ్లకి మిరుమిట్లు గొల్పుతాయి.

ఒక్కొక్క చిత్రం వందకి, రెండు వందలకి ఇచ్చేస్తూ ఉంటాడు. అదంతా ఆయన ఇష్టమే. ఆ బొమ్మద్వారా ఎంత సంపాదించాలనుకొంటే అంత ఆ బొమ్మ పక్కన కిందుగా రౌండ్‌చుట్టి అంకెవేస్తాడు. ఒక్కొక్కసారి అదీవేయడు. ఆయన అనుకొన్నదానికన్నా ఎక్కువ డబ్బు వస్తుంది. మూడు, నాలుగు రోజులు కష్టపడి బొమ్మలు వేస్తాడు. రెండు, మూడు అయ్యాక వాటిని తీసికెళ్లి అమ్ముతాడు. చిత్రపటాల కింద ఆయన రాసే కవిత్వం చాలా బావుంటుంది. చక్కటి పద్యమో, గేయమో దాని కింద సందర్భోచితంగా రాస్తాడు. గొప్ప గొప్ప కవుల పద్యాలు ఆయనకి కంఠతా వచ్చును. వాటిని ఆ చిత్రాల కింద రాస్తాడు.

ఆయన ఏ ప్రాంతంలో ఉంటే ఆ ప్రాంతంలో అనేకమంది ఇళ్లలో ఆయన బొమ్మలుంటాయి. వారి పూజామందిరంలో ఆయన దేవుళ్లు కొలువు తీరి ఉంటారు. ఒక్కొక్కసారి ఆఫీసులకీ వెళతాడు. దేశనాయకుల పటాలు వేస్తాడు. ప్రకృతి దృశ్యాలు వేస్తాడు. ఎక్కువగా మాత్రం వెంకటరమణమూర్తి, లక్ష్మీదేవి, దుర్గమ్మ వేస్తాడు. ఆయన తరుచుగా అంటారు "భారతదేశం పుణ్యభూమి, కర్మభూమి. ఈ దేశంలో దైవ భక్తి లేనివారు అరుదు" అని.

ఆయన మంచి వాక్చాతుర్యం కలవాడు. "ఈ సిద్ధివినాయకుడు మిమ్మల్ని ఆశీర్వదించడానికి వచ్చాడు. మీ సుకృతం ఏమిటో గానీ మీ ఇల్లు నన్ను ఆకర్షించింది. ఈ చిత్రం మీ ఇంట పూజలందుకొని మిమ్మల్ని సర్వదా కాపాడుతుందని వచ్చాను"

ఆ మాటలకి పొంగనివారు ఎవరు ఉంటారు? ఆ దైవంపై మనసు పడనివారు ఎవరుంటారు?

ఆకర్షణీయమైన రంగులతో అద్భుతమైన చిత్రణతో ఆ దైవ మూర్తుల్నే వారి కళ్ల ముందు ప్రత్యక్షపరచడం ఆయనకి వెన్నతో పెట్టిన విద్య. ఆ చిత్రాలను చూసిన ఎవరికైనా ఆయన చేతి వేళ్లల్లో అనంతమైన శక్తిని భగవంతుడు ప్రసాదించాడనిపిస్తుంది. ఆయనకి ఆ పూట ఆతిధ్యం ఇచ్చి బట్టలు పెట్టి తాము తృప్తిపొంది ఆయన తృప్తి పడేలాగ డబ్బు ఇచ్చి పంపే వదాన్యులు కోకొల్లలు. ఆయన జేబు ఏనాడూ ఖాళీగా ఉండదు.



ఆయనకి అందరూ ఒక్కలాగే అన్పి స్తారు. వాళ్లు చేసే గౌరవానికి బ్రహ్మానందం పొందుతాడు. అటువంటి గౌరవం పొందిన పుడు కామాక్షి విధిగా గుర్తు వస్తుంది. పిచ్చిది ఎంతసేపూ ఇల్లు, పిల్లలు అంటూ బతుకుతుంది. ఈ లోకంలోని ఏ ఆనందం ఆమెకి తెలియదుకదా అనుకొంటాడు.

ఇంటినుండి బయలుదేరేటప్పుడు చిత్రాలు అమ్మి ఇంటికి వచ్చేద్దామనే అనుకొన్నాడు. కానీ విజయవాడ బస్సు చూసేసరికి ఆయన కాళ్లు అటు లాగాయి. వసంతని చూసి చాలా రోజులైందనుకొన్నాడు. పదిహేను రోజులుదాటితే ఆయన దృష్టిలో చాలా రోజులు అయినట్లే.

రాత్రి బాగా పొద్దుపోయాక తలుపుకొట్టిన ఆయనని చూసి ఆమె ఆశ్చర్యపోయింది. "నిన్న మీరు కలలోకి వచ్చారు. వస్తే బావుండు ననుకొన్నాను. వచ్చారు" అంటూ ఆహ్వానం పలికింది.

ఆయన చేతిలోని పువ్వులు, స్వీట్లు ఆమెకి అందించాడు. నిద్ర కళ్లతోనే ఆయనకి స్నానానికి ఏర్పాట్లు చేసింది.

"విజయవాడ బస్సు చూడగానే నువ్వు గుర్తు వచ్చావు" ఆయన నవ్వుతూ అన్నాడు.

"పోనీలెండి. ఆ రకంగానైనా ఈ భక్త రాలు గుర్తు వచ్చింది" అంటూ పాల గ్లాసు తెచ్చి అందించింది. మంచంపై ఎదు రుగానున్న గదిలో పడుకొన్న ఆమె కొడుకు నిద్ర లేచాడు ఈ అలికిడికి.

"ఎవరమ్మా వచ్చింది" అంటూ నిద్ర కళ్లు నులుముకుంటూ అడిగాడు.

"మీ పెదనాన్నగారు రా! నిన్ను, చెల్లిని చూడాలన్పించి వచ్చారుట"అంటూ ఆమె కొడుక్కి మంచి నీళ్లు అందించింది. అది తాగి అతడు పడుకొన్నాడు. మనసులో మాత్రం 'పెదనాన్న వెళ్లి ఇరవై రోజులు కాలేదు. అప్పుడే వచ్చేశాడా?' అనుకొ న్నాడు.

"ఉదయం వాళ్లను బజారు తీసికెళ్లి బట్టలు కొని ఇవ్వండి. వాళ్లు మీ ఊసుప ట్టరు" వసంత నవ్వుతూ అంది. ఆయన అలాగేనన్నట్లు తల ఊపి తన గదివైపు నడి చారు. ఆమె పిల్లలవైపు ఒకసారి చూసి ఆయనని అనుసరించింది.

మర్నాడు వాళ్లని తీసికెళ్లి బట్టలు, బొమ్మలు కొని జేబు బరువు వదుల్చుకొ న్నారు. మళ్లీ రేపు బొమ్మ వేయాలి అనుకొ న్నాడు. ఆయన తత్వం బహు విచిత్రమై నది. జేబులో అసలు డబ్బు లేకపోతే ఆయ నకి నిద్రపట్టదు. కాఫీ తీసికొచ్చిన వసంత బుగ్గపై చిటికవేసి "నువ్వు రోజురోజుకీ మరీ అందంగా తయారవుతున్నావు సుమా" అన్నాడు.

ఆమె సన్నగా నవ్వుతూ తన చీరవైపు చూస్తూ అంది "ఈ పాత చీరలోనే మీకు అంత అందంగా కన్పిస్తున్నానా? "

"అందం చీరలో లేదు. కట్టుకున్న మని షిలో ఉంది" ఆయన తన చురుకైన కళ్లతో ఆమెను ఆపాదమస్తకం చూశాడు.

ఆమె డబ్బుకీ ఈయనకీ లంకె అను కొంది. తనే మృదువుగా నవ్వుతూ "ఎంత అందమైన వాళ్లకైనా అందాన్ని పెంచేందుకు అలంకరణ ఉండాలి" అంది.

"మూటలవాడు చీరలు తెస్తానన్నాడు. రెండు తీసుకోనా? " అని నెమ్మదిగా అందిం చింది. ఆయన మౌనం వహించారు.

వసంతకి ఆయన ఇంటికి వస్తే నిశ్చింత. ఇల్లు సాఫీగా సాగిపోతుంది. బియ్యం, సరు కులు తెచ్చి పడేసుకొంటుంది. డబ్బు ఆయన వెంటబడి మరీ తీసికొంటుంది. ఆయన సంపాదనపై తనకి హక్కు ఉంద నుకొంటుంది. రాధాకృష్ణమూర్తిని ఊళ్లు తిర గవద్దని ఇంటి దగ్గరే ఉండమని పోరుతూ ఉంటుంది.

ఇదివరకైతే ఇంటివాళ్లతో కలిసి ఉన్న ఇంట్లో ఉండేది. తర్వాత తర్వాత తనే విడిగా ఉన్న చిన్న ఇల్లు అద్దెకి తీసికొంది.





భర్త చిన్న వయసులో పోవడంతో కంపెనీ వాళ్లు అతడి సొమ్మంటూ కొద్దిగా ఇచ్చి చేతులు దులుపుకొన్నారు. ఇద్దరు బిడ్డలని పెంచాలి. భర్త డబ్బు బాంకులో వేసింది. తెలిసినవాళ్లని పట్టుకుని కాన్వెంటులో టీచర్‌గా ఉద్యోగం సంపాదించుకుంది. వాళ్లు ఇచ్చే జీతంతో ఇల్లు నడపడం కష్టమే. అయినా అంతకుమించి చదువు లేనపుడు ఏం చేస్తుంది?

రాధాకృష్ణమూర్తి ప్రవృత్తి మహా విచిత్రమైంది. ఇంట్లో ఉంటే అదొక బందిఖానాలాగ బాధపడతాడు. ఇల్లు వదిలి నాలుగు రోజులు హాయిగా గడిపేస్తాడు. ఏ స్థలంలో అయినా పది రోజులకి మించి ఉండలేడు. ఈలోపు బంధువులు గుర్తువస్తారు. ఆయనకి బంధుప్రీతి ఎక్కువే. డబ్బు ధారాళంగా ఖర్చుపెట్టే ఆయనంటే బంధువులకీ అభిమానమే. ఆయన వస్తే సినిమాలు, హోటళ్ల టిఫిన్లు ఉంటాయని వాళ్లు సరదా పడతారు. ఒక్కొక్కసారి స్వేచ్ఛకావాలంటూ హోటల్స్‌లో ఉంటాడు. అక్కడే పది రోజులు, పదిహేను రోజులూ ఉండిపోతాడు. అక్కడే బొమ్మలు వేసుకొంటాడు. వాటిని అమ్మి సొమ్ము సంపాదిస్తాడు.

అలా రెండు నెలలు గడిచేటప్పటికి ఇల్లు, పిల్లలు గుర్తువస్తారు. మరి ఒక్క క్షణం అక్కడ ఉండడు. వెంటనే ఇల్లు చేరతాడు. రెండు చేతులతో ఇంట్లోవారికి కానుకలు తీసికొని గృహప్రవేశం చేస్తాడు. ఎవరైనా అయితే వాన రాకడ, ప్రాణం పోకడ తెలియదంటారు. ఆయన రాకను కూడా వాటిలో చేర్చవచ్చును.

★ ★ ★

గిరిజ అప్పడాలు కావాలని అడిగితే కామాక్షి అప్పడాలు ఒత్తడం మొదలుపెట్టింది. "అమ్మా కొంచెం పిండి అన్నంలో తింటాం" గిరిజ మాటలకి నవ్వి కప్పులో వాళ్లకి ఉంచిన పిండి చూపించింది. భోజనాల దగ్గర గిరిజ అంది "అమ్మా! నాన్నగారికి ఈ పిండి అంటే చాలా ఇష్టం కదూ? "

కామాక్షి నిర్లిప్తంగా ఆ పిల్లవైపు చూసింది. ఏది తిన్నా ఏది తండ్రికి నచ్చినదైనా గిరిజ తండ్రిని తలవక తప్పదు.

ఈ పిల్లలకి ఆయన తండ్రి. బాధ్యత వహించినా, వహించకపోయినా ఈ ఇంటికి యజమాని. ఆ గౌరవం ఆయనకి దక్కవలసిందే. అయితే పిల్లల్లాగ ఆయన కూడా వాళ్లని గుర్తు చేసికోవాలికదా!

"నువ్వు జ్యోతిష్యం నేర్చుకో! అప్పుడు మీ నాన్నగారు ఎక్కడ ఉన్నారో తెలిసికొని అక్కడికి అన్నీ పంపవచ్చు"

కామాక్షి మాటలకి కొడుకు నవ్వాడు. తల్లి ఆలోచనలలో పడటం చూసి పద్మ చెల్లిని మందలిస్తున్నట్లుగా చూసింది. తల్లిని పరధ్యాసలో నుండి మరల్చకపోతే ఈ పూట సరిగ్గా భోజనం చేయదు.

పద్మ గారంగా అడిగింది "అమ్మా! నీ చిన్నప్పటి సంగతులు చెప్పమ్మా"

కొడుకు కూడా "అవునమ్మా చెప్పు" అంటూ అక్కని బలపరచాడు. కామాక్షి ఆలోచనలో పడింది.

"అవునుగానీ మీకు మా మేనత్తగారి గురించి చెప్పలేదుకదూ"

పిల్లలు ఒక్కసారిగా చెప్పలేదంటూ జవాబిచ్చారు. "మా మేనత్తకి బాగా ఆచారం. పతిభక్తి. మా మావయ్య భోజనం చేశాక ఆ ఆకు తీయనిచ్చేదికాదు"

"అమ్మా! అప్పుడు కంచాలు లేవా? " పండు సందేహం. "కంచాలు వెండివే ఉండేవి. పెద్దవాళ్లయితే మన ఇంటికి వచ్చి మన ఎంగిలి కంచాలలో తింటారా? "

"తినరు" గిరిజ సమాధానం.

"ఊ అందుకే అరిటాకులు వేసి వడ్డించేవాళ్లం. మా ఊళ్లో తామరాకులు కూడా ఉండేవి. పాలేర్లు చెరువుకి వెళ్లి తెచ్చేవారు"

"ఇంతకీ మీ మావయ్యగారి ఆకు అత్తయ్య ఏం చేసేవారు? " పద్మ మొదట తల్లికోసం

ఆ విషయం ఎత్తినా ఆసక్తి పెరగడంతో తనూ ప్రశ్నించింది.

"మా అత్తయ్య ఆ ఆకులో ఏదో ఒక పదార్థాన్నికొంచెం వదలమనేది మామయ్యని. ఆయన భోజనం పూర్తిచేసి లేచాక తను అది కళ్లకద్దుకొని తినేది. ఆ ఆకులోనే ఆవిడ తనకి భోజనం పెట్టుకునేది"

"మరి అమ్మా! నువ్వు నాన్నగారి ఆకులో కానీ కంచంలో కానీ ఎప్పుడూ తినవేం?" గిరిజ సందేహం.

కామాక్షి నవ్వుతూ అంది "నేను మా అత్తయ్య అంత పతివ్రతని కాను. నాకు కంచం పరిశుభ్రంగా ఉండకపోతే అన్నం తినబుద్ధి పుట్టదు"

'మీ నాన్నగారు ఇంట్లో ఉంటేకదా' అని తల్లి అననందుకు పద్మ ఆరాధనగా తల్లిని చూసింది.

కామాక్షి మళ్లీ చెప్పడం మొదలుపెట్టింది. "ఓ రోజు మా ఇంటికి మా నాన్నగారి స్నేహితులిద్దరు వచ్చారు. మా ఇంట్లో ఫంక్షనుకి వండటానికి వంటాయన ఒకరు వచ్చారు. వీళ్ల ముగ్గురికీ, మా నాన్నగార్కి, మావయ్యకి కలిపి మా అమ్మ వడ్డన చేసింది. మా మావయ్యదగ్గర ఆకు గుర్తు కోసమని నన్ను అక్కడ నిలబడమంది"

పిల్లలు ముగ్గురూ ఆసక్తిగా వింటున్నారు. కామాక్షి మనసు కూడా ఆ రోజులలోకి వెళ్ళింది. "పెద్దవాళ్ళు కదా! అన్ని విషయాలూ మాట్లాడుకుంటూ గంటసేపు భోజనం చేశారు. నాకు విసుగు వచ్చి అక్కడే చింతగింజలాడుకుంటూ కూర్చున్నాను. బయటికి పారిపోతే అత్తయ్య తంతుంది. అందుకే కూర్చుని బోరుకొట్టి ఆటలోకి దిగాను. అందరి భోజనాలూ అయ్యాయి. మగవాళ్ళు చెయ్యి కడుక్కోండుకి వెళ్ళారు.

మా అత్తయ్య వచ్చి మిగిలినవారి విస్తర్లు తీసెయ్యడానికి మావయ్య విస్తరి గురించి అడిగింది. నిజానికి నాకు ఆట ధ్యాసలో ఆ ఆకు గుర్తులేదు. కానీ అత్తయ్య తిడుతుందని అటు పక్క విస్తరి చూపించాను. ఆ విస్తరిలో కూరతోపాటు పచ్చడి కూడా విడిచిపెట్టబడి ఉంది.

మా అత్తయ్య అది చూసి చాలా ఆనందపడింది. ఈరోజు ఏమిటి నా అదృష్టం. మీ మావయ్య కూరతోపాటు పచ్చడి కూడా వదిలారు అంటూ ఆ ఆకులో వడ్డించుకుంది. అమ్మా వాళ్ళు కూడా వడ్డించుకుని తింటున్నారు. అత్తయ్య అతిభక్తిగా ఆ కూర, పచ్చడి మొదట నోట్లో వేసుకొని, మిగిలిన భోజనం తినడం మొదలుపెట్టింది.

మా మావయ్యకి కాసేపయ్యేటప్పటికి దాహంవేసింది కాబోలు. ఆయన అక్కడికి వచ్చారు. అత్తయ్యని, ఆ ఆకునీ చూసి ఆయన నివ్వెరపోయారు.

తర్వాత నింపాదిగా అన్నారు, "నువ్వుల పచ్చడంటే నాకిష్టమని నీకు తెలుసు కదా! అది వదిలేస్తానని ఎలా అనుకొన్నావు? నేను కూర ఒకటే వదిలాను. ఇటుపక్క నేను కూర్చున్నాను. అటుపక్క కూర్చున్నది మన ఇంటికి వంటకోసం వచ్చిన వంటాయన"

దానితో అత్తయ్య దిమ్మెరపోయి నిలువు గుడ్లు వేసుకొని చూస్తూ ఉండిపోయింది. తర్వాత లేచి నోట్లో వేలుపెట్టుకొని పెరట్లో కక్కడం మొదలుపెట్టింది. నాన్నగారు, అమ్మ జాలిగా అత్తయ్యను చూస్తూ ఉండిపోయారు. ఆ తర్వాత మా అత్తయ్య, నాన్నగారు వచ్చి నా వీపు పగలగొట్టారు. "చిన్నపిల్ల, దానికేం తెలుసును? దాన్ని కొట్టకండి. ఆడపిల్ల" అని మావయ్య ఎంత చెప్పినా వాళ్ళు వినలేదు.

ఆ సంఘటన గుర్తువచ్చి ఆవిడ పెదవులు నవ్వుతూ విచ్చుకున్నాయి. "అప్పటి నుండీ మా అత్తయ్య ఎందరు ఉన్నా సరే, ఏ పెళ్ళిళ్ళు సందడులూ అయినా సరే మా మావయ్య భోజనం చేస్తున్న దగ్గరే కూర్చుండిపోయేది. తనే ఆ విస్తరికి కాపలా కాసేది"

# రచయితలకు మనవి



★ 'చతుర'లో నవలకు వేసే చిత్రాలు, 'చతురకతలు', 'చతుర ప్రపంచం'వంటి శీర్షికలు కాక కేవలం నవలమాత్రమే అచ్చులో 100 పేజీలు ఉంటుంది. నవలనుబట్టి పేజీల సంఖ్య పెంచడంగాని, తగ్గించడంగాని వుండదు గనుక రచయిత(త్రు)లు తమ వ్రాతప్రతిని అచ్చులో 100 పేజీలకు తక్కువ కాకుండా వుండేలా చూసుకుని పంపవలసి వుంటుంది.

★ **ప్రచురించిన నవలలో ఓ పూర్తి పేజీని తమ చేతివ్రాతలో రాసి చూసుకుని, ఆమేరకు తమ నవల అచ్చులో 100 పేజీలకు సరిపోయేలా ప్లాన్‌చేసుకుని 'చతుర'కు అనుకూలంగా వుండేసైజులో పంపడం మంచిపద్ధతి.**

★ **ఆవిధంగా నవలలు 'చతుర'కు సరిపడా లేకపోయినట్లయితే ఆయా నవలలు పరిశీలనార్హాలు కావని గమనించగోరుతున్నాం.**

★ ప్రచురణకై ఎన్నికకాని నవలలు తిప్పి పంపేందుకై నవలతోపాటే తగు పోస్టేజిని జతపరచాలి. వ్రాతప్రతులు పోస్టులోగాని, ఇతరత్రాగాని పోయినసందర్భాల్లో మా బాధ్యత వుండదు.

★ సాధారణంగా నవలలు మాకు అందిన 4 వారాలలోగా ప్రచురణార్హంగా భావిస్తే ఆ విషయం తెలియపరచడం, లేనిపక్షంలో తిప్పిపంపడం జరుగుతుంది.

★ ప్రతి నవలకు అందజేసే రు: 3000/– పారితోషికం ఏనెల 'చతుర'లో ప్రచురిస్తే ఆనెల మొదటివారంలోనే పంపబడుతుంది.

ఎడిటర్:

# చతుర

'ఈనాడు' కాంపౌండ్ హైదరాబాద్-500 482.




ఈ శీర్షికద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలుబడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్లీ చెప్పకుండా, అవసరమైన మేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీ లోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', 'ఈనాడు' కాంప్లెక్స్, హైదరాబాదు-500 082 అనే చిరునామాకు పోస్ట్ చేయాలి.

**మాకు సకాలంలో అందిన సమీక్షలలో ఎన్నికచేసిన అయిదు ఉత్తమ సమీక్షలకు రూ.100/- ప్రథమ బహుమతి, రూ. 75/- ద్వితీయ బహుమతి, రూ. 50/- చొప్పున మూడు తృతీయ బహుమతులను అందజేస్తున్నాం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటు చేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.**

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

కూపన్

______ అక్టోబర్ **చతుర** నవల **రంజని** ______

సమీక్షకుని పేరు : ______________

చిరునామా ______________

______________

______________

పిల్లలు ముగ్గురూ నవ్వుతూ ఉండిపోయారు.

పాపం అత్తయ్య వంటవాడి ఎంగిలి తినేసింది అని ఒకరంటే, మరొకరు వంటాయన ఆ పచ్చడి ఎన్నిసార్లు నాకాడో కదా అంటూ నవ్వసాగారు.

కామాక్షమ్మ నవ్వుతూ అంది. "అప్పటి నుండే మా అత్తయ్య నువ్వుల పచ్చడి, అరటికాయ కూర తినడం మానేసింది. పాపం ఆ రెండూ ఆయన ధర్మమా అని మానేసి, తననితాను శిక్షించుకుంది. నిజానికి మా అత్తయ్యకి అవి రెండూ చాలా ఇష్టం" అంది. అటుపైన,

కామాక్షి ఆలోచనలో పడింది. వెధవ పనులు ఏవైనా సరే నవ్వుతూ చేస్తాం. వాటి ఫలితం అనుభవించేటప్పుడు ఏడుస్తాం అనుకుంది.

ఆవిడ పిల్లలవైపు చూస్తూ, "ఈరోజు మనం పెరడు, మొక్కలు శుభ్రపరచుకోవాలి" అంది. వాళ్ళు ఉత్సాహంగా తల ఊపారు. ఆవిడ ఏ పని చేసినా వాళ్ళని భాగస్వాములను చేసుకొంటుంది. వాళ్ళ శక్తికి తగ్గ పని వాళ్ళకి అప్పచెప్పుతుంది. ఉదయం లేచిన దగ్గరనుండీ రాత్రివరకూ ఆవిడ కష్టపడుతుంది. ఆ పనులు చిన్నవా పెద్దవా అని ఆలోచించదు. వాటి ప్రతిఫలం ఎంతని కూడా అనుకోదు. ఎంతైనా అవనీ! ఎన్నో నీటి బిందువులు కలిస్తే కదా ఒక పిల్లకాలువ అవుతుంది.

బెండకాయలు, కాకరకాయలు కోసి బుట్టలో పోశారు. గోంగూర కాస్త ఎక్కువగా ఉందని కోసేశారు. కామాక్షి మొక్కలన్నింటికీ పాదులు చేసింది. నీళ్ళు సరిగ్గా వెళుతున్నాయో, లేదో చూసింది.

కూరలు మూడు సంచుల్లో పోసి కొన్ని ఇంట్లో ఉంచింది. గిరిజ గబుక్కున అంది, "నాన్నగారికి కాకరకాయలు ఇష్టం. కాసిని మనం ఉంచుకొందామమ్మా!"

కామాక్షి ఏమీ మాట్లాడకుండా, వంచిన తల ఎత్తకుండా కొన్ని కాకరకాయలు తీసి ఇంట్లోని బుట్టలో వేసింది. పద్మ పండుని తీసికొని, ఆ సంచులు గట్టిగా పట్టుకొని బయటికి నడిచింది. వెళుతున్న పిల్లలవైపు చూసిందావిడ. సుశిక్షితులైన సైనికుల్లాగా వాళ్ళు ముందుకి సాగుతున్నారు. ఆవిడ ఒక డైరీ తీసుకొని ఆ కూరల వివరం ఆయా ఇంటివాళ్ల ఖాతాల్లో రాసింది. వారానికి కొందరు డబ్బులిస్తే కొందరు నెలకి ఇస్తారు. అప్పుడే కోసిన ఆ కూరలంటే ఆ చుట్టుపక్కల వాళ్ళకి మహాప్రీతి.

పిల్లలకి అన్నంపెట్టి గిన్నెలు తోముకొంటుంటే భర్త గేటు తీసుకొని ప్రత్యక్షమయ్యారు. పిల్లలు "నాన్నగారు వచ్చారు, నాన్నగారు వచ్చారు" అంటూ ఆయనని చుట్టుముట్టారు. ఆయన వాళ్ళకి తెచ్చిన వస్తువులు అందించారు. పద్మ ఇచ్చిన మంచినీళ్ళు తాగి, కాళ్ళు కడుక్కుందుకి పెరట్లోకి వచ్చారు.

గిన్నెలు తోమినవి పక్కన పెట్టి భర్తకి చెంబుతో నీళ్ళు అందిస్తూ, "ఏ ఊళ్ళు తిరిగారు, ఏమేమి చేశారు" అంటూ సినిమా పాట చరణం అందుకొంది. ఆయన నవ్వి "అక్కడితో ఆపెయ్యి" అంటూ "బాగున్నావా కామాక్షీ" అన్నారు.

ఆవిడ నవ్వుతూంటే కళ్ళనీళ్ళు తిరిగాయి. "మీ దయవలన ఇలాగ ఉన్నాను" అంది.

ఆయన పండుని ఒళ్ళో కూర్చోపెట్టుకొని వాడితలపై ముద్దుపెట్టుకున్నారు. పిల్లలతో కబుర్లు చెపుతూ వాళ్ళు తమ చదువు సంధ్యల గురించి చెపుతూంటే నవ్వుతూ వింటున్నాడు.

కామాక్షి ఆయనకి కాకరకాయ వేపుడు, వడియాలు, చారు తయారుచేసి భోజనం వడ్డించింది. ఆయన ఎంతో ఇష్టంగా భోజనం చేశారు.

పక్కనే కూర్చుని విసురుతూ అన్నం వడ్డిస్తున్న ఆమె ఆ క్షణంలో ఆయనకి ఎంతో ఆత్మీయంగా అనిపించింది. 'తల్లిలాగ కడుపు



చూసి, ఆకలి తీర్చే అర్ధాంగులు ఎందరుం టారు' అని అనుకొన్నారు

అయితే ఆవిడ మౌనం ఆయనకి భరించ లేనట్లు అన్పించింది "కామాక్షీ ఏదైనా మాట్లాడు" అన్నాడు

"నాకు విషయాలు ఏముంటాయి? మీరు అయితే నాలుగు ప్రదేశాలు చూస్తారు. నలుగురిని కలుస్తారు కనుక మీరే చెప్పాలి" అంది.

ఆ మాటలు ఎత్తిపొడుపుగా అందేమోనన్నట్లు చూశారుగానీ, ఆవిడ మామూలుగానే అంది "కామాక్షీ... ఎక్కడ తిరిగినా, నువ్వు గుర్తువచ్చిన మరుక్షణం ఇంటికి రావాలన్పిస్తుంది"

ఆవిడ కంటినీరు ఆయన కళ్ళ పడకూడదన్నట్లు గిన్నెలు సర్దసాగింది. గిరిజ తండ్రి భుజంమీద వాలుతూ అంది. "నాన్నా! మీరు విజయవాడలో ఎవరితోనో అంకుల్‌కి సినిమాహాల్లో కన్పించారుట. ఆయన వచ్చి మాకు చెప్పారు"

ఆయన చూపులు ఒక్కసారి ఆవిడ చూపులతో కలుసుకున్నాయి. ఆవిడ అక్కడి నుండి లేచి పిల్లలకి పక్కలు వేయడానికి వెళ్ళిపోయింది.

రాత్రి ఎంతసేపు గడిచినా ఆవిడ ఆ గదిలోకి రాలేదు. ఆయనకి ఆవిడ లేకపోతే ఆ గది శూన్యంగా తోచింది. ఫాను తిరుగుతున్నా, కిటికీలోనుండి చల్లటి గాలులు వీస్తున్నా ఊపిరి ఆడనట్లుగా ఉంది. ఎదురుగా మంచినీళ్ళ చెంబు చిన్న పళ్ళెం మూతపెట్టి కన్పించింది. కాళ్ళవైపు దుప్పటి పెట్టిఉంది. ఎలా ఆవిడని గదిలోకి రప్పించడం? అన్నీ తన అవసరాలు తెలిసినది కనుక అమర్చింది. ఏదీ అడగడానికి ఆస్కారం లేదే?

ఆయనకి ఆ సమయంలో ఆవిడ తన ప్రాణసమానురాలిగా అన్పించసాగింది. ఆవిడ సాంగత్యం కోసం ఈ తహతహ ఆయనకి ఆశ్చర్యంగా అన్పించింది. తనకి ఆడవాళ్ళు కొత్తకాదు తన ఈ బలహీనత చూచాయగా ఆవిడకి తెలుసును. తన కోసం ఆవిడ పరితపించాలి. కానీ అందుకు విరుద్ధంగా తను ఆవిడకోసం, ఆవిడ పలుకుకోసం నిరీక్షిస్తున్నాడు.

ఆయనకి ఆ గది శూన్యంగా అన్పించసాగింది. ఇంట్లోని ఆ నిశ్శబ్దం ఆయనకి భరించలేనిదిగా తోచింది. నెమ్మదిగా లేచి ఆమెకోసం వెతకసాగారు. వీధి తలుపు దగ్గరగా వేసిఉంది ఆయన ఇంటి ముందుభాగంలోకి వచ్చారు.

ఆవిడ అక్కడ మడతమంచంమీద పడుకొనిఉంది. తలకింద తలగడ తప్ప వేరే ఏదీలేదు. ఒక చెయ్యి నుదిటిపైనుండి కప్పుకొని పడుకొని ఉంది. వెన్నెల కిరణాలు ఆవిడని నిలువెల్లా తడిపేస్తున్నాయి. చల్లటిగాలి ఆవిడని ఆప్యాయంగా నిమిరి సేదతీరుస్తోంది. పూవులపైనుండి వచ్చే మధురమైన సువాసనలు ఆ ప్రదేశమంతా చుట్టుముడుతున్నాయి.

పసుపురంగుమీద చుక్కలున్న వాయిలు చీర, పచ్చటి జాకట్టులో పసుపు కొమ్ములాగ ఆవిడ కన్పించింది. ఆ పడుకోవడంలో ఒక నిర్లిప్తత, ఒక ఉదాసీనత కన్పిస్తున్నాయి. ఆయనకి ఆవిడని చూస్తుంటే బాధగా అన్పించింది.

అందరి ఆడవాళ్ళల్లాగ ఇంటికి రాగానే దెబ్బలాడదు. డబ్బు ఇవ్వలేదని సాధించదు. పైపెచ్చు ఆత్మీయంగా ఆదరిస్తుంది. ఈ రకమైన జీవితానికి అలవాటు పడటానికి పోరాటం సల్పుతున్న దానిలాగ అన్పించింది. ఆ ఊహనే ఆయన భరించలేకపోయారు.

వెంటనే ముందుకి నడిచి, ఆవిడ తలపై చెయ్యి వేశారు. ఆ స్పర్శకే ఆవిడ ఉలిక్కిపడి చూశారు. ఆవిడ చెక్కిళ్ళపై కన్నీటిచారికలు. తడితడిగా కన్పిస్తున్న ఆ కపోలాలపై ఆయన చూపు చిక్కడిపోయింది.

ఆవిడ తననితాను నిలవరించుకుంటూ





"మీరు... మీరు ఇంకా పడుకోలేదా?" అని అడిగింది. ఆయన ఆవిడ తలవైపు మోకాళ్ళపై కూర్చున్నాడు. భావోద్రేకంతో ఆయనకి కొద్దిసేపు మాటలు రాలేదు. నెమ్మదిగా తలెత్తి అన్నారు.

"వీడు... వీడు దుర్మార్గుడు కాదు. రాక్షసుడు కాదు. వీడు... ఈ నీ భర్త ఒక విచిత్రమైన వ్యక్తి. ఈ ప్రపంచంలో చాలా మందిలాగే బలహీనతలున్న వ్యక్తి. జీవితం మన ఇద్దరినీ ఎందుకు కలిపిందో నాకు తెలియదు. నేను...నేను నిన్ను బాధిస్తున్నాననీ తెలుసును. నాలో ఎన్నో కోరికలు, ఏవో కీర్తిశిఖరాలెక్కాలని తపన. నేను పెట్టే పరుగులు నాకూ అర్థమవవు.

"నారాక వలన నీలో అశాంతి రేగుతుందని తెలిసినా రాకుండా, నిన్ను చూడకుండా ఉండలేను. అలాగని బుద్ధిగా ఉండలేని బలహీనత. చెప్పు కామాక్షీ... మన సమస్యకి పరిష్కారం ఏమిటి? ఎలా?"

ఆవిడ తల పక్కన ఆయన తల అటూ ఇటూ అశాంతిగా కదలసాగింది. వెన్నెల వెలుగులో ఆయన ఆవిడ కళ్ళకి ఏడుస్తున్న పండులాగ కన్పించారు. గాలికి కదులుతున్న ఆయన ఉంగరాల క్రాప్‌వైపు చూసింది. ఆవిడ పెదవి విప్పి అడగని ఎన్నో ప్రశ్నలకు ఆయన సమాధానాలు చెప్పాడు. ఆవిడ మౌనంగా నక్షత్రాలవైపు తిరిగింది. ఆయన బట్టలనుండి వస్తున్న సెంటుపరిమళం ఆవిడ నాసికాపుటాలను తాకుతోంది.

"నన్ను...నన్ను నువ్వు అసహ్యించుకోవద్దు కామాక్షీ" ఆయన అస్పష్టంగా అన్నారు.

ఆవిడ నెమ్మదిగా అంది. "అసహ్యించుకొంటే ముగ్గురు బిడ్డలకు తల్లిని కాగలిగే దాన్ని కాదుకదా"

ఆయన తల ఎత్తి ఆవిడలోని నిజాయితీని గ్రహించడానికన్నట్లు చూశారు. ఆవిడ చూపులు ప్రశాంతంగా ఉన్నాయి. వాటిలో ఏ రకమైన కోపంలేదు, బాధ తప్ప. ఆవిడ కనబడని భగవంతుడికి నమస్కారంచేసి అనుకొంది. "ప్రభూ! నాకు మనోబలం, ధైర్యం ఇయ్యి"

మర్నాడు ఆయన గిరిజ చేతికి కొంత డబ్బు ఇచ్చారు. మళ్ళీ కొద్దిరోజుల్లో మరి కొంత ఇస్తానని చెప్పు అన్నారు. ఆయన ఆ డబ్బుతో వంటింట్లో ఒక ఫాను కొందామను కొన్నారు. కానీ ఇంటి ఖర్చులు ఏవిటో తనకి తెలియవు. అందుకే డబ్బు కూతురికి అందించారు. కనీసం అది లెక్కకూడా పెట్టుకోకుండా ఆవిడ పెట్టిలో పెట్టింది. ఆయన మనసు చివుక్కుమంది.

కామాక్షమ్మ పద్మజతో నెమ్మదిగా అంది. "మనం నెయ్యి, కూరలు అమ్ముతున్నట్లు నాన్నగారికి తెలియనీయవద్దు" అని. పద్మ అలాగేనన్నట్లు తల ఊపింది.

వీళ్ళు అనుకొన్నా చుట్టుపక్కల వాళ్ళు కొందరు ఊరుకోరుకదా!

"ఇదిగో కామాక్షీ! మీ పాపతో పంపిన అరకేజీ నెయ్యి తాలూకు డబ్బు" అంటూ ఊరంత గొంతుతో కోమట్లావిడ పిలుస్తూ వచ్చింది. గదిలో కూర్చుని బొమ్మ వేస్తున్న ఆయన చెవులకి ఆ మాటలు విన్పించాయి.

అనుకొన్నట్లే, ఆవిడ భయపడినట్లే తగాదా రానే వచ్చింది. "జమీందారుల ఇంట్లో పుట్టి నెయ్యి, కూరలు అమ్ముకోవడం ఎందుకు" అంటాడాయన. "ఎప్పుడో ఇరవై రోజులకి ఒకసారి, రెండునెలలకి ఒకసారి వచ్చి నాలుగువందలు చేతిలో పెడితే బతుకులు గడుస్తాయా" అంటుందావిడ. ఇద్దరూ వాదించుకున్నారు.

ఈసారి కామాక్షి చలించదలచుకోలేదు. ఇదివరకు ఇలాగే ఆయన చేసే అల్లరికి, యాగీకి భయపడి ఎన్నో వదులుకుంది. ఇంజనీరుగారింట్లో వంటమనిషి కావాలంటే వెళ్ళింది. రెండు పూటలా అన్నంపెట్టి ఉదయం, సాయంత్రం వండి వచ్చెయ్యడానికి మాట్లాడుకుంది. వాళ్ళని డబ్బు, ఏడా



దికి రెండుచీరలు ఇమ్మంది. నెల రోజులు సాఫీగా గడిచాయి. పిల్లలకి పళ్ళు, బిస్కట్లు, చేసిన టిఫిన్లు రెండిళ్ళవాళ్ళు ఇచ్చేవారు

రెండవనెల గడుస్తోంటే ఆయన తోక చుక్కలాగ ఊడిపడ్డారు. ఆరోజు పనిలోకి రాలేనంటూ కబురు పంపించేసింది. మర్నాడు ఆయన బజారుకి వెళ్ళినప్పుడు గబగబా వెళ్ళి పని ముగించబోతూండగా గాలి దుమారంలాగ వచ్చిపడ్డాడు. పండు గాడి వలన తనున్న ఇల్లు తెలిసికొన్నాడు.

"జమీందారుల ఇంట్లో పుట్టి పెరిగిన నా భార్యను వంటకి పెట్టుకొనేటంత ఘనులా మీరు? నేను బాగా డబ్బు సంపాదించాలని, కీర్తి ప్రతిష్టలార్జించాలనీ వెళితే ఈవిడ ఇలాగ నా పరువు తీస్తోంది. మళ్ళీ మా ఆవిడని పనిలోకి పిలిచారా పరిస్థితులు దారుణంగా ఉంటాయి" అని వాళ్ళని హెచ్చరించి, తనని వెంటబెట్టుకొని వచ్చేశాడు.

నెల చూస్తే గిర్రున తిరుగుతోంది. పాలు, . బియ్యం, సరుకులు, పుస్తకాలు, పిల్లల అవసరాలు ఎన్ని తీరిస్తే ఇల్లు గడుస్తుంది. తినడానికి లేక, కట్టుకుందుకి లేక తను, పిల్లలు ఎంత యాతనపడుతున్నారు. దరిద్రంకన్నా దుర్భరమైనది వేరే ఏదైనా ఉందా?

"నన్ను వీధిన పడెయ్యకు. నా యాతనలు నేను పడి ఇంత డబ్బు తెచ్చి నీ మొహాన్న కొడతాను. ఆ చేసే చాకిరీ ఏదో అక్క చెల్లెళ్ల దగ్గిర, అత్తవారివైపు వాళ్ళ దగ్గరా చేయరాదా? ఉహూ... పనికిరాదు. పరువు పోతుందిట. బయటివాళ్ళ కడుపులు నింపడానికి పరువు పోదా? " ఆయన రెండు రోజులు గొణుగుతూనే ఉన్నాడు.

ఆవిడకి కడుపు మండిపోయింది. తనేమిటో, తన అభిమానం ఏమిటో ఈ మనిషికి ఎప్పుడు అర్థమవుతుంది? అక్కాచెల్లెళ్ల ఇంటికి వెళ్ళి చాకిరీ చేయాలా? లేదా తోడికోడలికి సేవచేయాలా? ఇప్పటికే "వెర్రివాడి భార్య వాడకంతా లోకువ" అన్నట్లు అయింది తన బతుకు. ఇంకా దాన్ని నవ్వులపాలు చేయాలని ఆయన సంకల్పం కాబోలు చెడి స్నేహితుడి ఇంటికి వెళ్ళమన్నారు కానీ బంధువుల గడపలు ఎక్కమనలేదు.

పది రోజులు గడిచేటప్పటికి తల్లి, ఆయనగారి తమ్ముడు, తన అన్న, వదిన దండయాత్ర చేసినట్లు వచ్చారు. తల్లి బుగ్గలు నొక్కుకుని అడిగింది. "అబ్బాయి ఒకటే గోల పెట్టాడు. అయినా నీకిదేం బుద్ధి? వంటలక్కలాగ వంటలు చేయడానికి వెళ్ళడానికి సిగ్గు అన్పించలేదా? అవమానం అన్పించలేదా? "

పద్మజకి జడలు నున్నగా దువ్వి వేస్తున్న కామాక్షి చటుక్కున తల ఎత్తింది. "నీ కొడుకు గడ్డివాముల చాటున పేకాటలు ఆడినప్పుడు నీకు సిగ్గు అన్పించలేదు. ఆడపిల్లల పసుపు కుంకాలకిచ్చిన పొలాలు సైతం అమ్మి ముండల దగ్గర ఊరేగినప్పుడు నీకు అభిమానం అన్పించలేదు. వెధవ ఏడ్పు ఏడ్చి అయిదువేలు చేతిలో పెట్టి మొహం చాటు చేసికొన్నారు. నేను నిజాయితీగా నాకష్టం మీద బతుకుతూంటే మీకు అభిమానం అన్పించిందా? సిగ్గు, అభిమానం ఏ విషయంలో పడాలో మీకు తెలియనందుకు నాకు జాలి వేస్తోంది.

"అల్లుడుగారు బాధపడ్డారంటూ ఏడుస్తున్నావు. నీ కూతురు ఎంత బాధపడుతోందో నీకు అక్కర్లేదా? అమ్మా! నా విషయాలలో మీ ఎవరి జోక్యం వద్దు" అని వదినగారి వైపు తిరిగి "నీబిడ్డల భవిష్యత్తుకోసం నీ పుట్టింటివారిచ్చిన ఆస్తి కదలనీయలేదు. మా అన్న దుబారా తగ్గించాలని అధికారం చేతిన పట్టావు. అయినా సానుభూతిగా అర్థం చేసుకొన్నాను. బిడ్డలకొరకు, వారిక్షేమంకోసం అల్లాడే తల్లివని భావించాను. అలాంటి సహృదయత నా ఎడల నీలో ఎందుకు కొరవడింది వదినా? "

ఆ మాటలలోని నిజాయితీని ఆమె గుర్తిం





చింది. భర్తవైపు తిరిగి తమ అడ్డదిడ్డమైన మాటలతో ఆమెను ఎంత బాధపెట్టారో గ్రహించమన్నట్లు చూసింది.

అన్న శ్రీరామ్‌కి కామాక్షి అంటే ఇష్టం. "నేను నిన్ను ఏమీ అడగటానికి రాలేదే. అమ్మ గొడవపెడితే చూడటానికి వచ్చాను. పిల్లలు నువ్వు వచ్చి మా దగ్గర ఉండండి, ఉన్నదేదో అందరం తిందాం" అన్నాడు.

కామాక్షి అన్నగారి పిలుపుకి చలించింది. "వద్దురా: ఈ జీవన పోరాటంలో తాడో, పేడో తేల్చుకోవాలనుకొంటున్నాను. ఆడపిల్ల బతుకు బాగుండక పుట్టిల్లు చేరిందంటే నీకు గౌరవమా? నాకు గౌరవమా? అప్పుడప్పుడు వచ్చి చూసి వెళ్ళరా! అదే పదివేలు" అంది.

శ్రీరామ్ చెల్లెలిని దగ్గరికి తీసుకొని కన్నీళ్ళు కార్చాడు. చిన్నప్పటినుండీ ఒకరి చేత ఒక మాట అన్పించుకోకుండా పెరిగిన పిల్ల. తన అభిప్రాయాలను బహిర్గతపరచ డానికి ఏనాడూ సందేహించలేదు. ఆ కుటుంబంలో తనని నిలదీయగలిగిన ధైర్యం ఈ చెల్లెలికి మాత్రమే ఉంది. నిర్మొ హమాటంగా తనకి నచ్చినది చెప్పి చేసే చెల్లి ఈరోజు ఇన్ని యాతనలు పడుతోంది.

మరిది అనలేక అంటున్నట్లు "అన్నయ్య అవమానంతో తిరగలేనంటున్నాడు వదినా! మీరు పెద్దన్నయ్య దగ్గరకో, నా దగ్గరకో వచ్చెయ్యండి" అన్నాడు.

"ఎందుకయ్యా? ఇప్పుడు మాకు ఏం కష్టం వచ్చిందని? అయినా ఉన్న రెండెక రాలు తలో రకంగా పాడుచేసినప్పుడు నా వరకూ రానిచ్చారా? అప్పులని ఏవో కబుర్లు చెప్పి ఎకరం అమ్మారు. మరో ఎకరం దేవుడికి భోగంకింద ఇచ్చేశారు. నాకు అత్త వారివైపు ఏం మిగిల్చారయ్యా? ఆ పంట ధాన్యంతో తిండి గడిచిపోతోందని ఆనందప డ్డాను. మూడేళ్ళు గడవకుండా నన్ను నిరా ధారురాలిని చేశారు కదయ్యా! అన్నయ్య ఊళ్ళు పట్టుకొని తిరిగితే, భార్యా బిడ్డల విషయం పట్టించుకోకపోతే మీ అన్న య్యలు, మీరు ఏం చేశారయ్యా?

"ఆయన తోచీతోచక నామీద ఏవో చెపితే అడగడానికి వచ్చారా? చాలయ్యా! మీ అభి మానానికి ఒళ్ళు గగుర్పొడుస్తోంది" అంటూ అక్కడినుండి వెళ్ళిపోయింది. యశోదకి అల్లుడి నిర్వాకం మొదటిసారిగా అర్థమైంది. ఉన్న కాస్త పొలం పోగొట్టుకొని కూతురు బిడ్డలతో పడే పాట్లు గుర్తువచ్చి ఆవిడ గుండె కలుక్కుమంది.

తల్లికిగానీ బయట ఎవరికిగానీ భర్త గురించి చెప్పడం ఆవిడ ఉద్దేశ్యం కాదు. అయినా తల్లి మనసు కనుక ఊరుకోలేక అంది "అతడిని బతిమాలో, మందలించో కట్టడిచెయ్యి. నాలుగు రాళ్ళు సంపాదించ మని వత్తిడి తే!"

కామాక్షికి నవ్వు వచ్చింది. బలవంతంగా గుర్రాన్ని నీళ్ళవరకూ తీసుకెళ్ళగలరు కానీ నీళ్ళు తాగించలేరు కదా! ఆయనచేత తిరు గుళ్ళు మాన్పించడం సాధ్యమా?

'అమ్మా! కొడుకు దారి తప్పుతున్నాడనే నువ్వు ఒక పక్క కుమిలిపోతున్నావు. నేను నా బాధలు చెపితే అల్లుడి పనులకి ఎంత ఆవేదన చెందుతావో! ఇలాగ దూరంగా నన్నూ, నా బిడ్డలనూ బంధించుకొన్నది అందుకే' అనుకొంది మనసులో.

వరద బాధితులు, అగ్నిప్రమాద బాధి తులు, కరువు బాధితులులాగ "బంధు బాధి తులు" మరొక రకం అంటుంది కామాక్షి. ఇటూ అటూ పెద్ద కుటుంబాలలో పుట్టడం వలన వచ్చే వాళ్ళు, వెళ్ళేవాళ్ళు. తనవారై తేనేం, వచ్చినవారైతేనేం? వాళ్ళకి మర్యా దలు చేయలేక ఆవిడ పని అవుతోంది. నెల రావలసిన బియ్యం పదిరోజులు వస్తాయి.

అన్నగారు చెల్లి చేతివంట లొట్టలేసి కొంటూ తిన్నాడు. వీళ్ళెవరికీ నీచేతి పాకం రాలేదే! నోటికి మళ్ళీ రుచి తెలిసింది అంటూ మెచ్చుకున్నాడు. వాళ్ళందరూ వెళ్ళాక అమ్మయ్య అనుకొంది.

తల్లి వెళుతూ ఆవిడ మనసులోమాట

బయటపెట్టి మరీ వెళ్ళింది. అల్లుడు అంద రిళ్ళకీ వెళ్ళి ఇలాగ చెప్పడం వలన తన కూతురు అందరిలో పలుచనవుతుంది. అందరూ తన పిల్లలందరిలో కామాక్షి గడు సుదని అంటారు. కానీ భర్తని కొంగుకి ముడివేసికోవడం రాని అమాయకపు పిల్ల. ఎలాగో అతడిని ఇల్లు కదలనీయవద్దని ఆవిడ గొడవ.

భర్త సంగతి తెలిసినా ఇన్నాళ్ళూ ఓర్చు కుంది. ఈనాడు చుట్టాలందరినీ తనమీదికి ఉసిగొల్పడం సహించలేకపోయింది. ఏం మనిషి అనుకొంది. వారందరి దృష్టిలో భర్త సంపాదించి పెడుతూంటే ఇంట్లో ఉండలేక విశృంఖలంగా తిరిగే బాపతుగా భావన కలి గించారు.

అందరూ ఇలాగ రావడం, తల్లిని వంట లకి, బయటి పనులకి వెళ్ళవద్దనడం చూస్తే పిల్లలకి భయం పట్టుకుంది.

కామాక్షి బిడ్డలకి ధైర్యం చెప్పింది. తమ జీవితం తమది, ఒడ్డునున్న వాడికేం తెలు స్తుంది నదిలో కొట్టుకొని పోయేవాడి బాధ అనుకుంది.

అందరూ వచ్చి వెళ్ళారన్న వార్త తెలిశాక ఆయన ఇల్లు చేరాడు. ఆయన వచ్చేటప్ప టికి కామాక్షికి ఒళ్ళు తెలియని జ్వరం. పిల్లలు, సుబ్బమ్మగారు డాక్టరుని తీసికొచ్చి చూపించారు. నాలుగు రోజులు మూసిన కన్ను తెలియకుండా అలాగే పడిఉంది.

పిల్లల ఏడుపులతో, ఆవిడ జ్వరంతో ఆయనకి మతిపోయింది. ఆయన రావడం తోనే సుబ్బమ్మ నాలుగూ దులిపి మరీ వెళ్ళింది. తను రాగానే సకలోపచారాలు చేసే భార్య నిస్తేజంగా పడుకోవడం ఆయ నకి బాధగా అన్పించింది. పిల్లలకి ధైర్యం చెప్పి, ఓ వంటావిడను కుదిర్చాడు.

కామాక్షికి టైఫాయిడ్ అని తేల్చాడు డాక్టర్.

వంటావిడ ఒంటరిది, ఈ ఇంటి పరిస్థితి పసిగట్టేసింది. ఉదయం వెళ్ళి, సాయంత్రం రావడం కష్టం, ఇక్కడేపడి ఉంటానంటూ ఉండిపోయింది. ఆయనకి మరీ ఆనందంగా అన్పించింది.

ఉదయం, సాయంత్రం టిఫిన్లు, వంట లోకి నాలుగు ఆధరువులు, నోటితో చెప్పే తీపితీపి కబుర్లు ఆయనని ఇల్లుకదలనీయ లేదు. కామాక్షికి కొంత జ్వరం తగ్గాక ఇల్లు, పరిస్థితి అర్థమైంది. భర్త స్త్రీలోలత్వానికి అసహ్యించుకుంది.

భర్త ఒకటికి పదిసార్లు 'నీ అక్కగారిలాం టివారు నీకు కావాల్సినవి చెప్పి చేయించుకో' అనడం, ఆవిడ వగలుపోతూ పదిసార్లు మాట్లాడటం కామాక్షికి భరించలేనట్లు అన్పించింది. భర్త ఇంటిపట్టున ఉండటా నికి, డబ్బు ఇష్టం వచ్చినట్లు గుమ్మరించడా నికీ కారణం ఆవిడ మెప్పు అని గ్రహిం చింది.

ఆయన బయటికి వెళ్ళిన సమయం చూసి అన్నయ్యకి ఫోను చేయించింది తల్లిని వెంటనే పంపమని. సాయంత్రానికి వచ్చిన అత్తగారిని, బావమరిదిని చూసి ఆయన మొహం చిట్లించుకున్నారు. చెల్లెలు ఫోనుచేసిన విషయం వాళ్ళు రహస్యంగా ఉంచారు.

కామాక్షి వంటావిడను పిలిచి మర్యాదగా చెప్పేసింది. "మావాళ్ళు వచ్చారు కదా! మీరు చేస్తున్న ఇల్లు వదిలి ఎన్నాళ్ళు ఉండ గలరు? నాలుగు రోజుల పనికోసం, నోటి దగ్గర కూడు వదులుకోలేరు కదా" అంది.

కోటలో పాగా వేయవచ్చునుకొన్న వంటా విడ మొహం ఆవగింజంతయింది. రాధాకృ ష్ణమూర్తి మాత్రం ఏమనగలడు?

తల్లి సాయంతో, పిల్లలసాయంతో ఆ జ్వరంనుండి ఎలాగో కామాక్షి బయటప డింది. ఆమె జీవితంలో పడిన మొదటి




అనారోగ్యం అది.



తల్లి ఏనాడూ ఇలా వచ్చి ఎరుగదు. పురిటికి తీసుకొని వెళ్ళడానికి, పురుడయ్యాక దింపడానికి మాత్రమే ఆవిడ వచ్చేది. భర్త నీడలో చీకూ-చింతా లేకుండా ఆవిడ జీవితం నడిచింది. తనకి కావలసినట్లు తిని, తనకి తోచినవాళ్ళకి ఉపకారాలు చేసి బతికింది. దరిద్రం, బాధలు అన్నవి ఆవిడవరకూ లేవు. అలాంటి తల్లిని మొదటిసారి తనకి సహాయం కోసం పిలిపించడం కామాక్షికి కష్టంగానే ఉంది. తప్పని పరిస్థితి. భర్తకి ఆ వంటామె పరిచయం ఎలా అయిందో కూడా ఆమెకి అర్థమవలేదు.

తల్లి ఎదురుగా తగాదాలు పడటం కూడా ఇష్టంలేదు. కామాక్షి ఎంత మర్యాదగా చెప్పినా అవతలి ఆవిడ అర్థం చేసుకోలేదు. "బాబుగారు ఉండి, నాలుగురోజులు సహాయం చేయమన్నారు. అలాంటి కళామూర్తులకి సాయం చేస్తే నా జన్మ ధన్యమైనట్లే"

ఆ వంటావిడ మాటలు కామాక్షికి మతిపోగొట్టాయి. భర్త సంగతి తెలియనిది కాదు. ఏనాడూ ఇంట్లోకి సరుకులు, కూరలు తేనివాడు ఈ పదిరోజులలో ఇల్లు వాటితో నింపేశాడు.

"మీ వంట అమోఘం. అద్భుతం. ఏదీ మీ అమృతహస్తాన్ని ఇలాగ చూపించండి. నాకు కొద్దిగా హస్తసాముద్రికం తెలుసును" అంటూ ఆవిడ చేతిని పట్టుకోవడం, గంటలు గంటలు ఆవిడతో కబుర్లు చెప్పడం, ఆవిడ కష్టసుఖాలు ఆరా తీయడం కామాక్షి దృష్టిని దాటిపోలేదు. భార్య అనారోగ్యంగా ఉన్న సమయంలో కూడా ఆయన ప్రదర్శించిన బలహీనతని ఆమె జీర్ణించుకోలేకపోయింది.

"బాబుగారూ" అని ఆవిడ పిలిస్తే ఆయన ఖండించారు. "మూర్తిగారూ!" అని పిలవాలి. లేదా అందరిలాగా "రాధాకృష్ణ" అని పిలవాలి" అంటూ అభ్యర్థన జారీ చేశారు.

ఆవిడకి ఆయన వేసే చిత్రాలు అద్భుతంగా కన్పించేవి. గబగబా పనులు పూర్తిచేసుకొని ఆయన గదిలో కూర్చునేది. ఆ చిత్రాల గురించి, తన గొప్పతనం గురించి ఆయన ఓపికగా చెప్పేవారు.

ఈ పరిస్థితి చూస్తుంటే కామాక్షికి పెళ్ళి అయిన తొలిరోజులు గుర్తువచ్చాయి. ఆ రోజులలో ఆయన ఆమె కొంగు పట్టుకొని తిరిగేవారు. తన ఆర్టు గురించి, తనకున్న ఆశయాల గురించి వివరంగా చెప్పేవారు. పగలూ, రాత్రి అవే కబుర్లు. తనకి కూడా చిత్రాలను గీయడం నేర్పుతానన్నారు. పెళ్లైన కొత్తలో దంపతులకి ఒకరికొకరు చాలా అందంగా, అద్భుతంగా కనిపిస్తారు. ప్రతి చిన్న విషయం భార్యలోని ప్రతి చిన్న కదలిక ఆనందంగానే ఉంటుంది. లోపాలేవీ కన్పించవు. "నువ్వు చాలా కళగా ఉంటావు. నీ కళ్లల్లో మంచి ఆకర్షణ ఉంది కామాక్షీ! నీ బొమ్మ గీస్తాను" అనేవారు.

ఈ సమయంలో ఆమెకి అవన్నీ గుర్తువచ్చేవి. మగవాడికి తన రంగం గురించి ఆసక్తిగా వినే అర్థాంగి కావాలి అని. ఆమెకి నవ్వు వస్తుంది. పురుషుడికి భార్యకన్నా ఉత్తమ శ్రోత ఉండరేమో!



కాని పిల్లలున్నారన్న జ్ఞానం కూడా లేకుండా ఆయన చిన్న పిల్లవాడిలాగ ఆ వంటావిడ చుట్టూ తిరగడం భరించలేని కామాక్షి ఆమెను పంపించేసింది.

కూతురు కాస్త ఆరోగ్యవంతురాలయ్యేవ రకూ తల్లి ఉండిపోవలసివచ్చింది. అన్నగారు మళ్ళీ వస్తానని చెప్పి వెళ్ళిపోయాడు.

పండుగాడు తండ్రిని బజారుకు తీసికెళ్ళమని పేచీ. తండ్రితో హోటల్‌కి వెళ్ళడం అంటే వాడికిష్టం.

తన అందం, రంగు పూర్తిగా పుణికి పుచ్చుకున్న వంశోద్ధారకుడంటే ఆయనకి ప్రాణం. పండుగాడు బతకనేర్చినవాడు. తండ్రి ఉన్న నాలుగురోజులూ ఆయన కూడా తిరుగుతాడు. ఆయన కనుమరుగవగానే ఆయన ప్రసక్తి వదిలేస్తాడు. హోటల్ లోనైతే కావలసినవన్నీ అడిగి తినవచ్చు తన ఫ్రెండ్స్‌కి కూడా గొప్పగా తండ్రితో వెళ్ళానని చెప్పుకోవచ్చు

ఆరోజు వాడిని తీసుకొని రాధాకృష్ణ మూర్తి హోటల్‌కి వెళ్ళాడు. ఇద్దరూ కావలసినవి తిన్నాక ఇంటికి దండిగా ఇడ్లీ, పూరీ కట్టించి, పొట్లాలు పట్టుకుని బయలుదేరారు.

ఇల్లు చేరాక ఆయన కొడుకుని మరొక సారి గంభీరంగా చూసి, "సాయంత్రం నిన్ను సినిమాకి తీసుకెళతాను. అవన్నీ ఇంట్లో ఇచ్చి ఆడుకుందుకి ఫో" అన్నారు.

పండు అలాగేనంటూ గొప్పగా అక్కలకి తను తెచ్చినవి అందించి, ఆటలకి వెళ్ళిపోయాడు. వాడికి అన్ని విషయాలూ తల్లికి చెప్పడం అలవాటు. మధ్యాహ్నం భోజనాల దగ్గర తల్లితో "అమ్మా! నేనూ, నాన్నగారూ మన పెద్దమ్మగారింటికి వెళ్ళామే. పెద్దమ్మగారు మాకు కాఫీ ఇచ్చారు. నన్ను ఎత్తుకుని ముద్దు పెట్టుకున్నారు" అని చెప్పాడు.

కామాక్షికి పెద్దమ్మగారెవరో అర్థమవలేదు. సుబ్బమ్మను పిల్లలు అమ్మమ్మగారనే అంటారు. తనకి తెలిసినవాళ్ళ ఇళ్ళకి భర్త వెళ్ళడు. అందుకే ఆవిడకి వాడు చెప్పిన మనిషి ఎవరో తెలియలేదు.

పద్మజ అడిగింది, "పెద్దమ్మ ఎవరురా? ఆవిడ ఎక్కడ కన్పించింది" అని. గిరిజ నవ్వుతూ "ఈ వెధవకి ఎవరూ తెలియరమ్మా! నాన్నగారు ఎవరో ఫ్రెండ్స్ ఇంటికి తీసికెళ్ళి ఉంటారు" అంది.

పండుగాడికి వాళ్ళు అలాగ తనని అమాయకుడిని చేసి మాట్లాడటం నచ్చలేదు. "మీరు ఇదివరకు చూడలేదూ? మన ఇంట్లో వంటలు కూడా చేశారు. ఆవిడే కన్పించారు. నాన్నగారినీ, నన్నూ ఇంటికి తీసికెళ్ళారు. నాకు పాలు ఇచ్చారు. నాన్నగారు ఆవిడను 'పెద్దమ్మ' అని పిలవాలని చెప్పారు" అన్నాడు.

పండు మాటలు యశోదమ్మకి విషయాన్ని అర్థం అయీ కానట్లు చెపుతున్నాయి. కామాక్షి పండు దృష్టి మరల్చాలని ప్రయత్నించింది. అప్పుడే కొడుకుని వారించడానికి అక్కడికి వచ్చిన రాధాకృష్ణమూర్తి చూపులు, కామాక్షి చూపులు కలుసుకున్నాయి. పండు మళ్ళీ తాము హోటల్‌లో ఏం తిన్నదీ అవే చెప్పసాగాడు.

"పండూ! కన్పించిన ప్రతీవాళ్ళూ పెద్దమ్మలు, అమ్మలు కాలేరురా! వరసలు కట్టి పిలవవలసిన అవసరం మనకి లేదు" అంది కామాక్షి.

ఆమె మాటల్లోని తీవ్రత ఆయనకి చెళ్ళున తగిలింది. "ఏదో ఆవిడ కనబడి, ఇక్కడే ఇల్లు, రండి అని పిలిస్తే వెళ్ళాం" ఆయన సర్దిచెపుతున్నట్లు అన్నారు.

ఆ ప్రసక్తే ఇష్టం లేనట్లు కామాక్షి అక్కడి నుండి వెళ్ళిపోయింది. తల్లి మాత్రం 'ఇదంతా ఏమిటమ్మా' అని కూతురు ఒంటరిగా ఉన్నప్పుడు అడిగింది.

"పేరు కృష్ణమూర్తి కదమ్మా! అన్నీ రాసలీలలు" పేలవంగా నవ్వుతూ అంటున్న కూతురి గొంతులోని బాధ ఆవిడని కదిలించింది.





భార్యని, అత్తగారిని ప్రసన్నం చేసుకోవడానికి ఆయన రెండు జరీచీరలు తెచ్చారు. "అత్తయ్యగారు రాకరాక మన ఇంటికి వచ్చారు. వట్టినే ఎలా పంపిస్తావు" అంటూ వాటిని భార్యకి అందించారు. తల్లికి అని చెప్పి ఆకుపచ్చ జరీబుటావున్న గుంటూరు జరీచీర ఉంచి, రెండవది ఆయనకు అందించింది. ఆయన మొహం చిన్నపుచ్చుకుని "కామాక్షీ! అది నీకే కొన్నాను. ఈ గులాబీ రంగు జరీపూలున్న చీర నీకు చాలా బావుంటుంది" అన్నారు.

ఆమె ఏమీ చలించకపోయేసరికి అత్తగారిని చూస్తూ "చూశారా అత్తయ్యగారూ! ఆ చీరలో తనని చూడాలని తెస్తే తీసుకోవడం లేదు. తను పోట్లాడి అవి కావాలి, ఇవి కావాలి అంటూ గట్టిగా ఒత్తిడి తెస్తే ఏనాడో తనని అందలం ఎక్కించి ఊరేగించేవాడిని" అన్నాడు.

కామాక్షి ఆయన అతి ధోరణికి చిరాకు పడింది. ఈయనకి ఎప్పుడూ బంధువుల దగ్గర మంచి పేరు తెచ్చుకోవాలనే కోరిక. దానికోసం అడుగులకి మడుగులు వత్తడానికి కూడా రెడీ అనుకుంది.

నాలుగురోజులు గడిచాక రాధాకృష్ణమూర్తి ఒక మంత్రిగారు వేయమన్న బొమ్మను పట్టుకుని ఊరు బయలుదేరారు. రెండు రోజులలో తిరిగి వస్తానని చెప్పి వెళ్ళారు. ఆయన వెళ్ళిన మర్నాడే పద్మ పెద్ద పిల్లయింది. కామాక్షికి కళ్ళు చెమర్చాయి. తన బిడ్డ ప్రాథమిక దశ దాటి యవ్వనదశకి చేరుకుంది. ఈ జీవితంలో కష్టాలు, కన్నీళ్ళే కావు, చిన్నచిన్న ఆనందానుభూతులూ ఉన్నాయి.

కామాక్షికి భర్త గుర్తువచ్చాడు. ఏ ఆనందానుభూతి అయినా భార్యాభర్తలిద్దరూ కలిసి పంచుకోవాలన్పిస్తుంది. సంతానం అంటే మరొకతరం. తమ సంతానానికి సంబంధించిన అనుభవాలు జన్మనిచ్చిన దంపతులిరువురు కలిసి పంచుకోవాలనుకోవడం అత్యాశ కాదుకదా!

సుబ్బమ్మ దగ్గరికి వెళ్ళాక కళ్ళనీళ్ళు నిగ్రహించుకోవడం కామాక్షి తరం కాలేదు. "మీరు పెద్దవారు. వచ్చి నా బిడ్డకి నాలుగు అక్షింతలు వేయండి" అంటూ పిలిచింది. "మాకు... మాకు ఐశ్వర్యం ఉందా, లేదా, తగిన అండ ఉందా, లేదా అన్నది కూడా ఆ దేవుడికి అక్కరలేదు. జీవితంలోని చేదు, తీపి సంఘటనలను అలాగ నడిపించేస్తాడు. అంతేకదూ పిన్నిగారూ" అంటున్న కామాక్షిని చూస్తే సుబ్బమ్మకీ కళ్ళనీళ్ళు తిరిగాయి. "నువ్వు... నువ్వు బేలతాన్ని ప్రదర్శిస్తున్నావా పిల్లా! ఈ కామాక్షి నాకు తెలియదు. నాకు తెలిసిన కామాక్షి వర్తమానంలోంచి భవిష్యత్తు ఎలాంటిదైనా దూసుకొనిపోతుంది. ఆ కామాక్షినే నేను ఎప్పుడూ చూడాలనుకొంటాను" అంది.

వీధిలోని నలుగురు ఇళ్ళవాళ్ళూ ఆ సందడిని పంచుకున్నారు. వాళ్ళ దృష్టిలో తమ తల్లో నాలుకలాగ ప్రవర్తించే కామాక్షికి ఏ అక్కర వచ్చినా నిలబడవలసిందే. ధాన్యం తెప్పించినవారొకరైతే, కొబ్బరి మట్ట కొట్టి, కావలసిన వస్తువులు సిద్ధం చేసినవారు మరొకరు, నిముషాలమీద పిల్లని పేరంటాళ్ళు ఆశీర్వదించి కూర్చోబెట్టారు.

ప్రిన్సిపాల్ గారి భార్య తమ ఎటెండర్లనిద్దరిని పిలిచి తలొక ఊరుకి పంపించమంది. కామాక్షికి భర్తని ఎలా పట్టుకోవడమో అర్థమవలేదు. ఒకపక్క తల్లి చూస్తే ఫంక్షను జరిపించమని గొడవ. మొదటిపిల్ల, మొదటి శుభం! నలుగురు బంధువులనీ పిలిచి పేరంటం, బంతిభోజనాలు పెట్టవద్దా అంటూ గొడవ. ఈ మూడు రోజులలో భర్త శుభకార్యానికి అందుతాడా అన్న ఆలోచన. భారం భగవంతుడిపై వేసి బంధువుల ఇళ్లకి శుభవార్తతోపాటు భర్త ఉంటే పంపమని కబుర్లు పెట్టింది.

ఎక్కడా అతడి జాడలేదు. శుభకార్యానికి కావలసిన డబ్బు సుబ్బమ్మ, ప్రిన్సిపాల్ గారి

భార్య అప్పు ఇచ్చారు. పిల్లకి మంచి బట్టలు కొని, పనులలోకి దిగింది కామాక్షి. మన సుని నిగ్రహపరచుకుని విజయవాడ వసంత ఇంటికి మనిషిని పంపింది. మర్నాడు వెళ్ళిన మనిషి వచ్చి ఇంటికి తాళం వేసి ఉందని, వాకబు చేస్తే వాళ్ళు తిరుపతి వెళ్ళారని చెప్పారని చెప్పాడు. కామాక్షి నిశ్చేష్టురాలైంది. వసంత పనిమనిషి చెప్పిన సమాచారం ప్రకారం తన భర్త వాళ్ళని తీసుకొని వెళ్ళాడని అర్థమైంది. ఒక దెబ్బ తగిలితే బాధ. కానీ వరుసగా దెబ్బ మీద దెబ్బ తగులుతూంటే మనసు రాయి అయిపోతుంది.

బంధువులందరూ వచ్చారు. తల్లి కోరిక ప్రకారం ఉన్నంతలో ఘనంగానే జరిగింది. భర్త ఇంటలేని విషయం నలుగురికీ తెలుస్తుందనే ఆమె క్లుప్తంగా చేద్దామనుకుంది. ఊళ్ళోవాళ్ళు నలుగురూ వచ్చి దీవిస్తే చాలనుకొంటే తల్లి అంగీకరించలేదు. మన ఇంటి పిల్లని మనవాళ్ళందరూ వచ్చి ఆశీర్వదించవద్దా అంది. కామాక్షి అంతవరకూ ఆయనని బంధువుల ముందు పడెయ్యలేదు. ఈనాడు ఆయనే దానికి ఆస్కారం ఇచ్చారు. యశోదమ్మే 'అల్లుడు ఏదో ఆర్టు ఎగ్జిబిషన్ ఉందని ఢిల్లీ వెళ్లాడని, అంతదూరం నుండి రావడానికి వీలవదని' వచ్చిన వాళ్ళు అడిగితే చెప్పింది.

కామాక్షి అక్కలు, చెల్లి వచ్చారు. భర్త వైపు వాళ్లు వచ్చారు. "మావాడు భార్యని, బిడ్డలను మంచిస్థితిలోనే ఉంచాడు. లేకపోతే మా మరదలు ఇంత వైభవంగా చేయగలదా" అని బావగారు అంటూంటే కామాక్షికి తలతిరిగిపోయింది. వెళుతున్న ఆయన అందరిలాగ మామూలుగా వెళ్లవచ్చుకదా. తండ్రి తరువాత పెదతండ్రి అంటారే, ఈ ఇంటి బిడ్డల బాధ్యత ఆయనపై లేదా? బాధ్యతను విస్మరించి ఈనాడు ఎకసక్కెంమాటలు అంటున్నాడు.

కామాక్షి ఆయనని సూటిగా చూసి అంది. "మీ తమ్ముడు మొదటినుండీ మంచి స్థితిలోనే ఉన్నారు. తల్లిదండ్రులు, అన్నదమ్ములైనవారు ఆయనని ఆ స్థితిలో ఉంచడానికి ఎంత కష్టపడ్డారో? ఆయనని చేపట్టాక ఆయన స్థితి నాకు సంక్రమించకుండా ఎలా ఉంటుంది? మా కడుపున పుట్టిన ఈ అదృష్టవంతులికి ఆ వారసత్వస్థితి లభించకుండా ఉంటుందా? "

ఆమె మాటలలోని వాడి, వేడి ఆయనకి సూటిగానే తాకింది. అందరిలాగ తమ ఇళ్లకి వచ్చి కష్టసుఖాలు ఏకరువు పెట్టకుండా ఎప్పుడూ నిండుకుండలాగ ప్రవర్తించే కామాక్షి అంటే వాళ్ళకి కన్నెర్రే. "అయిందా సంబడం. ఒకటని నాలుగు అన్పించుకోవడం మీకు అలవాటే" అంటూ భార్యే ఆయనని దులిపేసింది.

కామాక్షి నవ్వుతూ "ఫర్వాలేదులే అక్కయ్యా! బావగారు మా కష్టసుఖాలు కనుక్కోకుండా వెళ్లలేరు" అంటూ వచ్చినవాళ్లకి జాకట్టుగుడ్డలు పెట్టి, స్టీలు టిఫిన్ బాక్సులు అందించింది కామాక్షి.

కామాక్షి పెద్దక్క, రెండవ అక్క రెండురోజులుండి వెళ్ళి పోయారు.

★ ★ ★

కామాక్షి అక్క మీనాక్షిది పెద్ద ధనవంతుల కుటుంబం. ఆమె భర్త ప్రతీక్షణం ఆమెను తమ హోదాకి తగినట్లు ఉండాలని ఆదేశిస్తూ ఉంటాడు. తనకి, పెద్ద చెల్లికి లభించిన జీవితంలాంటిది కామాక్షికి లభించలేదని ఆవిడ ఆవేదన. ఏనాడూ తమ ఇళ్లల్లో జరిగే ఏ శుభకార్యానికి కామాక్షి మానలేదు. తన స్థితి గురించి బంధువుల వ్యాఖ్యానాలను ఆమె ఏనాడూ పట్టించుకోలేదు. అసలు ఆ జీవితం ఆమెకి అప్రియమైనట్లు ప్రవర్తించనే ప్రవర్తించదు. తన ఆడపడుచులు, అత్తగారు ఎన్ని వేళాకోళాలు ఆడినా గంభీరంగా నవ్వుతూ తేలికగా జవాబులిచ్చే చెల్లి అంటే ఆమెకి ప్రాణం.

చెల్లిలో నిబిడీకృతమై ఉన్న ధైర్యసాహసా





లంటే ఆవిడకి ఇష్టం. నా చెల్లిలాంటి స్త్రీ మూర్తులరుదు అని గర్వంగా చెప్పుకొంటుంది ఎప్పుడూ. పిల్లకి బంగారపు దుద్దులు, జుంకాలు, బట్టలు తీసుకొచ్చిందావిడ. చిన్న బుట్టలతో అవి పద్మకి ఎంతో నచ్చాయి. పట్టు పరికిణీ, ఓణీ, జాకెట్టులతో పాపని అలంకరించేపని ఆవిడ స్వీకరించింది. మగబిడ్డలు ముగ్గురున్నా ఆడపిల్ల లేని కొరత ఆమెని బాధిస్తూనే ఉంది.

చిక్కి, వన్నె తగ్గిన చెల్లిని ఆదరంగా అక్కున చేర్చుకుంది. తాను సరదాపడి తెచ్చిన గంధం రంగు మైసూరు సిల్కుచీర చెల్లి చేతిలో పెట్టింది.

"ఒక తల్లి కడుపున పుట్టినవాళ్ళం. ఒక పేగుబంధం ఎప్పుడూ పీకుతూనే ఉంటుందే. ఆయనెప్పుడూ వస్తూనే ఉంటారు. నువ్వు చూస్తే అవసర సమయాల్లో మాత్రం కన్పిస్తావు. నిన్ను చూడాలని నా మనసు కొట్టుకునిపోతుందే" అంటూ చెల్లెలి తలనిమిరింది. అక్కగారి ఒడిలో పసిపిల్లలాగ ఒదిగిపోయింది, కామాక్షి.

"చెల్లీ! ఎలా ఉన్నావు? ఎలా ఈ జీవిత నావను నడుపుతున్నావు? ఈ బిడ్డలతో, ఈ ఒడిదుడుకులతో ఏం చేస్తున్నావో అని బెంగ పడుతూ ఉంటానే" అంటూంటే ఆవిడ కళ్ళు సజలాలయ్యాయి.

కామాక్షికి నోటమాట రాలేదు. ఒక ఘనమైన మేఘం, ఒక పిల్లిగాలి తాకిడికి ఆర్ద్రత పొందినట్లు అయింది. అది అక్క ఒడా... కాదు, అనురాగబంధాల గుడి "చెల్లీ, డబ్బు పంపిస్తే తిప్పికొడతావు. మీ బావ నావారు అయినప్పుడు, నేను మీదాన్ని అయినప్పుడు ఆయన సిరిసంపదలు నావి కావా? ఆనాడే ఈ సంబంధం వద్దనీ, తిరస్కరించమనీ చిన్నక్క చెప్పినా నువ్వు విన్పించుకోలేదు. నాన్నగారి పెద్దరికం నిన్ను శాసించింది. ఈనాడు ఎవరు నీ స్థితిని పంచుకుంటారు? "

కామాక్షి కొద్దిక్షణాలు ఆ ఒడిలో అలాగే ఉండిపోయింది. ఎంత ప్రశాంతత? ఎంత నిశ్చింత. తనలోకి ఏదో ఒక కొత్త బలం చేరినట్లన్పించింది. ఇందుకే "తల్లి తోడూ" అని పెద్దలన్నారా? కామాక్షి తల ఎత్తి అక్కగారి మొహంలోకి చూసింది. ఆ మొహంలో ఎంతో ఆప్యాయత కన్పిస్తోంది. నిండైన ఒక పెద్దరికం కన్పిస్తోంది. తన రెండు చేతులతో అక్క మొహాన్ని అందుకుంది. ఆవిడ కళ్ళవైపు చూస్తూ అంది. "అక్కా! నీ కళ్ళల్లో అమ్మను చూస్తున్నా"

మీనాక్షి కదిలిపోయింది. చెల్లెలి నుదిటి నిండా ముద్దులు కురిపించింది. పండుగాడు వచ్చి చప్పట్లు కొట్టాడు. "మా అమ్మ పెద్దమ్మ ఒళ్ళో ఎలా పడుకుందో? అమ్మా! నువ్వు గిరిజవా? పద్మక్కవా? "

కామాక్షి నవ్వుతూ కొడుకుని చూసింది. వాడిని ఒడిలోకి లాక్కుంటూ "కాదు. నేను చిన్న పండుగాడిని" అంది. అందరూ నవ్వేశారు. అక్కచెల్లెళ్ళు నలుగురూ ఆ రెండు రోజులూ ఎంతో ఆనందంగా గడిపారు. రెండవ అక్క వనజాక్షి మనస్ఫూర్తిగా అంది, "ఈ ఇంట్లో చాలా ప్రశాంతత ఉందే కామూ! నాకు అది నీ సాన్నిధ్య మహిమ ఏమో అన్పిస్తోంది"

ఆ ఇల్లు, ఆ పిల్లలు, ఆ ఆత్మీయత వాళ్ళకి అపురూపంగా అన్పించాయి. వనజాక్షి కామాక్షికి ఒక సూచన చేసింది. "అక్కకి ఆడపిల్లలు లేరు. పోనీ మన పద్మని అక్క దగ్గర ఉంచవచ్చుకదా"

పద్మ తటాలున భయంగా తల్లి మొహంలోకి చూసింది. యశోదమ్మకీ ఈ ప్రతిపాదన నచ్చింది.

"పెద్దదాన్ని కాకపోతే చిన్నదాన్ని పంపు. నీకూ సులువవుతుంది. అక్కకీ ఆడపిల్లలు లేని కొరత తీరుతుంది. తల్లిగా చెపుతున్నాను. మీలో మీరు కష్టసుఖాలు పంచుకోకపోతే ఎలాగ? " అంది.

ఉతికిన బట్టలు మడతలు పెడుతున్న



మీనా వచ్చి కామాక్షి చెయ్యి పట్టుకుంది. "వాళ్ళు అంటున్న మాటలు వాళ్ళ అభిప్రాయాలు కామూ, నేను వాళ్ళచేత అన్పించానని, అడిగించానని అనుకోవద్దు. నాకు ఈ ఊహే రాలేదు. తల్లిని బిడ్డలను వేరుచేయాలని నాకు అన్పించదే. భగవంతుడు అన్నీ ఇచ్చి ఎందుకో ఒక కొరత పెట్టాడు. ఎప్పటి పాపమో ఈ లోపం" అంది.

కామాక్షి నిండుగా నవ్వింది. "అక్కయ్యా! నీమనసు తెలియనిదానిని కాను. అనవసరంగా ఎవరిపై నా నిందలు వేయను. వాళ్ళ అభిప్రాయాలు వాళ్ళు చెప్పారు. నాకు ఇష్టం అయితే పాటించవచ్చు లేదా వదిలేయవచ్చు.

"అమ్మా! నామీద, నా బిడ్డలమీద ప్రేమతో చెప్పావు. కానీ "తీగకు కాయ భారమా? " అన్న పాట విన్నావుకదా! నిజం మీకు చెప్పనా? ఆ పిల్లలు నా శరీరంలోని భాగాల్లాగ అన్పిస్తారు. ఏ భాగాన్నీ దూరం చేసుకోలేను. ఈ దరిద్రం, ఈ పరిస్థితులు నన్ను బాధించకపోవడానికి కారణం ఈ పసివాళ్ళేనమ్మా! వాళ్ళు నా ఊపిరి. వాళ్ళు



నా ధైర్యం. వాళ్ళు నా జీవితం. వాళ్ళ కోసమే బతకాలన్పిస్తుంది. ఇలాంటి ఎన్ని బాధలనైనా భరించగలగడానికి వాళ్ళే నాకు శక్తినిస్తున్నారమ్మా"

గుండె లోతుల్లోనుండి వస్తున్న ఆ మాటలు వారిని పెదవి కదపనీయలేదు. పద్మ, గిరిజ వచ్చి తల్లిని చుట్టేశారు. పండు తల్లి వీపుమీద వాలిపోయాడు. ఎదురుగా కన్పిస్తున్న ఆ అపురూప దృశ్యాన్ని వాళ్లు ముగ్ధులై చూశారు.

యశోదమ్మ వెళ్ళిపోతుంటే కామాక్షి చీర పెట్టింది. కాళ్ళకి నమస్కరిస్తూ "అమ్మా! నా గురించి బెంగపడకు. ఒక ఆరునెలలు వ్యవధి ఇయ్యి. నీ ఈ కూతురు అద్భుతంగా బతుకుతుంది. తెలివితేటలు, శ్రమ పడే స్వభావం ఉండాలిగానీ ఈ లోకంలో బతకడానికి భయంలేదు" అంది.

★ ★ ★

రిజల్ట్సు తెలిశాయి. పిల్లలు ముగ్గురూ పైక్లాసులోకి వచ్చారు. మరొక ఏడాది కష్ట పడితే పద్మ పదవ తరగతి పాసవుతుందనుకుంది.

తల్లి తయారుచేసిన అప్పడాలు, వడియాలు పాకెట్లలో పెట్టి తమ చుట్టుపక్కల వారికందరికీ పిల్లలు అందిస్తారు. కామాక్షి రకరకాల ఊరగాయలు పెడుతుంది. చుట్టుపక్కలవారికి ఆవిడ చేతుల్లో అమృతం ఉందన్పిస్తుంది. పనసకాయతో ఊరగాయ, కొబ్బరి ఊరగాయ, వంకాయ ఆవకాయ ఇలాగ ఎప్పుడూ వివిధరకాలైన పచ్చళ్లు, ఊరగాయలు తయారుచేస్తుంది. వాళ్ళందరూ ఇప్పుడు తమ పిల్లలను పచ్చళ్లకోసం ఆవిడ ఇంటికే పంపిస్తున్నారు. కామాక్షి తన ఖర్చులుపోను తన శ్రమ ఫలితం దక్కేలాగా చూసుకుంటుంది. ఆవిడ చేసిన ఊరగాయలు చుట్టుపక్కల వారికి భోజనాల్లో ఒక భాగమైపోయాయి.

ఇంటికి ఒకపక్క మట్టిగోడలమీద రేకులు వేసి రెండు గదులు ఏర్పాటుచేసుకుంది ఆవిడ. ఒకనాడు గది ఏదైనా ఉంటే అద్దెకి ఇస్తారా అని ఒకబ్బాయి వచ్చి అడిగాడు. అతడికి నాయనమ్మ తప్ప ఆధారంలేదు. తమ ఊళ్లోఉన్న ఇల్లు ఒక్కటే ఆస్తిట. నాయనమ్మ వంటలుచేసి అతడిని చదివిస్తోంది. కామాక్షికి డిగ్రీలో చేరిన ఆ అబ్బాయి ఎంతో నచ్చాడు. అతడి నెమ్మదితనం, చదువంటే ఉన్న ఆసక్తి ఆవిడకి నచ్చాయి. తన దగ్గరున్న రెండు గదులలో ఒకటి అతడికి ఇచ్చింది. ఆవిధంగా ఆనంద్ ఆ కుటుంబానికి సన్నిహితుడయ్యాడు.

చుట్టుపక్కలవారు ఒకరిద్దరు కామాక్షిని హెచ్చరించారు. "మీరా మగదిక్కులేని సంసారం. పిల్లలు చూస్తే చిన్నవాళ్ళు. ఆడపిల్లలు కలిగినదానివి. అనవసరమైన గొడవలు ఎదురవుతాయేమో? "

కామాక్షి నవ్వింది. "మన బంగారం మంచిదైతే కంసాలి ఏం చేయగలడు? రెండు చేతులూ కలిస్తే తప్పట్లు మోగుతాయి. తల్లీబిడ్డల మధ్య ఉండవలసింది ప్రేమ, బాధ్యతలే కాదు ఒక నమ్మకం కూడా"

ఆవిడ అలాగే ఆలోచించింది. వేడినీళ్ళకి చన్నీళ్ళలాగ ఆ ఇంటి అద్దె కాస్త తమకి తోడవుతుంది. అతడు బయట హోటల్‌లో భోజనం చేసేవాడు. పండు అతడికి బాగా దగ్గరైపోయాడు.

మధ్యాహ్నవేళల్లో చుట్టుపక్కలవాళ్ళు ఆవిడ దగ్గరికి వచ్చి కాసేపు కూర్చుంటారు. అందరూ పిచ్చాపాటి మాట్లాడుకుంటారు. కామాక్షి బియ్యం ఏరుతూనో, అప్పడాలు వత్తుకుంటూనో వాళ్ళతో గడుపుతుంది. వాళ్ళ మధ్య మొదటిసారిగా ఖర్చులు, డబ్బు ఆదాల ప్రస్తావన వచ్చింది. అందరూ కలిసి ఒక చీటీ వేసుకుందామనుకున్నారు. రెండు వందలైతే బావుంటుందని కొందరు, అబ్బే మూడువందలుండాలని కొందరు వాదించుకున్నారు.

కామాక్షమ్మ మధ్యేమార్గం సూచించింది.





ఒక్కొక్కళ్లు అయిదువందలు చొప్పున కట్టు కుంటే బావుంటుంది. ఏభైమంది కలిసి వేసుకొంటే 25 వేలు అవుతుంది. ఏదో ఒక అవసరానికి పనికివస్తుంది.

అందరూ ఇదే బావుందనుకొన్నారు. తమ చుట్టుపక్కల చిన్న ఉద్యోగస్తులను కూడా చేర్చుకొందామనుకొన్నారు. కామాక్షమ్మనే వాళ్ళు ఈ చీటీ నడపమన్నారు. ఆవిడ వాళ్ళను సాలోచనగా చూస్తూ అంది.

"నేను ఈ చీటీ తప్పక నడుపుతాను. మీ అందరి సహకారం ఉంటే ఇదేం పెద్ద కష్ట మైనపని కాదు. అయితే నా వైపునుండి ఒక అభ్యర్థన..."

అందరూ ఏమిటన్నట్లు చూశారు. "ఈ డబ్బు మీ అందరి దగ్గరనుండీ వసూలు చేయటం, ప్రతీనెలా పాట పెట్టడం పాడిన వాళ్ళకి సొమ్ము అందించడం బాధ్యతతో కూడినపని. ఈ బాధ్యత నేను పడినందుకు ఫలితం కావాలి. వందకి రెండు రూపా యలు చొప్పున ఒక్కొక్కళ్ళు నాకు పది రూపాయలు ఇవ్వాలి. నా శ్రమకి ఆమాత్రం ఫలితం నేను కోరవచ్చుననుకొం టాను.

అంతా వింటున్న సుబ్బమ్మ మొహంలో చిరునవ్వు చేరింది. నెమ్మదిగా కామాక్షి ఏభై మందిని చేరుస్తుంది. అందరూ ఇచ్చే డబ్బుతో తానూ సభ్యురాలవుతుంది. ఆవిడ నవ్వుతూ "ఈమాత్రం దానికి ఇంత ఆలో చన ఎందుకర్రా! ఎక్కడ మనం పదిరూపా యలు ఖర్చుపెట్టడం లేదూ? ఇదీ ఒక ఖర్చు అనుకోండి. ఈ పద్ధతి బావుంది" అన్నారు. అందరూ అలా గేననేశారు. వాళ్ళల్లో కూర్చున్న ఒకావిడ మాత్రం 'ఈపని నేనే చేయవచ్చునుకదా' అనుకుంది. కామాక్షిగారికి బదులు ఆ లాభం నాకు వస్తుంది' అనుకుంది

కాని సుబ్బమ్మ ఒక విషయం మొహం మీద అనేసింది. "కామాక్షికైతే అందరూ స్నేహితులే. ఆవిడ చెప్పినట్లు అందరూ వింటారు. అహా... కాదు. వినేలాగు ఆవిడ చెప్పగలదు? ఎవరైనా పాట పాడి ఎగ్గొట్ట దలచుకుంటే నాలుగు తన్నగలదు? మనమె వరమైనా ఆ పని చేయగలమా?" అంది. వెంటనే ఆవిడ "నాకు ఎందుకు ఈ తల నొప్పి. అందరిలాగు పదిరూపాయలు ఇచ్చి చెయ్యి దులుపుకుంటే చాలదా" అనుకుంది.

కామాక్షికి ఈ చీటీ నడపడం పెద్ద కష్టంగా అన్పించలేదు. అందరూ ఘుడు నాలుగు వీధులవాళ్ళే. "మా అమ్మ ఇమ్మంది" అంటూ వాళ్ళ పిల్లలు కూడా డబ్బు తెచ్చి ఇచ్చేవారు. ప్రతీనెలా పదవతే దీన పాట పెట్టుకుందామనుకున్నారు. కామాక్షికి ఈ పనులన్నింటివలన తనమీద తనకి నమ్మకం వచ్చింది. ఇన్నాళ్ళు భర్తదే బాధ్యత, అతడే ఈ సంసారాన్ని నడపాలను కుంది. శరీరంలో ఒక భాగం చచ్చుపడి పోతే శరీరమంతా నిస్తేజమవ్వాలా? ఆ లోపాన్ని అధిగమించి ముందుకి వెళ్ళాలా? ఆమెకి తన భర్తకి, తనకి మధ్య జరిగిన అనేక సంఘటనలు గుర్తువచ్చాయి.

భర్త తన సుఖం, తన ఆశయాలు చూసు కున్నాడు. బాధ్యతలను విస్మరించాడు. తనను చులకన చేశాడు.

కళాకారుల మనసులు సుతిమెత్తన అంటారు. అటువంటి మనసులో బిడ్డలపట్ల స్పందన లేకపోవడం ఏమిటి? భార్యపట్ల అనురక్తి కొరవడటం ఏమిటి? ఆమెకి ఆలో చిస్తుంటే ఒక విషయం స్ఫురణకి వచ్చింది. ఆయన తమని పట్టుకుని వేలాడలేదు. తామే ఆయనను పట్టుకుని వేలాడారు. ఈ సత్యం గుర్తించడంలో ఆమెకి ఆలస్యమే అయింది.

ఆనంద్, పండు వచ్చారు. "మీరు ఈరోజు ఏదోలాగ కనిస్తున్నారు. ఎనీ ప్రాబ్లమ్" అతడు గాబరాగా అడిగాడు. ఆమె సన్నగా నవ్వింది. గడిపిన జీవితం తాలూకూ వేడి గాడ్పులు చెలరేగినప్పుడు వడలక తప్పదు. వాళ్ళు ఒకళ్లని చూసుకొని

ఒకళ్ళు సంజ్ఞ చేసుకొన్నారు.

ఆనంద్ నవ్వుతూ "మీకు ఒక ఆశ్చర్యకరమైన విషయం చూపించనా? " అన్నాడు.

ఆమె తన ఆలోచనలలోనుండి ఇవతలికి వచ్చి కుతూహలం చూపించింది. "మన పండు ఎంత బాగా ఈ బొమ్మ వేశాడో చూడండి" అంటూ ఆనంద్ ఎంతో గొప్పగా వున్న వినాయకుడి బొమ్మ చూపించాడు.

"పండు ఈ బొమ్మ వేశాడా? " ఆమె ఆశ్చర్యంగా ఆ చిత్రంవైపు చూసింది. ఛార్టుపై ఇండియన్ ఇంక్‌తో వేసిన ఆ గణపతి ఎంతో అందంగా ఉన్నాడు. ఒక చేతిలో తెల్లటి ఉండ్రాయి. కింద చిట్టి ఎలుక. ఆ తొండం, ఆ కళ్లు అలాగే చూస్తూ ఉండిపోయింది. రెప్పవేయడం మరిచిపోయినదాని లాగా ఉంది.

పండు దాన్ని వేశాడంటే ఆమె నమ్మలేకపోతోంది. ఎవరి దగ్గరా నేర్చుకోకుండా, ఏనాడూ తన ఎదుట పడకుండా ఇంత కళని ప్రదర్శించాడా?

"పండూ! నువ్వు...నువ్వు దీన్ని వేశావా? " ఆమె గద్గద స్వరంతో అడిగింది. "అవునమ్మా! నాన్నగారు వేసిన సిద్ధిగణపతి బొమ్మ మన పూజా మందిరంలో ఉంది కదా! అదిచూసి వేశాను"

ఆమె మౌనం వహించింది. ఆనంద్ సంబరంగా అన్నాడు. "పండు వేసిన బొమ్మ చూసి వాళ్ళ మాష్టారు ఎంతో పొంగిపోయారట. హెడ్‌మాష్టారికి కూడా చూపించారుట. ఆయన ఎంతో సంతోషించి మన పండుకి కలర్ పెన్సిల్స్ ప్రజంట్ చేశారుట. పైగా "పులి కడుపున పులి పుడుతుంది" అని పొగిడారుట."

పండువైపు ఆమె వెర్రిదానిలాగా చూస్తూ ఉండిపోయింది.

పండు... తన పండు ఎటువైపు నడుస్తున్నాడు? వాడిలోని ఈ కళ వారసత్వమా? కళ వారసత్వమైతే కళతోపాటు మిగిలినవి కూడా వారసత్వంగా సంక్రమిస్తాయా? తను ఏంచేయాలి. పండుని ఏరకంగా బాధ్యతాయుతంగా పెంచాలి. సాధారణంగా తల్లిదండ్రులు తమబిడ్డల్లో ఏ చిన్న ఆసక్తి ఉన్నా దాన్ని పైకి తీసి అభివృద్ధిచేయాలి. వాళ్ళలోని అభిరుచిని గ్రహించాలి. ప్రోత్సహించాలి. వాళ్ళని నిరుత్సాహపరచకూడదు. కానీ తన జీవిత అనుభవాలు... ఈ చేదు అనుభవాలు మరొక విషయం చెపుతున్నాయి. ఏంచేయడం? తను నమ్మిన సిద్ధాంతాలు ఒకపక్క, తన జీవిత అనుభవాలు మరొకపక్క ఆమెని బాధించసాగాయి.

"అక్కా! అమ్మ నా బొమ్మ చూసి అదొకలాగ అయిపోయింది. ఏమీ మాట్లాడలేదు. నేను బొమ్మలు వేయడం అమ్మకి కష్టం కలిగించిందా? " పండు అమాయకంగా పద్మను అడుగుతున్నాడు.

పద్మ తమ్ముడు వేసిన బొమ్మ చూసింది. ముద్దుగా ఉన్న వాడి మొహం చూసింది. వెంటనే వాడి రెండు బుగ్గలమీదా ముద్దుపెట్టుకుంది.

"ఎంత బాగా వేశావురా? చాలా బావుంది. చూడు, అమ్మ నీకు మంచి ప్రజంటేషన్ ఇస్తుంది"

"నిజంగా" వాడు ఆశగా అన్నాడు. వాళ్ళ సంభాషణ కామాక్షి చెవిలో పడింది. తను... తను ఇలాగ ప్రవర్తించిందేమిటి? కొడుకుని ఒక్కమాట అయినా సంతోషపరిచేలాగ అనవద్దా? ఆమెకి ఎక్కడలేని నిస్సత్తువా కలిగింది. 'కళలు' ప్రకృతి వరప్రసాదాలంటారు. తను చిదిమివేయాలనుకుందా? ఆమెకి తన ఆలోచనలు సిగ్గుని కలిగించాయి.

తల్లి మనసులో చెలరేగుతున్న గాలిదుమారాన్ని పద్మ ఊహించగలిగింది. గిరిజ ప్రవేటునుండి వచ్చి తమ్ముడిని అభినందించి, బహుమతిగా తను కొనుక్కొన్న కొత్త పెన్ను ఇచ్చింది.

రాధాకృష్ణమూర్తి కేంప్‌నుండి వస్తూ




చాలారోజులైందని, దారిలోనే కదా అని పెద్దన్నగారి ఇంటికి వెళ్ళాడు. అతడిని చూడగానే ఆయనకి ఒళ్ళు మండిపోయింది. బయటివాళ్ళు ఎవరో వచ్చి ఉండటం వలన మౌనం వహించాడు.

రాధాకృష్ణమూర్తి తిన్నగా వదినగారి దగ్గ రికి వెళ్ళాడు. ఆవిడ మరిదిని పలకరించి మర్యాదలు చేసింది. పిల్లలు బాబయ్య వచ్చాడని చుట్టుముట్టారు. తను తెచ్చిన స్వీట్సు వాళ్లకిచ్చి, భోజనంచేసి ఆయన హాయిగా పడుకున్నాడు. బయటివాళ్ళు వెళ్లాక అన్నగారు లోపలికి వచ్చారు. అర్ధాం గిని తమ్ముడి విషయం అడిగాడు. ఆయన భోజనం చేసి పడుకున్నాడని వినగానే భార్యపై కేకలు వేశాడు. తండ్రి చనిపో యాక తల్లి కొడుకుల దగ్గర అటూ ఇటూ తిరుగుతోంది. ఆవిడ అనారోగ్యం వలన ఈమధ్య రెండవ కొడుకు దగ్గరుంది.

మరదలు అన్న మాటలు, తమ్ముడి బాధ్యతారాహిత్యం ఆయనకి కష్టం కలిగిస్తు న్నాయి. తండ్రి తర్వాత తండ్రంతటి వాడివై బాధ్యతలకి దూరంగా ఉన్నావని మరదలు ఎంత సూటిగా చెప్పింది. సాయంత్రం పొలంవైపు వెళ్ళకుండా తమ్ముడు నిద్రలేచేవ రకూ కూర్చున్నాడు.

కాఫీ తాగుతున్న పినతండ్రిని తండ్రి రమ్మంటున్నాడని చిన్నవాడు వచ్చి చెప్పాడు. అతడు అన్నగారి దగ్గరికి వెళ్ళాడు. అన్నగారి ముఖ కవళికలు గంభీ రంగా కన్పించాయి.

"ఎక్కడినుండి వస్తున్నావు?" ఆయన గట్టిగా అడిగాడు. రాధాకృష్ణమూర్తి ఆశ్చర్య పోయాడు. ఏనాడూ అడగని ప్రశ్న.

"నేను... నేను కేంప్‌కెళ్ళి వస్తున్నాను" నెమ్మదిగా అన్నాడు.

"కేంప్... తిరుపతేకదా వెళ్ళింది. భార్యా బిడ్డలను తీసుకొని వెళ్ళావా?"

అన్నగారి మాటలకి అతను తుళ్ళిపడ్డాడు. "అది...అది... నేను ఒక్కడినే వెళ్ళాను" ఎలాగో చెప్పాడు. కొంపదీసి తన ప్రయాణం సంగతి వాళ్ళకి తెలిసిందా?

"ఛీ... అబద్ధాలు చెప్పడానికి సిగ్గులేదూ? ఇంత వయసు వచ్చి విచ్చలవిడిగా ప్రవర్తి స్తావా? అడ్డమైనవాళ్లని తీసుకొని భగవం తుడి దగ్గరికి వెళతావా?"

"నేను ఎవరిని తీసుకెళ్లాను?" అతను బుకాయించబోయాడు.

అన్నగారు అసహ్యంగా తమ్ముడివైపు చూశారు. "నాకు అంతా తెలిసింది. వసంత అన్నగారు కనిపించి నీ నిర్వాకమంతా చెప్పి గోలపెట్టాడు. ఆయన చెల్లిని ఈ విష యంలో గట్టిగా మందలిస్తే నా యిష్టం, నా జీవితం అందిట. అయినా నీకు ఇదేం పొయ్యేకాలం? లక్షణమైన భార్యను, ముత్యాల్లాంటి పిల్లలను ఇంట్లో పెట్టుకుని ఈ వెధవ తిరుగుళ్ళా? ఎప్పటికి నీకు బుద్ధి వస్తుంది?"

ఆయన ఊపిరి తీసుకోవడానికి రెండు క్షణాలు ఆగారు. "నీ ఈ ప్రయాణమంతా నీభార్యకి తెలిసింది. ఛ... ఆమె దగ్గర నీ వలన తల ఎత్తుకోలేకపోయాను కదరా"

అతను క్షణకాలం స్థాణువయ్యాడు. వసం తతో తన ప్రయాణం కామాక్షికి తెలి సిందా? ఎలా?

"ఛీ... ఎదిగిన నీ కూతుర్రికి ఏవైనా సంబంధాలు నీ వలన వస్తాయంటావా? అసలు దానికి పెళ్ళి అయ్యే రాత ఉంటుందా? వెధవ తిరుగుళ్ళు మాని బుద్ధిగా ఉంటేనే ఇక్కడికి రా! లేదా మా గడప తొక్కవద్దు"

అన్నగారు అంత తీవ్రంగా మాట్లాడడం అతను ఏనాడూ ఎరగడు.

"మరదలి మొహం చూడలేకపోయాను కదురా! మాలో తప్ప పుట్టావు" అన్నగారు చివరగా అన్న మాటలు ఛెళ్ళున తగిలాయి.

అతను నెమ్మదిగా వదిన దగ్గరికి వచ్చాడు. అన్నగారు భార్యకి చెప్పి పొలం వైపు వెళ్ళాడు. ఆవిడ సాయంత్రం వంట

ప్రయత్నంలో వుంది.

ఆయన నెమ్మదిగా అడిగాడు, "వదినా మీరు మన ఇంటికి వెళ్ళారా?"

"బావుందయ్యా. పద్మ పెద్దపిల్లయిందంటే, కామాక్షి కబురుపెడితే వెళ్ళద్దా?"

"పద్మ పెద్దదైందా? ఎప్పుడు?" మీరు అందరూ వెళ్ళారా?" ఒక్కొక్కటీ కూడబలుక్కుంటూ అన్నాడు.

"బావుంది సంబరం. నువ్వింకా అప్పటి నుండీ ఇంటికి వెళ్ళలేదా? ఇంకా ఊళ్ళు తిరుగుతున్నావా?" ఆవిడ నిలదీసినట్లు అడిగింది.

అయోమయంగా ఏమీ మాట్లాడకుండా నిలబడిన అతగాడిని చూడగానే ఆవిడకి అంతా అర్థమైపోయింది.

ఆవిడ చనువుగా, మందలింపుగా అంది, "చూడయ్యా! నువ్వంటే ఉన్న అభిమానం కొద్దీ దెబ్బలాడుతున్నాను. ఎందుకయ్యా ఆ పిల్లని అలాగ ఏడిపిస్తావు? ఎన్నాళ్ళు ఈ తిరుగుళ్ళు? నీ భార్య గనుక భరించింది. మాలాంటివాళ్ళమైతే మేమైనా చస్తాం. నిన్నైనా చంపుతాం.

"నువ్వు లేవని ఎంత ఆరాటపడింది. ఎన్ని చోట్లకు మనుషులను తిప్పింది? ఆ విజయవాడదానితో వెళ్ళావని ఎవరో వార్త తెచ్చారు. పాపం... అంత నిగ్రహవంతురాలు ఎంత సిగ్గుపడిపోయిందో?"

ఆవిడ ఆ సంభాషణను పొడిగించింది.

"ఒక్క నువ్వు లేవన్న మాటే కానీ ఫంక్షన్ బాగా జరిగింది. అన్ని విషయాలూ బాగా చూసుకుంది. అందరూ నీ గురించి మాట్లాడుతూంటే ఎంత బాధపడిందో?"

ఆవిడ చెప్పవలసిన విషయాలన్నీ చెప్పింది. ఆవిడకి ఇన్నాళ్ళూ కామాక్షిమీద అసూయగా, అసహనంగా ఉండేది. తమ లాగ కాకుండా ఆమె ప్రత్యేకంగా ప్రవర్తిస్తున్నట్లు ఊహించుకుని ఎగతాళి చేసేది. మగవాళ్ళు పూచీ పడుతుంటేనే ఇంట్లో వంటావార్పూ చూసి, పిల్లల్ని సాకడం ఎంతో కష్టంగా తాము భావిస్తారు. అలాంటిది పొయ్యికిందికి లేకుండా, పొయ్యిమీదకి లేకుండా, ఉన్న భర్త ఉన్నాడో, లేడో తెలియని స్థితి... ఎంతకష్టం... ఛీ... స్త్రీకి స్త్రీయే శత్రువంటారు. ఆడదై ఉండి తోడికోడలిపట్ల తన ప్రవర్తన ఏం అనుకూలంగా సాగింది? అని మొదటిసారిగా ఆవిడ సిగ్గుపడింది.

అతడు కర్తవ్యం తోచనివాడిలాగా అక్కడే స్థబ్దంగా రెండురోజులుండిపోయాడు. అతడికి ఇంటికి వెళ్ళాలని ఉంది. వెళ్ళకూడదనీ ఉంది. ఆ భార్య ఎదుట, ఆ పిల్లల ఎదుట పడడానికి ధైర్యం చాలడంలేదు.

"నువ్వుగానీ నాకు విడాకులు ఇస్తావా? నీ ఆలనాపాలనా చూడడంలేదని వేరుపడతావా?" అని ఒకసారి తను సరదాగా ఉన్నప్పుడు అడిగాడు.

కామాక్షి రెండు నిముషాలు తనవైపు చూసింది.

నిజాయితీ ఉట్టిపడే స్వరంతో అంది, "విడాకులు ఇవ్వాలని అన్పించిన సందర్భాలు రెండుమూడున్నాయి. మన గిరిజని కడుపుతో ఉన్నప్పుడు, నిండు గర్భిణినని చూడకుండా, ఇంట్లో పైసా ఉంచకుండా, ఇంటి అవసరాలు చూడకుండా రెండునెలలు కనబడకుండా పోయారే... అప్పుడు బాగా అన్పించింది"

ఆవిడ శూన్యంలోకి చూస్తూ మళ్ళీ చెప్పింది, "మన పద్మని కడుపుతో ఉన్నప్పుడు టెస్టులు చేసిన డాక్టరు మొదటిసారిగా మీకు ఇతర స్త్రీల పరిచయాలవలన వచ్చిన జబ్బులున్నాయని, అందువలన గర్భస్థశిశువు జాగ్రత్తకోసం మీరు, నేను ఇంజక్షన్లు, మందులు వాడాలని చెప్పినప్పుడు అన్పించింది. ఎటువంటి బిడ్డలు పుడతారో అని పగలూ రాత్రీ అన్పించి భయపడ్డనాడు మీమీద ఎంతకోపం వచ్చిందో?"

"పండుగాడికి తీవ్రమైన అనారోగ్యం చేసి




హాస్పిటల్‌లో ముగ్గురి పిల్లలతో బాధలు పడినపుడు, ఇరుగు, పొరుగువారి సహాయంతో ఎలాగో ఇవతల పడినపుడు ఎంతగానో అన్పించింది"

అతను అతి తేలికగా అన్నాడు. "పిల్లలన్నాక అనారోగ్యాలు చేయవా? ప్రతీదానికీ ఫీలవకూడదు. నేనుండీమాత్రం ఏం చేస్తాను? "

ఆవిడ గాయపడిన చూపులతో తిరస్కారంగా చూసింది. ఆ చూపులు ఇప్పుడు గుర్తువచ్చాయి.

వదినగారు పిలిస్తే వెళ్ళడం, నాలుగు మెతుకులు తినడం, ఏదో ఆలోచించుకుంటూ పడుకోవడం ఇదే అతని దినచర్య. నాలుగురోజులు గడిచాక అన్నగారు వదినతో అనడం విన్పించింది.

"వాడు ఇక్కడ ఎందుకు? వెళ్ళి వాళ్ళ దగ్గర పడి ఉండమను. వేసిన చిత్రాలూ చాలు, తెచ్చుకున్న కీర్తీచాలు. వాళ్ళని కని పెట్టుకుని కుక్కకాపలా కాస్తే చాలు"

అతనికి ఆ మాటలు పౌరుషాన్ని కలిగించాయి. తనలోనున్న కళలో వరి గింజంత కూడా లేని వీళ్ళందరూ తనని అనేవారా? నిజం అనుకోవాలంటే తనవలన ఏంబాధలుపడ్డారు? తనకి డబ్బు సర్దుబాటు చేశారా? తన కుటుంబ బాధ్యతలు పంచుకున్నారా? ఏంచేశారని ఈ మాటలు? ఈ పరాభవం?

అతగాడికి వాళ్ళమాటలు గుర్తువచ్చాయి. "మా తమ్ముడి చేతికి ఎముకలేదు. పిల్లలు ఏది అడిగినా కాదనడు. తన బిడ్డలు, పరాయివాళ్ళ బిడ్డలు అన్న తేడాలేదు"

"నా చిన్నకొడుకు దాతరా! పదిమందికి పడెయ్యగలిగిన డబ్బు వాడిచేతిలో ఉంటుంది" తల్లి గొప్పగా అనడం తలంపుకి వచ్చింది.

"అతడి జేబు ఎప్పుడూ నిండుచూలాలిలాగా ఉంటుంది. కామాక్షి అదృష్టవంతురాలు" వదినగారు అసూయగా అనడం జ్ఞాపకానికి వచ్చింది.

"బాబయ్య వస్తే సందడే...సందడి. సినిమాలు జోరుగా చూడవచ్చు దండిగా టిఫిన్లు తినవచ్చు" పిల్లలు సంబరంగా అనే మాటలు స్ఫురణకొచ్చాయి.

ఎవరి స్వార్థం వారిది. జేబులో డబ్బు ఉండేమాట నిజమే. కానీ ఏనాడు కామాక్షిని అందులో చెయ్యి పెట్టనిచ్చాడు?

"ఆ చొక్కా ఒక చేత్తో పట్టుకుని ఎంతకని స్నానం చేస్తారు? ఒళ్ళు రుద్దుకోవద్దా? మీ డబ్బు మీరు ఇస్తేగానీ నాకు వద్దు మహానుభావా! స్నానం కానివ్వండి" రెండుచేతులూ జోడించి కామాక్షి అనేమాటలు చెవులని తాకాయి.

సంపాదించిన డబ్బు తరగకూడదు, తన షికార్లు, విలాసాలకి అవాంతరం ఏర్పడకూడదు. తన స్వేచ్ఛాజీవితం హాయిగా సాగాలి. అందుకే అంత జాగ్రత్త.

తల్లిని చూడాలన్పించింది. ఎవరు ఎన్ని రకాలుగా అన్నా తల్లి మాత్రం ఏమీ అనదు. కడుపున పుట్టిన పిల్లల చెడుని తల్లి తనలో దాచుకోగలదు.

అతడు వెంటనే రెండవ అన్నగారి ఊరు బయలుదేరాడు. దగ్గర ఎప్పుడో వేసిన బొమ్మలుంటే వాటిని దారిలో అమ్మి ఆ డబ్బు జేబులో వేసుకుని వెళ్ళాడు. తల్లికి పళ్ళు, హార్లిక్స్ సీసా కొనుక్కొని ఇల్లుచేరాడు.

★ ★ ★

"బామ్మా! కృష్ణుడు బాబయ్య వచ్చాడు" అంటూ ఆవిడ చెవిలో రెండవ అన్నకూతురు గట్టిగా చెప్పడం, ఆవిడ ఆశగా చూపులు తిప్పడం అతడికి తృప్తిని కలిగించాయి. ఎంతైనా అమ్మ అమ్మే అనుకొన్నాడు. ఈ అమ్మని చూడకుండా తను ఇన్నాళ్ళూ ఎలా ఉన్నాడు?

"కృష్ణా! ఇలారా" ఆవిడ సన్నగావున్న చేతిని పైకి ఎత్తి దగ్గరికి రమ్మని పిలిచింది. "ఎన్నాళ్ళు అయిందిరా నిన్ను చూసి" ఆవిడ



ఆర్తిగా అతడి చేతిని పట్టుకుంది.

"బాగా బొమ్మలు వేస్తున్నావా? మంచి పేరు తెచ్చుకుంటున్నావా?" నెమ్మదిగా కుశల ప్రశ్నలు వేసింది. అంత అనారోగ్యంలో కూడా తనపట్ల ఆత్రుతకి, ఆ ప్రేమకి అతడు తలవంచాడు.

"అవునురా! మీ నాన్నగారి చిత్రం వేస్తానన్నావు. వేయనేలేదు. నువ్వు వేస్తే చూడాలని ఉందిరా"

తండ్రి, ఆయన బతికి ఉన్నరోజులూ గుర్తువచ్చాయి. ధనికుల చిత్రాలు వేశాడు. మంత్రుల చిత్రాలు వేశాడు. కానీ తండ్రి బొమ్మ వేయలేదు.

రెండవ అన్నగారు హేళనగా అన్నారు, "బావుంది, నాన్నగారి చిత్రం వేయడానికి ఆయనగారికి తీరిక ఎక్కడ? మన చిత్రాలకి మనం డబ్బు ఇవ్వం కదా! బయటివాళ్ళైతే ఆయన జేబులు నింపుతారు"

తన స్వజనం తనని నిష్ఠూరాలు అనడం ఏనాడూ ఎదురవని అనుభవాలు అతనికి. ఒక్కొక్క అనుభవంతో చివికిపోతున్నాడిప్పుడు.

సున్నితమైన మనసు కలిగి ఉండటం తప్పా? కళని ఆరాధించడం తప్పా? ఇరుకు అయిన బంధాల్లో ఇమడకూడదన్నది నేరమా? ఇన్నాళ్ళూ స్వేచ్ఛగా బతికిన తనబతుకు వీళ్ళకి తెలియదా? అతని మనసు పరిపరి విధాలుగా ఆలోచనలు చేస్తోంది.

ముడతలు పడిన మొహం, వడిలిన సన్నటి దేహం, కళ్ళల్లో పుత్రవాత్సల్యంతో తనని చూస్తున్న తల్లి మూర్తి అతడిలో ముద్రించుకుని పోయింది. మర్నాడు కార్డుబోర్డు మీద తల్లి పెయింటింగ్ మొదలుపెట్టారు.

దీక్షగా అతడు చేస్తున్న పని చూసేవారిని ఆశ్చర్యపరిచింది. కళాకారునిలోని ఏకాగ్రత, పట్టుదల, శ్రమ వారికి అవగతమైంది.

మూడురోజుల తరువాత అతను తల్లికి ఆ పెయింటింగ్ చూపించాడు. ఆవిడ ఆనందంతో, ఆశ్చర్యంతో కూర్చుండిపోయింది. "కృష్ణా! నన్ను ఆ భగవంతుడు రేపో, మాపో తీసుకొని పోవచ్చును. కానీ నువ్వు నన్ను నా కళ్ళముందు నిలిపావు. నీ తల్లిని సజీవంగా సృష్టించుకున్నావు. నువ్వు అంతులేని కీర్తిప్రతిష్టలు ఆర్జించాలి" ఆవిడ ఆనందంగా ఆశీర్వదించింది.

ఎన్నో చిత్రాలు వేసినా కలగని అనుభూతి కళాకారునిగా ఎనలేని తృప్తి అతనికి ఆ చిత్రంలో కన్పించింది. "మాతృదేవత" అన్న ఆ చిత్రం తల్లికి కానుకగా ఇచ్చాడు. ఇంట్లోనివారందరూ ఆ కళామూర్తిని అభినందించకుండా ఉండలేకపోయారు.

కొడుకు ఎక్కడ ప్రయాణం అవుతాడో అని ఆవిడ ముందుగానే నాతో నాలుగు రోజులు గడపరా అని అడిగింది.

"కృష్ణా! అందరితోపాటు నీ భార్య దగ్గర కూడా నాకు గడపాలని ఉందిరా! నన్ను తీసుకెళతావా?" ఆవిడ ఆశగా అడిగింది. అప్పుడు సమాధానం చెప్పడం అతనికి కష్టమే అయింది.

"అమ్మా! నేను ఢిల్లీ వెడుతున్నాను. అక్కడివాళ్ళు నా చిత్రాల ఎగ్జిబిషన్ పెడతానన్నారు. వచ్చాక, వీలుచూసుకొని తీసుకెళతాను" అన్నాడు.

అన్న కూతుళ్ళని చూస్తుంటే అతనికి పద్మ, గిరిజ గుర్తువచ్చారు. వీళ్ళ మెడల్లో గొలుసులు, చేతులకి బంగారు గాజులు, మంచి బట్టలు, చెవులకి అందమైన పొళ్ళ హేంగింగ్స్.

బరువుగా నిట్టూర్చాడు. ఆడపిల్లలకి అవసరమైన బంగారం ఎంత అందాన్ని ఇస్తుంది. ఎంత గౌరవం కలిగిస్తుంది? ఇంటికి వెళ్ళేటప్పుడు పిల్లలిద్దరికీ గొలుసులు చేయించి పట్టుకెళ్ళాలనుకున్నాడు.

కొడుకు బయలుదేరుతుంటే ఆవిడ నెమ్మదిగా చెప్పింది, "కృష్ణా! ఇంట గెలిచి రచ్చ గెలవమన్నారురా! నిన్ను మొదట్లోనే కట్టడి




# పేలినముత్యాలు

★ సందేహం కొండంత ఆకారాన్ని దాలుస్తుంది. కానీ విశ్వాసం ఆ కొండను కదుపుతుంది.

—నార్మన్

★ ఒకే భావాన్ని తీసుకో. నీ జీవితాన్ని ఆ ఒక్కభావంగా తీర్చిదిద్దు. దాన్నే భావించు, దాన్నే కల గను. ఆ భావంలోనే జీవింపుము. ఇదే కార్యసిద్ధికి మార్గం.

—స్వామివివేకానంద

★ ఒక మంచిపని చేయడం సులువు. చెడ్డపని చేయవలసినపుడు అది ఎందుకు చేయాలో వంద కారణాలు వెతుకవలసి వస్తుంది.

—లాంగ్‌ఫెలో

★ వినయం, విజ్ఞానం ఈ రెండూ లేని మనిషి తననుతాను కోల్పోయినట్లే. ఆ రెండూ ఉన్నవాడు తననుతాను చక్కబరుచుకున్నవాడవుతాడు.

—సంస్కృతసూక్తి

★ శ్రమయొక్క వేళ్ళు చేదుగా ఉంటాయి. కానీ దాని ఫలం, శక్తి ఎంతో తీయగా ఉంటాయి.

—బెంగాలీసూక్తి

★ ఓర్పు తియ్యని పండ్లను గలిగిన చేదు మొక్కలాంటిది.

—జర్మన్ సామెత

★ నీవు జీవించినంతకాలం జీవించడం ఎలాగో నేర్చుకుంటూ ఉండు.

—సెనెకా

★ ఏదీ నేర్చుకోకుండా ఎవరూ హృదయపూర్వకంగా ప్రార్థన చేయలేరు.

—ఎమర్సన్

★ బలాత్కారంతో కూడిన మౌనం, కారణంలేని వాగుడు ఈ రెండూ హానికరాలే.

—బ్రహ్మానందస్వామి

★ సద్గుణాలనే అమృతాన్ని ఆస్వాదించడంలో సత్పురుషులే ప్రవీణులు.

—సుభాషితం

★ నీకు కోరికలు ఎంత తక్కువగా ఉంటే అంత మనశ్శాంతి ఉంటుంది. గాఢనిద్ర కావాలంటే ఆహారం స్వల్పంగా తీసుకోవాలికదా!

★ దేవుడు నన్ను మన్నిస్తాడని, తోటివారు నా పాపాన్ని తెలుసుకోరని నాకు నిజంగా తెలిసినా నేను 'పాపం' చెయ్యడానికి సిగ్గుపడతాను. ఎందుకంటే దాంట్లో అంత హేసం ఉంది.

—ప్లేటో

సేకరణ: వాకాడ దుర్గాప్రసాద్

చేసి ఉంటే బావుండేది. ఇంటి ఇల్లాలి ఉసురు ఇంటికి శుభం కలిగించదు" అతను మౌనంగా ఆ మాటలు విన్నాడు.

ఢిల్లీకి ట్రైన్‌లో వెళుతూంటే అతని ఆలోచనలు పరిపరివిధాలుగా సాగాయి. తన పెళ్ళినాటి కామాక్షి గుర్తు వచ్చింది. మావ గారింట్లో బావగారికి ఉపనయనమంటే తనని తప్పక రమ్మనమని ఆహ్వానం. తల్లి దండ్రులతోపాటు తనూ వెళ్ళాడు.

ఉపనయనమయ్యాక అందరూ వెళ్ళిపోతుంటే తానూ బయలుదేరాడు. మావగారు నెమ్మదిగా చెప్పారు, "కామాక్షి నీతో ఒక సారి మాట్లాడుతుందిట" అని. తనకి ఆశ్చర్యం కలిగింది. పెద్ద ఇంటి కుటుంబాలలో ఆడపిల్లలు స్వతంత్రంగా తమ భావాలు వెల్లడి చేయరు. తల్లిదండ్రుల నిర్ణయాలే వారికి శిరోధార్యం. అలాంటిది తనని చూడాలని, తనతో మాట్లాడాలని ఆ అమ్మాయి అనడం... మింగుడుపడని విషయమే అయింది.

"నేను ఇలాగ మిమ్మల్ని చూడాలనుకోవడం, మాట్లాడుకోవాలనుకోవడం మీకు అయిష్టతని కలిగించదూ? " సూటిగా తన మనసులోని విషయాన్ని గ్రహించినదాని లాగ ఆ అమ్మాయి నిర్భయంగా అడుగుతూంటే తను ఖంగుతిన్నాడు. అప్పుడే ఆ అమ్మాయిని సూటిగా చూశాడు. ఛామన ఛాయ రంగు, మంచి కళగల మొహం, ఆకర్షణీయమైన కనుదోయి, పొట్టీ, పొడుగూ కానీ సమున్నతమైన ఎత్తు, తగిన శరీరసౌష్టవం. అతనిలోని చిత్రకారుడు శరీరపు ఒంపులను నిస్సంకోచంగా పరీక్షిస్తున్నాడు.

"కొంపదీసి నా చిత్రం వేసేంత ఆకర్షణ కలిగిందా? అంత పరీక్షగా చూస్తున్నారు? "

ఆ అమ్మాయి మాటలకి ఆయన ఉలిక్కిపడ్డాడు. ఈ అమ్మాయికి ఎదుటి వారి భావాలను అద్దంలోలాగ చదివే విద్య తెలుసును. ఎదుటివారు నోరు విప్పి చెప్పనవసరం లేకుండా వాళ్లను ఆమూలాగ్రం కాచి వడపోస్తుంది. కామాక్షిని చూడగానే అతనిలో కలిగిన భావపరంపరలు అవి.

"ఏదో ఒకటి పెద్దదో, చిన్నదో ఉద్యోగం చేసే వ్యక్తితో అయితే జీవితం సాఫీగా సాగుతుందని నా ఉద్దేశ్యం. మరి మీరు ఏమను కొంటున్నారో నాకు తెలియదు" ఆ అమ్మాయి నిస్సంకోచంగా తన అభిప్రాయాన్ని సూటిగా చెప్పేసింది.

అతని నుండి సమాధానం రావడం కష్టమే అయింది. "ఉద్యోగం చేయాలంటే నాకు ఈ క్షణంలో ఆఫర్లు ఎన్నో వస్తాయి. నా ఆర్టుకి సంబంధించినదే చేస్తాను. ఆ విషయంలో ఇంక మీరు నిశ్చింతగా ఉండ వచ్చును" అన్నాడు.

తర్వాత అతనే మాట్లాడాడు. "కళాకారునికి అర్థంచేసుకొనే తల్లిదండ్రులు, అర్ధాంగి ఉండటం అవసరం. వారికి జీవితంలో లిఫ్ట్ ఇచ్చేవారు తారసపడాలి. గొప్ప కీర్తి ప్రతిష్టలు సంపాదించాలని నా తపన"

ఆ అమ్మాయి సన్నగా నవ్వింది. "నా జీవితానికి సంబంధించిన భరోసా మీరు కలిగించండి. మీ అభిరుచులను నేను అర్థం చేసుకొని ప్రోత్సహిస్తాను"

కళలపట్ల ఆ అమ్మాయి అభిప్రాయాలను తెలిసుకోదలచాడు.

"నాకు కళాకారులంటే అగౌరవం లేదు కాని కళలకన్న జీవితం గొప్పది. జీవితం లోనుండే కళలు ఉద్భవించాయి. నేను జీవితాన్ని ప్రేమిస్తాను. సాఫీగా సాగాలని ఆశ పడతాను"

కామాక్షి అభిప్రాయాలకు అతనికి సంతోషం కలిగింది. ఈ అమ్మాయి అంటే తండ్రికి అందుకే కాబోలు అంత ఇష్టం. ధనవంతులైన వారి అండ తనకి దొరికితే తను అదృష్టవంతుడే.

కామాక్షి ఆ తర్వాత తండ్రితో చెప్పింది. "ఆయనకి జీవితం అంటే స్థిరమైన అభిప్రాయం ఉన్నట్లు కన్పించలేదు. కళకే ఆయన పెద్దపీట వేసుకొన్నారు. ప్రస్తుతా




నికి మన అభిప్రాయాలకి విలువ ఇచ్చినట్లు మాట్లాడుతున్నారు. అంత హైరానా పడి ఈ సంబంధం ఎందుకు చేసుకోవాలి? "

ఆమె తండ్రి నివ్వెరపోయాడు. అంత అందమైన అబ్బాయిని చూసి తన బిడ్డ ముచ్చటపడుతుందనుకొన్నాడు. "కన్యా వరయతే రూపం" అన్నది తన బిడ్డ విషయంలో తప్పనిపిస్తోంది. ఆ పిల్లని అంగీకరింపచేయడానికి ఆయన అన్నారు.

"ఆ అబ్బాయి చాలా బావుంటాడమ్మా!"

"అందాన్ని కొరుక్కుని తినం కదా నాన్నగారూ!"

"అదికాదమ్మా! మన ఎదురుగా నాలుగు వస్తువులుంటే మనం మొదట అందమైనది, మనల్ని ఆకర్షించినది తీసుకొంటాం అవునా? కాదా? "

"నాలాంటివారు నాణ్యతకే ప్రాధాన్యత నిస్తారు నాన్నగారూ!" ఆయనకి ఆ పిల్ల సమాధానాలకి కోపం వచ్చింది. "ఏది నాణ్యత? వంశం, పరువు, ప్రతిష్ట, రూపం ఇవన్నీ నీకు దిగతుడుపు విషయాలా? ఒక సంబంధం చేసుకోవాలంటే ఇటు ఏడు తరాలు, అటు ఏడు తరాలు చూడాలి. నీకు సరైన వరుని తేవాలని నేను అనుకోనా? ఒక మంచి చిత్రకారుడు నాకు అల్లుడవుతున్నాడంటే ఎంత గొప్ప? "

ఇంక ఆయనకి ఏం చెప్పినా వృథా అనుకుంది ఆ అమ్మాయి. ఉమ్మడికుటుంబాలంటే తండ్రికి ప్రాణం. ఆయనకి నచ్చేవి ఈ సంబంధం విషయంలో అనేకం. సామాన్యమైన అందం కల తన బిడ్డకి రూపవంతుడైన భర్తని తాను బహుమతిగా ఇస్తున్నాడు. తన కూతురు భాగ్యశాలి అయితే సిరిసంపదలు ఆమె నట్టింట్లో విడిది చేస్తాయి. అయినా వివాహాలంటే లాటరీ వంటివి. ఏవో కొన్ని చూస్తాం, అంతే. బుద్ధిమంతులు అనుకొని చేపట్టాక వాళ్ళు బుద్ధిహీనులవ్వచ్చును. దరిద్రుడు ధనవంతుడవ్వచ్చును తర్వాత కాలంలో. ధనవంతుడు బికారి కావచ్చును. ఆ విషయాలే ఆమెకి ఆయన బోధపరిచారు.

కామాక్షి పలుచగా నవ్వింది. "మీరు అన్నదాంట్లో ఒక్కటి నిజం నాన్నగారూ! విధి మన జీవితాల్ని ఎప్పుడో నిర్ణయిస్తుంది. అవి ఆప్రకారం సాగుతాయి. మీ ఇష్టం"

రాధాకృష్ణమూర్తి ఆ పూట అక్కడ ఉండిపోయినా ఆ అమ్మాయి తిరిగి కన్పించలేదు. ఆ అమ్మాయి ఆభిజాత్యానికి, హుందాతనానికి అతను ఆకర్షితుడయ్యాడు. మిగిలిన వారి పరిచర్యలందుకుని ఇంటిదారి పట్టాడు.

ఆమెతో జీవితం గడిపిన తరువాత మరీ తెలిసింది. అనవసరంగా ఎవరినీ నొప్పించదు. ఎవరి విషయాలూ కల్పించుకోదు. తను అనుకున్న విషయం నిర్మొహమాటంగా చెపుతుంది.

ఒకసారి పెళ్ళయిన కొత్తలో ఆమె ముంగురులు సవరిస్తూ అన్నాడు. "నీకు చిత్రలేఖనం నేర్పనా? నీ చేతి వ్రేళ్ళు చాలా సున్నితంగా, పొడవుగా ఉన్నాయి. నీకు బాగా వస్తుంది"

ఆమె ఫక్కున నవ్వింది. "వద్దు. ఆ రంగంపై నాకు కుతూహలం లేదు. అదీగాక దానివలన మీకు చాలా నష్టం"

"నష్టం ఏమిటి? "

"నష్టంకాదా? మీకు ఇంట్లోనే పోటీ ఏర్పడుతుంది. నేను ఏ పనిచేసినా ప్రాణంపెట్టి చేస్తాను. కనుక గట్టి పోటీ తప్పదు"

"మరీ మంచిది. గురువుని మించిన శిష్యురాలివని ఆనందిస్తాను. హాయిగా విశ్రాంతి తీసుకొంటాను"

ఆమె ఆయన మొహంలోకి పరీక్షగా చూసింది. ఆయన మనసులోని విషయాలే చెపుతున్నాడు.

"చూడండి. ఏ భార్య అయినా తన భర్త తెచ్చే సంపాదనతో జీవితం గడపాలను కొంటుంది. తను సంపాదించుకోగలిగినా

ఒక ఇంటి గృహిణిగా, ఒకరి బాధ్యతలో ఒదిగి బతకాలనుకొంటుంది"

అతను నవ్వుతూ అన్నాడు, "అబ్జక్షన్ మేడమ్! అలా అనుకొంటే ఈ దేశానికి ఒక రుద్రమదేవి, ఒక ఝాన్సీరాణి, ఒక ఇందిరా గాంధీ లభ్యమయ్యేవారు కారు. స్వంత సంపాదన లోని తృప్తి, ఆత్మవిశ్వాసం నీకు ఎలా తెలుస్తాయి? "

"అబ్జక్షన్ ఓవర్‌రూల్డ్" ఆమె నవ్వుతూంటే సన్నజాజులు ఒక్కసారిగా విరిసినంత అందం. ఆ కపోలాలు ఎర్రబడతాయి. కనుల చివరలు గీతలవుతాయి. ఆ మొహం ఎంత ముద్దుగా ఉంటుందని?

అతను ఉలిక్కిపడ్డాడు. ఎందుకో భార్య ముగ్ధమోహన రూపం గుర్తువచ్చింది. రోమాలు నిక్కబొడుచుకున్నాయి. గుండె చప్పుడు పెరిగింది. అతనిలోని కళాకారునికి ఆమెలోని అందమైన కోణాలు గుర్తుకురాసాగాయి. ఒక్కసారి ఇంటికి వెళ్ళి వద్దామా అనుకొన్నాడు. ఆ నల్లని విశాల నయనాలలో తనపట్ల అసహ్యాన్ని చూడటానికి ధైర్యం చాలడంలేదు. సూటిగా చూసే ఆ చూపులలోని తీక్షణతను తట్టుకొనే శక్తి ప్రస్తుతం తనకు లేదు. కొన్ని పనులు అనాలోచితంగా జరిగిపోతాయి. కానీ వాటి ప్రభావం అధికంగానే ఉంటుంది. నాలుగు గోడలమధ్య ఎవరెవరితోనో గడపడం వేరు. నలుగురికీ తెలిసే చోట్లకి విహారాలు వెళ్ళడంవేరని ఇప్పుడు అన్పిస్తోంది. మగవాడినన్నైనా చూడకుండా అన్నదమ్ములే హేళనచేశారు. వాళ్ళ మాటలు గుర్తువచ్చి మరింత బాధ కలిగింది.

★ ★ ★

ఢిల్లీలో స్టేషన్‌కి తెలిసిన ఫ్రెండ్ వచ్చాడు. ఆయనతో కలిసి వెళ్ళి హోటల్‌లో దిగాడు. ఆయన తన ఇంటికి రమ్మని బలవంతం చేసినా వెళ్ళలేదు. "నాకు స్వేచ్ఛగా ఉండటం ఇష్టం. నావలన ఇతరులు, ఇతరుల వలన నేను ఎందుకు ఇబ్బంది పడాలి? "

ఫ్రెండ్ నవ్వాడు. "మీరు బలే విచిత్రంగా మాట్లాడుతారు. మీ రాక వలన ఆనందమే తప్ప ఇబ్బంది ఏముంటుంది? "

రాధాకృష్ణమూర్తి నవ్వాడు. "ఎందుకు ఇబ్బంది ఉండదు? నాకు రాత్రిళ్ళు చిత్రం వేయాలన్పించవచ్చును. మీకు నిద్రాభంగం కాదా? రాత్రి మేలుకున్న నేను ఉదయం లేవలేకపోవచ్చును. అదీ ఇబ్బందే. అందుకే కళాకారులకి స్వేచ్ఛ ఉండాలి"

అతడు ఆ మాటలతో ఏకీభవించాడు. సాయంత్రం సంఘం తరపున నలుగురైదుగురు ఆయనను పరిచయం చేసుకొందుకు వచ్చారు. వారు రకరకాల విషయాలపై మాట్లాడుకున్నారు.

"చిత్రకళారంగంలో మంచి చిత్రకారులుగా మీరు ఖ్యాతి గడించారు. పత్రికలకు మీరు చిత్రాలను పంపడానికి ఇష్టపడరు ఎందుకని? వార పత్రికలు, మాసపత్రికలు ప్రజలకి చేరువగా ఉన్నాయి. ఆబాలగోపాలం వాటియందు ఆకర్షితులవుతున్నారు"

రాధాకృష్ణమూర్తి చిన్నగా నవ్వి అన్నాడు, "నేను చెప్పే విషయాలు మీకు కష్టం కలిగించవచ్చును. అవి నా భావనలు కనుక చెప్పక తప్పదు. పత్రికలు కళాకారులకి వాళ్ళకి తోచింది పంపి చెయ్యి దులుపుకుంటారు. ఎంత ప్రాణశక్తి పెడితే ఒక చిత్రం వేయగలం? ఎంత నైపుణ్యం ఉండాలి? ఇవన్నీ దృష్టిలో పెట్టుకోరు. పెట్టుకున్నా అధికంగా ఇవ్వడానికి వాళ్ళకి ఉన్న ఇబ్బందులు వాళ్ళవి.

"నేను నా చిత్రాలను నాకు ఇష్టం వచ్చినంత రేటుకి అమ్ముతాను. ఇక్కడ మరొకరి ప్రమేయం, అధికారం లేదు. నాదే స్వీయ నిర్ణయం. దానివలన నేను నష్టపోయే ప్రసక్తిలేదు"

"అందరూ మీరు అడిగినంత డబ్బు ఇచ్చి చిత్రాలు కొనుక్కొంటారా? "

"కొనుక్కోరు. అయినా నేను అందరికీ ఒకే





రకం బొమ్మలు వేసి ఇవ్వడం లేదుకదా"

"అంటే" అన్నారు వాళ్ళు "వివరంగా చెప్పండి"

"అంటే ఏముంది? ఎక్కువకాలం ఉండా లనుకొన్నవాళ్ళకి ఆయిల్ పెయింటింగ్స్ వేసి ఇస్తాను. "హార్డు బోర్డు పెయింటింగ్స్ మరి కొందరికి వేసి ఇస్తాను. వీటికి డబ్బు బాగానే వస్తుంది. సామాన్య కుటుంబీకులకి ఇండియన్ ఇంక్‌తోనో కలర్స్‌తోనో దేము ళ్లను వేసి ఇస్తాను. పూజా మందిరాలలో పెట్టుకుంటారు. మోడర్న్ ఆర్ట్ అయితే ఖరీదు వేలలో ఉంటుంది. కానీ వాటిని నేను ఎప్పుడోగానీ వేయను. ఏదో తప్పని సరై ఎవరితోనైనా ఆ విషయంలో పోటీప డినపుడు వేస్తాను"

"ఈరోజుల్లో చాలామంది చిత్రాలను వేస్తూ కీర్తిపొందుతున్నారు. మీ రంగంలో కూడా పోటీ ఏర్పడినందుకు ఏమంటారు?" ఒక యువకుడు ఆసక్తిగా అడిగాడు.

"ఎలాంటిదైనా ఓ కథ రాసినా, గేయం రాసినా, వ్యాసం రాసినా అందరూ తాము కవులం, రచయితలం అంటున్నారు. పద్య రచనలు సాగించిన వారున్నారు. నవలలు రాసినవారున్నారు. అందరూ మహాకవులు, రచయితలు అవుతున్నారని మనం అంగీక రిస్తామా? అలాగ అంగీకరిస్తే జీవిత మంతా ధారపోసి, తపస్సుగా రచనను లిఖించిన ఆ ఆదికవి, కవిబ్రహ్మ, శ్రీనాథమ హాకవులను ఏమనాలి? ఉల్లిపూవుకి, మల్లి పూవుకి తేడా ఉందని నా అభిప్రాయం. క్రియేటివిటీ, నేచురాలిటీ ఉన్న చిత్రాలు ఈ కాలంలో నిలబడతాయి"

వాళ్ళు ఎంతో ఆనందించారు. చిత్రాలను వేయడంలోనే కాదు వాటి కింద రాసే రచ నల్లోనూ ఆయనది ప్రత్యేక బాణి. ఆయన చిత్రాలతో ఎగ్జిబిషన్ ఏర్పాటుచేశారు. ఎంతోమంది వచ్చి వాటిని చూసి ఆనందిం చారు. ఆ సంస్థవారు పదివేల రూపా యలు, అందమైన మొమెంటో, పట్టువ స్త్రాలు ఇచ్చి సత్కరించారు అతనికి ఎంతో తృప్తిగా అన్పించింది. అక్కడ కలిసిన మిత్రులు బరంపురం, కాకినాడ రావల్సిం దిగా ఆయనని ఆహ్వానించారు. ఆయన సంతోషంగా అంగీకరించారు. ఆయన ఉద్దే శ్యంలో ఏ కళ అయినా వ్యాప్తి పొందాలి. పదిమందిని ఆనందపరచాలి. పదిమంది ఆమోదం పొందాలి. మొదటిసారిగా అతను పద్మ పేరుమీద ఐదువేల రూపాయలు పంపించాడు. "ఈ డబ్బుతో నువ్వు ఏ గొలుసో చేయించుకో! తండ్రిగా నేను ఇస్తున్న బహుమతి ఇది. త్వరలో వచ్చి కలుస్తా" అని రాశాడు.

ఆ పని చేశాక గుండె తేలికపడింది. అతను మొదటిసారిగా అనుకున్నాడు మన సంపాదన "నా" అన్న వాళ్ళకి పెట్టడంలో ఇంత తృప్తి ఉందా అని. ఇద్దరు పిల్లలకీ కలిపి పదివేలు పంపాలని అన్పించకపో లేదు కానీ ఢిల్లీలో కొన్నాళ్ళుండి, చిత్రాలను వేద్దామనుకున్నాడు. ఇటువంటి చోట సంపాదన బావుంటుందనుకున్నాడు. తనకి ఏం తోస్తే అది చేయడం చిన్నప్పటినుండీ అలవాటు. అలాగే అక్కడ ఉండిపో యాడు.



ఆనంద్ ఈమధ్య ఊరికి రాకపోవ

డంతో అతడి నాయనమ్మ వచ్చేసింది. బిడ్డ ఎలా ఉన్నాడో అని ప్రాణం కొట్టుకుని పోయింది.

"వాడికేం ఇక్కడ మీ అండతో చిలకలాగ ఉన్నాడు. పెద్దముండ ఎదురు చూస్తోంద నైనా అనుకోలేదు" అని మనవడిని గురించి కామాక్షి దగ్గర బాధపడ్డారు. ఆవిడ బాగా పొట్టి. పచ్చటి శరీరం. మనిషి అన్న వాళ్ళ కోసం వాచిపోయినట్లు ఎంతో ఆత్మీయంగా కామాక్షితో కబుర్లలో పడ్డారు.

నాలుగురోజుల్లు గడిచేసరికి కామాక్షికి, ఆవిడకి మంచి స్నేహం ఏర్పడింది. మనిషి చూస్తే పలచగా పిట్టలాగ ఉంటుంది. పని చూస్తే నలుగురి పని చేస్తుంది. కామాక్షి, ఆవిడ ఇద్దరూ కష్టసుఖాలు చెప్పుకున్నారు. కామాక్షికి ఆవిడ పరిస్థితిపై జాలివేసింది. ఒక్కగానొక్క మనవడు. చదువు పేరుతో ఇక్కడ ఉన్నాడు. ఆవిడ ఒంటరిగా అక్కడ ఉంటోంది. అందుకే కామాక్షి ఆవిడని ఈ ఊరు వచ్చెయ్యమంది. ఈమధ్య కామాక్షికి మరొకమనిషి తనకి ఆసరాగా ఉంటే బావుండునన్పిస్తోంది. ఈ పచ్చళ్ళు, అప్ప డాలు, వడియాలు, ఊరగాయలు బాగా పోతున్నాయి. వాటికి మంచి పేరు వచ్చింది. నాలుగు డబ్బులూ వచ్చి చేరుతు న్నాయి.

ఇటుపక్క కామాక్షి దగ్గర పనిచేసే పని మనిషీ, దాని తోటివాళ్ళూ... వాళ్ళకి కూడా ఒక చీటీ నడపమని గొడవ.

"కావాలంటే మొదటి చీటీ మీరు వడ్డీలే కుండా తీసికోండి. మాకు మాత్రం మీరే నడపాలమ్మా" అని గొడవ.

లేబర్‌తో ఏం పడతానని కామాక్షి బాధ. కానీ లేబర్ మాత్రం మనుష్యులుకారా! మాకు మాత్రం నిజాయితీలేదా అని గొడవ. అందరి దగ్గర మాట తీసికొని అది అందరినీ వెంటపెట్టుకుని వచ్చింది. మగ వాళ్ళు తాగి డబ్బు తగలేస్తారు. ఇల్లుని, పిల్లల్ని సాకడం వాళ్ళకీ కష్టమవుతోంది. నాలుగేసి ఇళ్ళు చేస్తున్నా మేం తెమలలేక పోతున్నాం తల్లీ అని ఒక ముసలావిడ అంటే కామాక్షి బాధపడింది. అందరికీ తలొక రకమైన బాధ బాధలు మాత్రం తప్పవు. తనకి తోచింది వాళ్ళకి చేయాలని కామాక్షికి అన్పించింది. "మా ఆయువు పోసుకుని పది కాలాలు సల్లగా ఉండు తల్లీ!" అని ఆ ముసలిది దీవించింది.

ఆనంద్ మామ్మగారిని కామాక్షి తమద గ్గరే ఈ ఊళ్ళోనే ఉండమంది. తన వ్యాపా రంలో తనకి సహాయంగా ఉండమంది. ఆవిడ ఆ ఊళ్ళో సంపాదించుకుంటున్న దానికన్నా రెండు వందలు ఎక్కువే ఇస్తా నంది. కామాక్షి అలాగ అనడానికి కారణం తను కూడా బజారులో రెండుమూడు షాపులలో పచ్చళ్ళు పార్సిల్ చేసి ఇద్దామను కుంది. ఆమెకి ఎప్పటినుండో పరిచయమైన షాహుకార్లు వాళ్ళు.

సుబ్బమ్మగారు కూడా "అమ్మాయీ ఒక్క దాన్నే ఉన్నాను. ఇల్లు అంతా ఏం చేసుకొం టాను. పెరట్లో నీకు నచ్చినట్లు కూరలు, పువ్వులు పెంచుకో" అన్నారు. ఆనంద్ తన మామ్మ నాగమ్మని ఇక్కడ ఉంచినందుకు ఆవిడ ఎంతో సంతోషించింది.

"పిల్లా! కష్టం పదిమంది పంచుకోవాలి. ఫలితం కూడా పదిమంది పంచుకోవాలి. ఇంక నీ బతుకు గురించి నాకు బెంగలేదు. నువ్వే నలుగురికి పని ఇచ్చే స్థితికి వెళ తావు" అన్నారు.

పద్మ మాత్రం తల్లి పడే కష్టం చూడలేక పోతోంది. తల్లి చెయ్యి పట్టుకుని "అమ్మా! నువ్వు బాగా అలిసిపోతావేమో! ఇన్ని పనులు కష్టం కదా" అంది.

కామాక్షి పద్మ బుగ్గలు పుణికింది. "ఇన్నాళ్ళు దారి ఏదో తెలియకుండా బతి కాను. నేను ఇబ్బందులు పడ్డాను. మిమ్మల్ని పెట్టాను. ఇంక దరిద్రం అన్న దానిని మన దరిదాపులలోకి రానివ్వను" అంది.




తల్లి కళ్ళల్లోని పట్టుదల, మాటలలోని ఆత్మవిశ్వాసం పద్మకి బాగానే అర్థమయ్యాయి. "అమ్మా! నువ్వు డబ్బు దాచి అక్కయ్య పెళ్ళి చేసెయ్యి. నేను ఇంటర్ పాసై, టి.టి.సి.కి వెళ్ళి టీచర్ ఉద్యోగం సంపాదిస్తాను. ఉద్యోగం చేస్తూ పై చదువు చదువుకుంటాను. నాకు ఉద్యోగం వచ్చాక నువ్వు ఏ పనీ చెయ్యకూడదు" గిరిజ తల్లి భుజంపై వాలి గారంగా అంది.

"నేనూ చదువుకుని ఉద్యోగం చేస్తాను. నాకు పెళ్ళి వద్దు. కావాలంటే నువ్వే చేసుకో" పద్మ పట్టుదలగా అంది.

గిరిజ చెయ్యి ఊపుతూ అంది. "తగ్గు తల్లీ! నీ స్వభావం వేరు. నువ్వు మంచి ఇల్లాలుగా రాణిస్తావు" అంది.

"అమ్మా! నేను డాక్టరునవుతాను. మంచి పేరు తెచ్చుకుంటాను. నన్ను డాక్టరు చదివించమ్మా" పండు గారంగా అడిగాడు.

గిరిజ తనవైపు చూపుడువేలు పెట్టి చూపిస్తూ అంది. "మిష్టర్ పండుగారూ! మీ చదువు బాధ్యత నాది. మీరు డాక్టరు కావాలన్నా, యాక్టరు కావాలన్నా నన్ను మంచి చేసుకోవాలి. అండర్‌స్టాండ్"

పండు గిరిజని వెక్కిరిస్తూ అన్నాడు, "అంత బిల్డప్ వద్దులే! అమ్మ అంటూం టుందే మోకాళ్ళు ఉండగా కాళ్ళు పుచ్చుకుని ఎవరూ నడవరు. అలాగ అమ్మ ఉండగానే గొడవ ఎందుకే? "

గిరిజ చప్పట్లు కొట్టింది. "హియర్, హియర్. బాబుగారికి మాట్లాడటం కూడా రాదు. కాళ్ళు ఉండగా మోకాళ్ళు పుచ్చుకుని నడవరు నాయనా! కాస్త నా దగ్గర శిష్యరికం చెయ్యరా! నాలుగు మాటలైనా నేర్పుతాను"

వాళ్ళ మాటలకి కామాక్షి నవ్వింది. ఇంట్లో సరదా వాతావరణం. ఆమెకి పిల్లల్ని అలాగ చూస్తే చాలా తృప్తిగా అన్పించింది. ఆర్థిక ఇబ్బందులు మనుష్యులను ఎంతగా కృంగదీస్తాయి? ఇన్నాళ్ళూ "నవ్వు" అన్నది మరిచిపోయినట్లు బతికారు. అడుగడుగునా బెంగే. భవిష్యత్తు అగమ్యగోచరంగా కన్పించేది. ఎన్ని అప్పులు? ఎందరిని బతిమలాడటం. రోజంతా ఎంత భయం. ఎవరన్నారు డబ్బుకి ప్రాధాన్యతలేదని. డబ్బు అవసరం ఎంతో జీవితం అడుగడుగునా తనకి నేర్పింది. కేజీ పంచదారకి కటకట. పది కేజీలు బియ్యం దొరకక ఎక్కేగుమ్మం దిగేగుమ్మం.

ఏ ఐశ్వర్యాలూ మనిషి సంపాదించుకోకపోయినా తినడానికి కడుపునిండా తిండి, బట్ట, గూడు మాత్రం సంపాదించుకోవాలి. పండు ఆర్టువైపు ప్రతిభ చూపించడం చూసి కామాక్షి ఒకరోజు అతడిని ఒంటరిగా పిలిచి కూర్చోపెట్టుకుంది. పండుకి తల్లి అంటే ప్రాణం. అమ్మ నవ్వితే ఎంత బావుంటుందో అనుకుంటాడు.

"పండూ! నీకు మన ఇంట్లో ఎవరంటే ఎక్కువ ఇష్టం? " కామాక్షి అడిగింది.

పండు తల్లి ఎందుకు అలాగ అడుగుతోందా అనుకున్నాడు. "జవాబు చెప్పరా పండూ" అంది.

పండు తల్లి ఒడిలో పడుకుని "నువ్వంటే చాలా ఇష్టం అమ్మా" అన్నాడు.

"నిజంగా" అంది.

"నిజం. అమ్మా"

"ఎందుకని కన్నా? " అంది కామాక్షి.

పండు తడుముకోకుండా చెప్పాడు.

"నువ్వు ఎప్పుడూ మాతోనే ఉంటావు. నాకు అన్నం పెడతావు. నన్ను చదివిస్తావు. నాకు కావలసిన డబ్బులిస్తావు. అందుకని నువ్వు ఇష్టం"

కామాక్షి అడగలేనట్లు అడిగింది "పాపం నాన్నగారు నీకు స్వీట్లు తెస్తారు. పెసరట్లు తిన్పిస్తారు. సినిమాలు చూపిస్తారు. మరి ఆయనంటే"

పండు మాట్లాడలేదు. వాడికి చాలా రోజులనుండి తండ్రిని చూడాలని ఉంది. తల్లిని అడిగితే బాధపడుతుంది. నాన్నేమో

ఇంటివద్ద ఎపుడోగానీ ఉండరు. వాడికి కళ్ళమ్మట నీళ్ళు తిరిగాయి.

"నాన్నగారు చక్కగా, అందంగా బొమ్మలు వేస్తారు. ఆయనకి బోలెడు డబ్బు వస్తుంది. నాకంటే ఆయనే గొప్ప కదురా. నేను... నేను బొమ్మలు వేయలేను. అమ్మ లేను. డబ్బు తేలేను" కామాక్షి ఉన్న విషయాన్ని వాడికి అర్థమయ్యేలాగ అంది.

పండు రోషంగా తల ఎత్తాడు. "బొమ్మలు వేస్తే గొప్పేనేమిటి? అమ్మ దగ్గర, మా దగ్గర ఉండవద్దా? "

కామాక్షి చిరునవ్వుతో పండు జుట్టు ప్రేమగా నిమురుతూ అంది. "పండూ, నువ్వు చెప్పింది నిజంరా! నీకు అర్థమైంది కదా! బొమ్మలు వేయవచ్చు పాటలు బాగా పాడి పేరు తెచ్చుకోవచ్చును. కానీ 'మన వాళ్ళు' అన్న వాళ్ళని వదలకూడదు. మన పనులు మానకూడదు. ఔనా"

పండు తల్లి దగ్గరగా వచ్చి ఆవిడ చీర కుచ్చిళ్ళలో మొహం దాచుకొని అన్నాడు. "అమ్మా! నేను డాక్టరునైనా, బొమ్మలు వేసినా నిన్ను, అక్కలను వదలనేవదలను. మీ దగ్గరే ఉంటాను"

కామాక్షికి ఆ చిన్నపిల్లవాడి మాటలు భరోసానిచ్చాయి. "భగవంతుడా! మా పండు వాడి బాధ్యతలను వాడు ఎరిగేలానే తీర్చిదిద్దు" అని మనసులోన కనబడని ఆ దైవానికి నమస్కరించింది. పండుని దగ్గరికి తీసుకొని ముద్దుపెట్టుకుంది.

భీమవరంలో సాంస్కృతిక సంస్థలు ఎక్కువే. ఎప్పుడూ ఏదో ఒక ఉత్సవం జరుగుతూనే ఉంటుంది. కవి సమ్మేళనాలు, సంగీత కచేరీలు, హరికథా కాలక్షేపాలు అధికమే. ఆ రోజు తనకి పేపర్లో కన్పించిన విషయం చూసి కామాక్షి సాలోచనగా ఉండిపోయింది.

"నేను పనిమీద బయటికి వెళుతున్నాను. వచ్చేటప్పటికి ఆలస్యం అవుతుంది. మీరు ముగ్గురూ చదువుకొని, భోజనాలు చేసెయ్యండి" అని ఆ సాయంత్రం పిల్లలతో అంది. వాళ్ళు అలాగేనంటూ తలలూపారు. తమని తీసుకెళ్ళే విషయం అయితే తల్లి తమని వదిలి వెళ్లదని వారి నమ్మకం.

మర్నాడు ఉదయం పిల్లలు లేచాక "ఈరోజు మన ఇంటికి ఒక అంకుల్ వస్తున్నారు. మన ఇంట్లో మనతో సరదాగా గడుపుతారు. మరి మీరు త్వరగా తెమలాలి"

పిల్లలు ముగ్గురూ హుషారుగా రెడీ అయ్యారు.

ఎనిమిది గంటల సమయంలో వచ్చిన ఆ వ్యక్తిని ఆవిడ సాదరంగా ఆహ్వానించింది. చామన ఛాయరంగులో, సన్నగా, పొడుగ్గా, సుకుమారంగా ఉన్న ఆయన పిల్లలికి ఎంతో నచ్చారు. కామాక్షి తన పిల్లలను ఆయనకి పరిచయం చేసింది. పిల్లలకి, ఆయనకి టిఫిన్ పెట్టి, కాఫీ ఇచ్చాక పండు ఈమధ్య వేసిన బొమ్మలు తెచ్చి చూపించింది.

పండు ఇంక ఆత్రుత ఆపుకోలేక అడిగేశాడు "అమ్మా ఆయన ఎవరమ్మా? "

కామాక్షి నవ్వింది. "అంకుల్ని డాడీ రూంలోకి తీసికెళ్ళి ఆయన చిత్రాలు చూపించండి"

ఆ వ్యక్తి ఆనందంగా పిల్లలతో ఆ గదిలోకి నడిచాడు.

ఆయన ఒక అరగంట గడిచాక కామాక్షితో అన్నారు. "అక్కయ్యగారూ! మీరు అదృష్టవంతులు. బావగారి లాంటి గొప్ప కళాకారులను భర్తగా పొందారు. ఎన్నాళ్ళ నుండో ఆయన చిత్రాలు చూడాలని కోరిక. అది ఈ విధంగా తీరింది. చిన్నవాడైనా పండు ఎంతో బాగా బొమ్మలు వేస్తున్నాడు. ఈ బాబుకి మంచి భవిష్యత్తుంది. మీ అబ్బాయి మంచి కళాకారుడవుతాడు"

కామాక్షి ఆయన మాటలకి సంతోషించింది. "వాడు మీ శిష్యుడైనప్పుడే అదృష్టవంతుడయ్యాడని అనుకున్నాను" అంది.

పండు ఆశ్చర్యంగా ఆయనవైపు చూస్తూ, "అంకుల్ మీరు చిత్రాలు వేస్తారా? " అన్నాడు.

ఆయన మాట్లాడలేదు. తన బాగ్‌లో నుండి ఒక దళసరి తెల్లని కార్డు తీశాడు. దానిపై కుడిచేతి బొటనవేలు, మధ్యవేలులతో, చూపుడు వేలు సహాయంతో ఆయన బొమ్మ వేయసాగారు. పొడుగాటి ఆయన గోళ్ళు అతి చురుకుగా, సున్నితంగా ఆకార్డుపై నడయాడుతున్నాయి. ఐదు నిముషాలు గడిచేసరికి ఆయన ఆ కార్డు పండు చేతికి అందించారు. పండు ఆసక్తిగా దాన్ని చూశాడు. ఆ కార్డుపై పండు బొమ్మవేసి ఉంది. పండు ఉంగరాల జుట్టు, పండు షర్టు, కాలరు, గుండీలు అన్ని అందులో చక్కగా కనిపిస్తున్నాయి.

"అంకుల్ అద్భుతం. ఇది నా బొమ్మే కదూ!" పండు సంబరంగా అడిగాడు.

ఆయన నవ్వుతూ "ఊ" అన్నారు.

గిరిజ, పద్మ ఆయన దగ్గరికి వచ్చారు. "అంకుల్ మాకూ ఒక బొమ్మ వేసి ఇవ్వరా? " అంటూ. ఆయన నవ్వుతూ తల ఊపి వాళ్ళిద్దరికీ సరస్వతీదేవి బొమ్మవేసి ఇచ్చారు. వీణాపాణి బొమ్మ వాళ్ళకి ఎంతో నచ్చింది.

కామాక్షి పిల్లలకి చెప్పింది. "మన దేశంలో నఖచిత్రకారులు కొద్దిమందే ఉన్నారు. ఎందుకూ పనికిరాదని మనం కత్తిరించేసే గోరుతో, అద్భుతమైన చిత్రాలను నిర్మించడమే 'నఖచిత్రకళ'. వీరు గొప్ప నఖచిత్రకళాకారులు"

తల్లి చెప్పింది ఎంతో ఆసక్తిగా విన్నారు పిల్లలు. "మీరూ, వాళ్ళూ మాట్లాడుతూ ఉండండి. నేను వంట పూర్తిచేసి వస్తాను" అంటూ వాళ్ళ మాటలు వినబడేలాగ కూరల బుట్ట తెచ్చుకుని కూర్చుంది.

పద్మ ఆసక్తిగా అడిగింది. "అంకుల్ "నఖచిత్రకళ' గురించి చెప్పండి. మాకు తెలుసుకోవాలనుంది. మీరు ఈ కళను ఎలా, ఎందుకు నేర్చుకున్నారు? "

ఆయన ఆ పిల్లలవైపు ముగ్ధులైనట్లు చూశారు. వాళ్ళ ఆసక్తిని గమనించి చెప్పసాగారు. ఆనంద్ కూడా వచ్చి వాళ్ళ దగ్గర కూర్చున్నాడు.

"ప్రపంచంలో పోటీ పెరిగిపోతోంది. మనం మన ఉనికిని నిలబెట్టుకోవాలంటే ఏదో ఒక ప్రత్యేకతను కలిగి ఉండాలి. ఏదో ఒక నైపుణ్యాన్ని మన స్వంతం చేసుకోవాలి. మన చిత్రకారులు ఎందరో అద్భుతమైన ప్రావీణ్యంతో పేరుప్రతిష్టలు కలిగి ఉన్నారు. అయితే నాకంటూ ఒక కొత్త తోవలో నడవాలన్పించింది"

ఆయన సన్నగా నవ్వుతూ అన్నారు. "ఈ నఖచిత్రకళలో కూడా ఘనులైనవారున్నారు. రామాయణం అంతా నఖచిత్రాలలో వేసినవారున్నారు. ఎందరో యువకులు, దీన్ని నేర్చుకుని కృషి చేస్తున్నారు. నా దగ్గర కూడా కొంతమంది ఉన్నారు"

పద్మకి, గిరిజకి తల్లి ఆయనని ఎందుకు తమ ఇంటికి తీసుకొని వచ్చిందో అర్ధమైంది. పండు వెంటనే అన్నాడు "అంకుల్? మీరు నాకు ఈ నఖచిత్రకళను నేర్పాలి"

నాయుడుగారు వెంటనే అన్నారు. "తప్పకుండా నేర్పిస్తాను. కృషి, పట్టుదల, నైపుణ్యం ఉంటే రాని విద్యలేదు" అంటూ ఆయన ఆ కళకి సంబంధించిన విషయాలు చెప్పారు.

కామాక్షి వాళ్ళ మాటలను వింటోంది. ఆమె మనసు పరిపరి విధాలుగా ఆలోచిస్తోంది. కళలకు అంతులేదు. ఈరోజు ఒక కళాకారుడు ఎంతో కష్టపడి ప్రదర్శించిన నైపుణ్యం, అతడి అసామాన్యమైన ప్రతిభను ఎల్లుండి మరొకరు అధిగమించి సాధించినపుడు సామాన్యమైపోతోంది. ప్రతీ రంగంలో పోటీ ఏర్పడుతోంది. మేధస్సుకి పరిధి అంటూ లేదు. అందువలన తమ స్థానాన్ని తాము నిరంతరం కాపాడుకోవడా




నికి నూతనత్వం అనుక్షణం ప్రదర్శించవలసిన అవసరం ఏర్పడుతోంది.

పండు ఆయనని అడుగుతున్నాడు, "అంకుల్! మీరు ఇలాంటి బొమ్మలు ఎంత వయసునుండి వేస్తున్నారు? అన్ని రకాల బొమ్మలూ వేయగలరా?"

జిజ్ఞాస అన్నది పిల్లల సొత్తు అనుకొన్నారాయన. ఈ తెలుసుకోవాలన్న తపన లేకపోతే లోకంలో ఇంత ప్రగతి ఉండేది కాదు.

"నేను పది సంవత్సరాల వయసునుండే వేస్తున్నాను. అయితే అతిమామూలు చిత్రాలు. ఈ నఖచిత్రకళకి సంబంధించి ఇరవై ఏళ్ల వయసు నుండీ వేస్తున్నాను. పౌరాణిక చిత్రాలు, మనుషుల చిత్రాలు, జంతువులూ... అన్ని రకాలూ దీని వలన వేయగలను.

ఆయన తను చిత్రించిన చిత్రాల గురించి చెప్పారు. "నఖచిత్రకళతో పౌరాణిక మూర్తులు, పౌరాణిక ఘట్టాలు, దేశనాయకులు, అభిజ్ఞానశాకుంతలం వంటి నాటకానికి సంబంధించిన ముఖ్య పాత్రలు, ఘట్టాలు ఇలాగ ఎన్నెన్నో ఆయన స్పందన మేరకి వేశారు. వాటిని కార్డుపై వేసిన తరువాత ఫొటోలు తీసి ఫ్రేములలో పెట్టవచ్చును. మామూలు చిత్రాలకి వలెనే వీటికి కూడా ఫొటోలు తీయవచ్చును.

"ఈ నఖచిత్రకళకి పరికరాలు ఎక్కువగా అవసరంలేదు. పెన్సిళ్ళు, రబ్బర్లు, కార్డులు, కలర్స్, మంచి పద్ధతిలో పెంచే గోళ్ళు ఉంటే చాలు. అతి తక్కువ ఖర్చుతో అత్యద్భుతమైన చిత్రాలను నిర్మించవచ్చు"

ఆయన చెప్పిన విషయాలన్నీ పిల్లలు శ్రద్ధగా విన్నారు. ఆయన వేసిన అభిజ్ఞాన శాకుంతలంలోని ఘట్టాలు, భాగవతంలోని వామనమూర్తి, గజేంద్రుని కాపాడటానికి విచ్చేసిన విష్ణుమూర్తి బొమ్మలు చూపించారు.

ఆర్టిస్టు చూసేవారి మనసుని కదిలించాలి. ఏ చిన్న దృశ్యంగానీ, వ్యక్తిగానీ వారిని ఆకర్షించగలిగితే అద్భుతాలు సృష్టిస్తారు.

ఆయన పండు చూస్తుండగానే నాల్గయిదు కార్డులపై రకరకాల చిత్రాలను ఎలా వేసేదీ ప్రదర్శించారు. పండు ఎంతో శ్రద్ధగా గమనించసాగాడు.

కామాక్షికి ఎంతో సంతోషంగా అన్పించింది. పిల్లలకిష్టమైన పని తాను చేయగలిగింది. ఆమె నవ్వుతూ వెళ్ళి అందరూ భోజనాలకి రండి అంటూ పిలిచింది.

ఆయన, పిల్లలు కబుర్లు చెప్పుకుంటూ కూర్చున్నారు. వాళ్ళతో మాట్లాడుతూ ఆవిడ అభిమానంగా వడ్డిస్తుంటే ఆయన తృప్తిగా భోజనం చేశారు.

చివరిగా ఆయన తన ఆకువైపు చూపిస్తూ అన్నారు. "వంట చేయడం అన్నది ఒక అద్భుతమైన కళ అని మీరు ఇప్పుడు చూపించారు. టొమాటో పప్పు, పులిహోర, ప్రసాదం నాకు చాలా నచ్చాయి. ఇంత తక్కువ టైంలో ఇన్ని రకాలు చేసి నాకు కడుపునిండా తినిపించారు. నేను ఎంతో తృప్తిగా భోజనం చేశాను" అన్నారు.

ఆయన కాసేపు పడుకుని లేచేసరికి ఆవిడ కొత్త బట్టలు సిద్ధంచేసింది. ఆయనని తరచుగా వస్తూండమని కోరింది. పండుచేత ఆయనకి బట్టలు ఇప్పించింది. బట్టలు ఇచ్చి నమస్కారం చేశాక పండు ఆయనకి ఒక వైట్ కార్డ్ అందించాడు. ఆయన దాన్ని చూసి అప్రతిభుడయ్యాడు. అది ఆయన చిత్రం. అది అద్భుతంగా లేకపోవచ్చును. కానీ ఆయన రూపవిశేషాలు కన్పడుతున్నాయి. కార్డులోని తన కళ్ళజోడు చూసి నవ్వారాయన.

"అంకుల్! ఇప్పటినుండీ గోళ్లు బాగా పెంచుతాను. ఈసారి మీరు వచ్చేటప్పుడు చూడండి. బాగా గీసి మీకు కానుకగా ఇస్తాను"

ఆయన అభినందనగా అతడి భుజం తట్టారు. ఆ ప్రోత్సాహం చాలు అతడు కళా రంగంలో అద్భుతాలు సాధించడానికి.

ఆయన ఆవిడవైపు చూసి అన్నారు. "మంచి శిష్యులను పొందడం కూడా గురువు అదృష్టమేనమ్మా! నేను తప్పక వస్తూంటాను" అని సెలవు తీసుకున్నాడు. వెళుతూ పండు దగ్గర తను వేసిన కొన్ని కార్డులు వదిలివెళ్లాడు. పండు ఇచ్చిన కార్డు పదిలపరచుకొన్నాడు.

కామాక్షి మెడ చుట్టూ హారంలాగ తన చేతులను వేసి పండు ఆవిడకి రెండు బుగ్గలపై ముద్దులు కురిపించాడు. "మా బంగారు అమ్మ" అన్నాడు. పద్మ, గిరిజ ఇంకా ఆయన వేసిన చిత్రాల గురించే మాట్లాడుతూ కూర్చున్నారు. పండుకి ఏదో కొత్త ప్రపంచంలోకి అడుగుపెట్టినట్లు అన్పించింది.

"అమ్మా! ఆయన నన్ను సెలవులలో తన దగ్గరికి రమ్మన్నారు. వెళ్లనా?" అని అడిగాడు. ఆవిడ నవ్వుతూ తల ఊపింది.

అన్నట్లుగానే అటువైపుగా ఏ ప్రయాణాలు చేయవలసి వచ్చినా ఆ ఆర్టిస్టు నాయుడుగారు వీళ్ల ఇంటికి వచ్చి రెండు రోజులన్నా గడపకుండా ఉండటంలేదు. ఆ పిల్లవాడి శ్రద్ధ, ఆ తల్లి ఆదరణ, బిడ్డలపై ఆవిడచూపే శ్రద్ధ ఆయనని బాగా ఆకర్షించాయి. పండుతోపాటు గిరిజకూడా చిత్రకళవైపు దృష్టి మరల్చింది.

బొమ్మలు సరిగా కుదరకపోతే గిరిజకి చిరాకుగా ఉండేది. తమ్ముడు అతి లాఘవంగా బొమ్మలు వేయడం, నఖ చిత్రాలను ప్రదర్శించడం చేస్తున్నాడు. తను వెనుకబడిపోతోంది.

పండు గిరిజని ఉడికిస్తూ అన్నాడు. "నా శిష్యరికం చేయవే! ఏదో ముసలిదానివయ్యే లోపు వస్తుందిలే"

గిరిజ వాడి చెవులు మెలివేసింది "వేలెడు లేవు. నన్ను ఆటపట్టిస్తున్నావా?" అంటూ.

పండు తన చెవి వదిలించుకుంటూ అనే వాడు, "ఆడపిల్ల ఏ చింతగింజలో, తొక్కుడు బిళ్లలో ఆడుకోక నాతో పోటీ ఏమిటీ? అమ్మా! పద్మక్క మాట అలా ఉంచు. దీనికి త్వరగా పెళ్లిచేసి పంపించెయ్యి. ఇల్లు ప్రశాంతంగా ఉంటుంది" అని.

గిరిజ తమ్ముడిని నిలదీసింది "ఇప్పుడు నా బాధ నువ్వేం పడుతున్నావురా! అంత లాగ అలిసిపోవడానికి?"

పండు తల ఎగరవేసి నవ్వుతూ అన్నాడు, "ఒక బాధా? ఎన్నని చెప్పమంటావు? నువ్వు బజారెళ్లి ఏది కొనుక్కోవాలన్నా బాడీగార్డులాగ నేను నీ వెనకాలే రావాలి. నువ్వు కావాలంటే నీ ఫ్రెండ్స్ ఇళ్లకి వెళ్లి నోట్సులు తెచ్చి పెట్టాలి. నీకు పనులలో ఇంటి దగ్గర సాయం చేయాలి. అన్నింటికంటే ముందు పెద్ద బాధ నీకిష్టమైన వెంకటేష్ సినిమాలన్నీ నీతోపాటు చూడాలి. నాకిష్టమైన మా హీరో సినిమాలు నీవల్లనే వెంటనే చూడలేకపోతున్నాను. సరదాగా కొనుక్కున్న కేకులు, బిస్కట్లు నన్ను తిననీయకుండా 'నాకేదీ' అంటూంటే భాగాలు పంచలేకపోతున్నాను" ఇంకా అతడు ఆలోచనలోపడి "ఆ గుర్తు వచ్చింది..." అంటూ ఇంకేదో చెప్పబోతుంటే గిరిజ వాడి వీపుమీద రెండు వేసింది. వాడు ఆమెకి అందకుండా పెరట్లోకి పరుగుతీశాడు. గిరిజ వెంబడించింది. పడకకుర్చీలో పడుకున్న కామాక్షి వాళ్లను నవ్వుతూ చూస్తోంది.

ఆమెకి ఎనలేని తృప్తిగా అన్పించింది. "ఈ పరుగులు, ఈ మాటలు, ఈ నవ్వులు ఎంత బావున్నాయి. ఇల్లు అన్నాక ఈ సజీవమైన వాతావరణం కావాలి భగవంతుడా! అతి తక్కువ కాలంలో నన్ను మేలుకొనేటట్లు చేశావు. నీకు ఎప్పుడూ కృతజ్ఞురాలినే" అనుకుంది.

ఆవిడ కళ్లముందు "అమ్మా! నాకు ఇంకా కొంచెం అన్నం కావాలి. ఆకలివేస్తోంది.





కడుపు నిండ లేదమ్మా" అంటున్న ఒకప్పటి గిరిజ మెదిలింది. ఆ పిల్లకి కడుపు నింప లేని తన అశక్తతకి ఎంతగా కుంగిపోయేది!

"అమ్మా! నాకు ఈ జ్వరం ఎప్పుడు తగ్గు తుందమ్మా! నాకు... నాకు భయంగా ఉంది. నాన్నగారైనా ఉంటే బావుంటుంది కదమ్మా" అంటూ పద్మ జ్వరతీవ్రతలో మాట్లాడిన మాటలు ఇప్పుడూ గుర్తువస్తు న్నాయి.

బావుంటుంది నిజమే! ఈ లోకంలో బావుండే విషయాలు ఎన్నో ఉన్నాయి. కానీ తాను, తన పిల్లలు అత్యాశకి పోలేదే? ఈ ప్రేమ కుటీరంలో భర్త నీడలో ఈ పిల్లల్ని సాఫీగా పెంచుకుంటూ బతకాలను కుంది. వయసు పోరు వలన కోరుకునే కోరిక కాదది. ఒక నిశ్చింతకోసం, ఒక రక్షణ కోసం, ఒక ధైర్యం కోసం ఆయన అండ కావాలనుకుంది.

"ఏవండీ పప్పులు అయిపోయాయి. అలాగ మార్కెట్లోకి వెళ్లి పప్పులు, కూరలు తెస్తారా? " అని పెళ్లై వేరింటి కాపురం పెట్టిన తర్వాత భర్తని అడిగింది.

ఆ మాటలు విని ఆయన ఏమన్నారు? ఇప్పటికీ వాటిని మరిచిపోలేకపోతోంది. ఇప్పటికీకాదు ఎప్పటికీ మరిచిపోలేదు.

"ఇదిగో ఇందుకే పెళ్లి, పిల్లలు, సంసారం వద్దనుకున్నాను. ఏవండీ బియ్యం అయిపో యాయి. ఏవండీ పప్పులు అయిపో యాయి. చీరలు చిరిగిపోయాయి అంటూ భార్య పీడిస్తుంది. నాన్నా నాకు పరికిణీలు కావాలి, అది కావాలి అంటూ ఆడ పిల్లలు ప్రాణాలు తీసేస్తారు. ఎన్నాళ్లకి ఈ ఆడ వాళ్లు మారతారు?

"భర్త అనగానే ఇవన్నీ భరించడమే వాడి పనా? ఒక సరదా, ఒక సంతోషం ఏవన్నా ఉండాలా? వద్దా? ఆ పెద్దవాళ్లు నా మాట వింటేకదా! పెళ్లిపెళ్లి అని పీక్కుతిన్నారు. నేనో బుద్ధిలేని గాడిదని. వాళ్ల మాట కాద నలేకపోయాను"

కామాక్షి మొహం చిన్నబోయింది. అయినా తెచ్చిపెట్టుకున్న నవ్వుతో అడి గింది. "మరి మన ఇంటి అవసరాలు తీర్చ మని ఎవరి నడగాలి? "

ఆయన తేలికగా తీసిపారేశాడు. "ఆ వెధవ అవసరాలు అవో పెద్ద అవసరాలా? ప్రతీవాళ్లూ చేసే పనే తిండితినడం, నిద్రపో వడం, ఆ తిండికోసం పొద్దుగూకులూ యాతన పడటం... నాకిలాంటివంటే అసహ్యం. నువ్వు అసలు ఒక చిత్రకారుని భార్యగా జీవించడం నేర్చుకో"

కల కరిగిపోయింది. వాస్తవం కళ్లముం దునిల్చింది. బతుకంటే భయం. పొలం పంటలో తమ వాటాకు వచ్చే డబ్బు వద్దనీ, ధాన్యం పంపమంది. ఆ బియ్యం ఎంత పొదుపుగా వాడుకున్నా పై ఖర్చులకి ఎవ రిని దేవిరించడం?

"భార్య అన్న స్త్రీకి ఓర్పు, నేర్పు ఉండాలి. ఎంత ఇస్తే అంతలో ఇల్లు తీర్చిదిద్దగలగాలి" భర్త ధర్మోపన్యాసాలకి ఏమీ లోటులేదు. "పంచభక్ష్య పరమాన్నాలు తిన్నట్లే గంజీ అన్నం తినగలగాలి. అఫ్‌కోర్సు నేను ఎక్కడ ఉంటే అక్కడ కనకవర్షమే అనుకో! అయినా ఒక యోగిలా ఎలా ఉన్నానో అర్థం చేసుకో" అంటారాయన.

ఈ కబుర్లకేం తక్కువలేదు. ఆమె మన సులో అనుకొనేది. పౌడర్లు, సబ్బులు, సెంట్లకి లోటులేదు. సబ్బుతో రెండుసార్లు స్నానం, తెల్లటి పువ్వుల్లాంటి బట్టలు తొడిగి, సెంటు స్ప్రే చేసుకొని పూలరంగడిలాగ బయట అడుగుపెట్టే ఆయనను చూస్తే అయోమయంగా అన్పించేది.

"ఎందుకు ఈ సెంట్లు, సువాసన నూనెలు కొని డబ్బు దుబారా చేస్తారు? మామూలు నూనె కొనుక్కోవచ్చుకదా! ఈ డబ్బుతో వారం రోజులు కూర ఖర్చు దాటదా? "

తను అన్న మాటలకి ఆయన పిచ్చిదాన్ని చూసినట్లు చూసేవారు. "అంత గొప్ప

ఇంట్లో నువ్వు ఎలా పుట్టావో అర్థమవదు. జీవితం అనుభవించడం నేర్చుకోవాలి. అది ఒక కళ. అది అందరికీ రాదేమో" ఆయన ఓరకంట చూస్తూ అనేవారు.

తనేదో టేస్టు ఉన్న పిల్లనుకుని పెళ్లి చేసుకొన్నాడట. కళాత్మకంగా బతకడం రావాలిట. సెంటువాసనలతో మంచి పరిమళపు తల నూనెతో ఆయనవంటి అందగాడు పక్కలోకి వస్తోంటే జీవితాన్ని ఆనందంగా గడపడం రాని వట్టిమొద్దు తను అన్పిస్తుందేమో. ఒక విషయం మెచ్చుకోవాలి. ఆయనకి ఇష్టంలేని పని ఏదైనా సరే నిర్మొహమాటంగా పక్కకి తోసిపారేసేవాడు. ఎవరు ఏమనుకొంటారో అన్న భయం ఆవగింజంత లేదు.

పొలమైనా ఆసరాగా ఉందని మురిసినంతకాలం పట్టలేదు. తన వంతు పొలం కొత్తగా కట్టిన రామాలయానికి భోగం కోసం రాసి ఇచ్చేశాడుట. అన్నదమ్ములు చేయని పని చేసిన దాత అంటూ అందరూ పొగడ్తలే. ఆ విషయం తెలిసిన రోజున తాను ఎంత ఏడ్చిందో! 'పిల్లల కడుపులు నింపే దారి ఏది భగవాన్' అంటూ ఆక్రోశించింది. దానధర్మాల ముందు బాధ్యత గుర్తు రానందుకు క్రుంగిపోయింది. ఒక్కసారి తమను గుర్తుచేసికొంటే ఆ పని చేయగలిగేవారా? తనకీ విషయం తెలిసిందని ఆయనకు తెలిశాక ఇంక ప్రజలందరూ తనని ఎలా ప్రస్తుతించారో చెప్పడం మొదలెట్టారు. 'తన్నుమాలిన ధర్మంబు తగవుగాదు' అన్న ఇంగితం ఆయనకు లేనందుకు తను బాధపడింది.

ఆయన పొడుగాటి చేతులు గాలిలో ఊపుతూ అన్నాడు. "ఈ దానధర్మాలు ఎవరికోసం చేస్తున్నాను? మీ కోసమే. మీ మంచి భవిష్యత్తుకోసం చేశాను"

ఆయన మాటలు ఎలా అర్థం చేసుకోవాలో తెలియదు. తమ మంచి కోసం తమకున్న ఆధారం కాస్తా పాడుచేస్తారా? బాగా సంపాదించాక ఆయన ఇష్టం వచ్చినట్లు చేయవచ్చుకదా! ఆయనతో గడిపిన ప్రతీ నిముషం ఆవిడకి గుర్తే. నాలుగు డబ్బులు జేబులో పడ్డాయా అవి అయ్యే వరకూ చిత్రం ఊసైనా పెట్టుకొనేవాడుకాదు. కావలసినవి అడిగి చేయించుకొని తినడం, హాయిగా నిద్రపోవడం, సినిమాలు షికార్లు అంటూ తిరగడం 'దీపం ఉండగానే ఇల్లు చక్కబెట్టుకోవాలి. వయసులోనే నాలుగు రాళ్లు పోగుచేసికోవాలి' అనే తన మాటలకి ఆయన నవ్వే బదులు అయ్యేది. 'నారు పోసిన వాడు నీరు పోయడా? అంతా మిథ్య. నాలుగు రోజులు బతుకుకి ఇంత హైరానా ఏల? ' అని చెప్పే సూక్తులకి లోటు ఏమీ వుండేదికాదు.

షావుకారిగారి కోడలు అత్తగారిని నిలదీసేది, "అత్తయ్యగారూ ఎన్నాళ్ళని ఇలాగ అప్పు ఇస్తాం? మేం ఇచ్చిన బియ్యం బాకీ ఆవిడ తీర్చగలదా! తీర్చడానికి ఏదారి ఉంది చెప్పండి? " అని.

తన మనసు ఆ మాటలు విని ఎంత చిన్నబోయిందో. మరొకచోట అప్పుచేసి ఇక్కడి అప్పు తీర్చడం, ఇక్కడ అక్కడ తిరుగుతూ ఉండటం, ఎవరికి ఏ పని కావలసి వచ్చినా చేసి పెట్టడం, వాళ్లు ఊరగాయలు పెట్టుకొంటున్నాం సాయం రామ్మా అన్నా, పిండి వంట తలపెట్టాం కాస్త ఓ చెయ్యి వెయ్యమ్మా అన్నా వెనక్కి వెళ్లలేదు. వాళ్లందరి సహకారంతోనే తమ జీవితాలు గడుస్తున్నాయి. వాళ్లకి ఉపయోగపడటంలో ఆనందం, తృప్తి ఉన్నాయనుకుంది. సుబ్బమ్మ కామాక్షి దగ్గరికి వచ్చింది. "అమ్మాయి నీతో పని పడిందే. నువ్వు కాదనకూడదు"

కామాక్షి నవ్వింది. "మీ మాట నేను ఎప్పుడు కాదన్నాను? "

ఆవిడ కూడా నవ్వింది. "అదికాదే! ఇప్పుడు అడిగే విషయం వేరు" ...

కామాక్షి చెప్పమన్నట్లు చూసింది.




ఆవిడకి, అమ్మాజమ్మగార్కి కాశీ చూడాలని ఉందట. కామాక్షిని తమకి సాయంగా రమ్మన్నారు.

"నేను ఒకవైపు నీకు ఖర్చు పెడితే ఆవిడ మరొకవైపు పెడుతుంది. మమ్మల్ని ఆ గంగలో కాస్త ముంచి, శివ దర్శనం చేయించి పుణ్యం కట్టుకోతల్లీ" ఆవిడ ప్రాధేయపడింది.

పెద్దవాళ్లు, వాళ్లకి పుణ్యం కావాలన్పిస్తుంది. కామాక్షి ధైర్యం ఉన్న స్త్రీ. జాగ్రత్తగా తీసికెళ్లి తీసికొని వస్తుందని వాళ్ల ఆశ. కామాక్షి ఆలోచనలో పడింది. కామాక్షికి ఇల్లే కాశీ, ప్రయాగ. ఎక్కడికీ వెళ్లాలని ఏమీ చూడాలని ఆమెకి అన్పించదు. జీవితం ఒడిదుడుకులు లేకుండా గడిస్తే చాలనుకుంటుంది. ఇప్పుడు ఆలోచనచేసి లాభంలేదు. వాళ్లు ఎంతో ఆశతో అడిగారు. వాళ్ల సహాయంతో బతుకు నడుపుకుంటూ తిరస్కరించగలదా? అలాగని పిల్లల్ని వదిలి వెళ్లాలని లేదు. ఆనంద్, నాగమ్మ ధైర్యం చెప్పడంతో ఆవిడ ప్రయాణానికి పండుని తీసికుని సిద్ధపడింది.

కామాక్షి బయలుదేరుతోందనగానే పెద్దవాళ్లు మరో ఆరుగురు బయలుదేరారు.

"అందరూ ఆడవాళ్లు బయలుదేరితే కష్టం కదా!" అని భార్యతో సహా షావుకారుగారూ బయలుదేరారు.

కామాక్షి వంద అప్పగింతలు నాగమ్మకి అప్పగించి బయలుదేరింది. పద్మచేతికి డబ్బులిచ్చి జాగ్రత్తగా ఉండమంది. బయలుదేరుతుంటే కామాక్షికి కళ్లనీళ్లు ఆగకుండా స్రవించసాగాయి. ఏనాడూ పిల్లల్ని విడిచి వెళ్లలేదు. మొదటిసారి ఆడపిల్లల్ని వదలడం బాధగా ఉంది. పద్మ ఎన్ని రకాలుగా ధైర్యం చెప్పినా బెంగగానే అన్పించింది.

పద్మ ఎక్కువగా మాట్లాడదు. కామాక్షి చేసే పనులన్నీ ఆ పిల్లకి తెలుసును. ఎవరినీ నొప్పించడం తెలియని పిల్ల. తల్లి వెళ్లేటప్పుడే నాలుగు రకాల పచ్చళ్లు చేసి భద్రపరిచి వెళ్లింది. నాలుగు రోజులు షాపు మూసెయ్యమనే చెప్పింది కామాక్షి. పద్మ ఆలోచనలో పడింది. ఒక పని ప్రారంభించడం ఎంతో కష్టం. నాలుగు రోజులు వ్యాపారం మూసివేస్తే తమకి ఇప్పుడున్న పరిస్థితుల్లో పర్వాలేదు. కానీ వెళ్లిపోయిన వారిని తిరిగి రప్పించడం కష్టమవదా?

అందుకనే మర్నాడు ఉదయం టమాటో పచ్చడి కావాలని, తీపి ఆవకాయ కావాలని వచ్చినవాళ్లను నిరుత్సాహపరచకుండా వాళ్లు అడిగింది తూచి ఇచ్చింది. వాళ్లు ఇచ్చిన డబ్బు తల్లి ఎప్పుడూ ఉంచే దానిలో వేయకుండా ఇంట్లోకి వెళ్లి ఒక స్టీలు డబ్బా తెచ్చి అందులో వేసింది. నాగమ్మ ఆ పిల్ల జాగ్రత్తగా పచ్చళ్లు ఇచ్చే విధానం చూసి ముచ్చటపడింది.

"మీరు ఇద్దరూ మా దగ్గరే భోజనం చేయండి. నలుగురికీ నేను మా ఇంట్లో వండేస్తాను" అని నాగమ్మ అన్నా విన్పించుకోలేదు.

"చెల్లీ, నేనూ ఇద్దరం ఉన్నాం. ఇద్దరికి వండుకోవడం ఏం కష్టం? మాకూ పని రావాలికదా!" అంటూ సున్నితంగా తిరస్కరించింది. ఇటువైపు వచ్చినవాళ్లను చూస్తూ, అటువైపు వంట చక్కబెట్టుకుంది.

నాగమ్మ దగ్గరికి వచ్చి "మీరు షాపు చూసుకోండి. మేం స్కూలుకి వెళ్లివస్తాం" అంటూ చెల్లి, తను ఇంత అన్నం తిని, మధ్యాహ్నానికి కేరేజీ పట్టుకొని బయలుదేరారు.

సాయంత్రం ఇంటికి వచ్చాక ఇద్దరూ కాసేపు తోటపని చేశారు. వంటయ్యాక చదువుకుని నిద్రకి సిద్ధమయ్యారు.

గిరిజ అక్కవైపు తిరిగి "అక్కా! అమ్మ లేకపోతే ఇల్లు ఏమీ బావుండలేదుకదూ" అంది.

పద్మకి కళ్లనీళ్లు తిరిగాయి. తమని విడిచి తల్లి వెళ్లలేక వెళ్లింది. ఆవిడలేని ఇల్లు దేవుడు లేని కోవెలలాగుంది.





పద్మ కళ్లు తుడుచుకుంటూ అంది. "మనం ఉండలేమంటే అమ్మ అసలు వెళ్లేదే కాదు. ఇంకా అమ్మని విడిచి పది రోజులుం డాలి". పద్మ నవ్వింది. "అమ్మ వెళ్లిందే ఈరోజు. మనం అప్పుడే రోజులు లెక్క పె ట్టుకొంటున్నాం. అమ్మ తనంతట తానుగా ఎక్కడికీ వెళ్లలేదు. ఏదీ చూడలేదు. సుబ్బమ్మ మామ్మగారి వలన ఇన్నాళ్లకి కది లింది"

గిరిజకి నిద్ర పట్టడంలేదు, లేచింది. పద్మ అంది, "నిద్రరావడంలేదా? నాగమ్మగారు మనకి తోడుగా ఇక్కడే పడుకున్నారు. భయంలేదు"

గిరిజ అలమరా దగ్గరికి వెళ్లి తల్లి ఆకు పచ్చ జరీచీర, జాకెట్టు తెచ్చుకుంది. వాటిని పక్కలో పెట్టుకుని వాటిమీద చెయ్యివేసి అక్కకి దగ్గరగా జరిగి పడుకుంది. పద్మకి కూడా గొంతు పట్టినట్లయి చెల్లిమీద ఒక చెయ్యివేసి పడుకుంది. నాగమ్మ తను మెల కువగానే ఉన్నట్లు దగ్గింది.

మర్నాడు సాయంత్రం చెల్లి బలవంతంగా ఇచ్చిన చేగోడీలు, జంతికలు పద్మ తినడా

నికి ఉపక్రమించేలోపు కొరివికారం పచ్చడి, నిమ్మకాయ ఊరగాయ కావాలని ఒకరు వచ్చారు. పద్మ ప్లేటు అక్కడ పెట్టి అవి తీసి తూచసాగింది.

"పాపగారూ! చేగోడీలు పావుకేజీ ఎంతండీ? " అని అడిగాడు.

పద్మకి అతడు అడుగుతున్నది అర్థమవ లేదు. అతడు పద్మ అక్కడ పెట్టుకున్న ప్లేటువైపు చూపి "అవి పావుకేజీ ఎంతకి స్తారు? " అని అడిగాడు.

పద్మ తెల్లబోయింది. తల్లి ఊరు వెళుతూ తమకోసమని చెగోడీలు, జంతికలు, తొక్కుడు లడ్డూ, కొబ్బరి లస్కోరా చేసి వెళ్లింది. అతడు వాటిని అడుగుతున్నాడు. పద్మ మనసులో తర్జన భర్జన పడింది. చెల్లి బజారునుండి వాటిని కొనుక్కొని తెచ్చే ఖరీదు గుర్తు చేసికొంది. ఆ ఖరీదుకి రెండు రూపాయలు అదనంగా చేర్చి చెప్పింది. అతడు ఆనందంగా పావుకేజీ కొనుక్కుని వెళ్లాడు.

పద్మ నవ్వుతూ గిరిజ దగ్గరికి వచ్చి విషయం చెప్పింది. "చెల్లీ! వాటిని ఇవ్వ వద్దా! ఇవ్వాలా అని అయిదు నిముషాలు ఆలోచించాను. అవి అమ్మ మనకోసం చేసింది. నిజమే. కానీ అమ్మ మనకోసమే ఈ వ్యాపారం చేస్తోంది. అతడు ఎంతో బావున్నాయని మెచ్చుకుంటూ తింటూ వెళ్లాడు. వ్యాపారం అంటూ ప్రారంభించాక మనకి లాభం చేకూరే విషయం ఎదురైన పుడు మనం దానితో ముందుకు వెళ్లవచ్చు కదా!"

గిరిజ అక్కని అభినందిస్తున్నట్లు చూసింది.

పద్మ సాలోచనగా చూస్తూ అంది "ఇందులో ఒక ఇబ్బంది కూడా ఉంది"

గిరిజ ఏమిటన్నట్లు చూసింది.

"అమ్మకి ఇంకా తెలియలేదుకదా! మన ప్రయత్నాన్ని అమ్మ అభినందిస్తుందా? "





తనకి తనే ధైర్యం చెప్పుకుంటున్నట్లు అంది "చూద్దాం. నష్టం ఏముంది? బావుంటే ముందుముందు కొత్త ఐటమ్స్ ప్రారంభించవచ్చు"

పద్మ తొక్కుడు లడ్డూలు తమ కోసం ఉంచుకుని లస్కోరా ఉండలు, జంతికలు కూడా తెచ్చి డబ్బాలు అక్కడ పెట్టింది. వచ్చేవాళ్లకి కనపడేలాగ వెడల్పు సీసాలలో కొన్ని పెట్టింది. ఇద్దరు ఆడవాళ్లు పచ్చళ్ల కోసం వచ్చి వాటితోపాటు ఉండలు కొను క్కొని వెళ్లారు.

ఈలోపు ఆనంద్ వచ్చాడు. గిరిజ కాగితం తీసుకొని నాగమ్మనడిగి జంతికల కైన ఖర్చు రాస్తోంది. ఆనంద్‌కి ఆ పిల్ల ఎందుకలా రాస్తోందో అర్థమవలేదు.

"అయితే మనం జంతిక ఒకటి రూపాయి న్నరకి అమ్ముదాం. ఎంతైనా ఇవి పెద్ద సైజు జంతికలు. ఈసారి నుండి కాస్త చిన్న విచేసి రూపాయికి ఇద్దాం" అన్న గిరిజ మాటలకి నాగమ్మ నవ్వి అలాగే అంది.

ఆనంద్ పద్మ వైపు చూసి "ఏవండీ! మీకు బియ్యం ఉన్నాయా? " అని అడిగాడు.

పద్మకేం అర్థం కాలేదు. అయినా అడిగాడు కాబట్టి చెప్పాలనుకొని ఉన్నాయ న్నట్లు తలూపింది.

"ఊ... సరే పప్పులు అన్నీ ఉన్నాయా? " అతడు మళ్లీ అడిగాడు. పద్మ ఉన్నాయంది.

"దనియాలు, జీలకర్ర వగైరాలున్నాయా? "

పద్మకి అతడి ధోరణి అర్థమవలేదు. గిరిజ అతడివైపు చూస్తూ అంది "సింగినాదం లేదు. అయిపోయింది"

అతడికి అదేమిటో అర్థమవలేదు. మళ్లీ అడిగాడు. గిరిజ మళ్లీ అంది "సింగినాదం లేదు"

అతడు వెంటనే అన్నాడు. "అలాగే తెస్తాను" అతడు జేబులో నుండి పెన్ను, కాగితం తీసికొని రాశాడు.

పద్మ వస్తున్న నవ్వు ఆపుకోలేకపోతోంది. అతడు మళ్లీ ఆలోచిస్తున్నట్లు రెండు

క్షణాలయ్యాక "నూనె, సబ్బులు ఉన్నా యాండీ? " అన్నాడు.

గిరిజ అతడివైపు సీరియస్‌గా చూసింది.

"ఏమిటీ! మేము ఏమీ లేని నిరుపేదలం అని మీకు అన్పించిందా" అంది.

అతడు గాభరాగా చూస్తూ "అబ్బెబ్బే... అదేంకాదు. ఉన్నాయా, లేదా అని అడిగాను"

పద్మవైపు తిరిగి "కూరలు బయటివి ఏమన్నా కావాలా? ఉల్లిపాయలు, పచ్చిమిర్చి, అల్లం వగైరాలేవైనా కావాలా? " అన్నాడు.

గిరిజ అతడిని ఓరగా చూస్తూ అంది "మీరు ఏదైనా కొత్తకొట్టు పెట్టారా? హోమ్ డెలివరీ పని బాగానే చేస్తున్నారు"

ఆనంద్ మొహం ఎర్రబడింది. అతడు ఆ ఇంట్లో ఉంటున్నాడేకానీ ఆ పిల్లలతో చనువుగా ఉన్నదిలేదు. పండు, కామాక్షి మాత్రమే బాగా మాట్లాడతారు.

"ఛ... ఛ... నేనేమిటి? కొట్టుపెట్టడం ఏమిటి? "

"మరి ఇన్ని ప్రశ్నలు గేప్ ఇవ్వకుండా అడుగుతున్నారే? "

అతడు జేబులో నుండి రుమాలు తీసి కొని మొహం తుడుచుకున్నాడు. పద్మ అతడి అవస్థ చూసి జాలిపడి నెమ్మదిగా అంది "అమ్మ నిన్ననే కదండీ వెళ్లింది. అన్నీ ఉన్నాయి"

అతడికి ఆ క్షణంలో పద్మ దేవతలాగ కన్పించింది. ఆడపిల్లలు అంటే ఇలాగ నెమ్మదిగా మర్యాదగా ఉండాలి. ఊపిరాడనివ్వనట్లుంటే ఏం బావుంటుంది?

"మీ అమ్మగారు మా మంచి చెడ్డలు చూస్తున్నారు. మాకు ఉపాధి కల్పించారు. ఆవిడ లేనప్పుడు మీకు ఇబ్బంది ఉండకూడదని అడిగాను" అన్నాడు.

గిరిజ హేళనగా అంది "ఓహో! ఇప్పుడు మీరు మా మంచిచెడ్డలు అర్జెంటుగా చూసేసి మా అమ్మగారి రుణం తీర్చేసుకుంటారన్నమాట. అయ్యో పెద్ద దిక్కుగారూ! చాలా శ్రమపడ్డారు. ఈ జంతికలు కాస్త తింటారా? "

గిరిజ రెండు జంతికలు తీసి ప్లేటులో పెట్టింది. "మా దగ్గర ఉన్నాయండి. మీ అమ్మగారు ఇచ్చే వెళ్లారు" అంటూ అవి కొట్లో ఉండటం చూసి ఆశ్చర్యంగా అడిగాడు "వీటిని కొట్లో..."

"మీలాంటివారు ఎక్కువ ప్రశ్నలు వేసి అలిసిపోతారని అలుపు తెలియకుండా వీటిని ఉద్ధరిస్తారని పెట్టాం"

గిరిజ మాటలకు అతడు చిన్నబుచ్చుకున్నాడు. "అబ్బా... నాకు వద్దండి"

పద్మ చెల్లెలిని వారిస్తున్నట్లు చూసింది. తాము చేయదలచుకున్న పని అతడికి చెప్పింది "వెరీగుడ్... గుడ్ ఐడియా! మన స్వగృహ ప్రొడక్ట్సు ప్రస్తుతం మార్కెట్లో అడుగుపెట్టాయన్న మాట" అన్నాడు.

గిరిజ నవ్వుతూ అంది. "అయ్యో! పెద్దదిక్కుగారూ పేరు బావుంది. స్వగృహఫుడ్స్ అందాం." పద్మవైపు తిరిగి అంది. "అక్కా! పెద్ద దిక్కు అని అస్తమానూ అనలేంకదా! కనుక పి.డి.గారూ అందాం"

అతడు అక్కడ మరి నిలబడకుండా తమ ఇంటివైపు వెళ్లిపోయాడు. మనవడిని ఆటపట్టిస్తున్న ఆ పిల్లలను చూసి నాగమ్మ నవ్వుకుంది. "పిరికి సన్నాసీ. ఆడపిల్లల ఎదురుగా నిలబడి మాట్లాడలేవుకదా" అందామె మనవడితో.

"ఏదో కామాక్షిగారు చెప్పారని అడిగాను. ఎంత వేళాకోళం చేస్తోందో చూడు" అతడు ఫిర్యాదుగా అన్నాడు.

కాని ఆవిడ అతడినే సన్నసన్నగా చివాట్లు వేసింది. "ఎందుకు పనికి వస్తావురా నువ్వు. నలుగురిలోకి వెళ్లడం రాదు. మాట్లాడటం రాదు"

అతడు ఉడుక్కుంటున్నట్లు అన్నాడు "చాల్లే! నీకూ నన్ను చూస్తే నవ్వులాటగా ఉందా? "

ఆవిడ అతడిని చూస్తూ అంది "కామా క్షమ్మ వచ్చాక వాళ్ల పిల్లల ఆకతాయితనం చెపుతాను లేరా? "

అతడు గాబరాగా చూశాడు. "ఎందు కలా? పాపం చిన్నపిల్లలు. నేనేకదా అని ఏదో మాట్లాడారు. ఈమాత్రం దానికి ఆవి డకి రిపోర్టు చేయడం ఎందుకు? పెద్ద మ్మాయి మరీ సున్నితం. బాధపడుతుంది కూడా"

పుస్తకాలు పుచ్చుకుని తోటవైపు వెళ తున్న మనవడిని చూస్తూ 'వీడికి ఇన్ని విష యాలు ఎప్పుడు తెలిశాయి' అని విస్తుపో యింది.

నాలుగు రోజులలో వాళ్లు అన్నీ అమ్మే శారు. పద్మ నాగమ్మగారిని పిలిచి తను అనుకుంటున్న విషయం చెప్పి పాలకోవా, జంతికలు, వేరుసెనగ ఉండలు చేద్దామంది. ఆవిడ అలాగే అంటూ చేసిపెట్టింది. ఆనం ద్‌కి, నాగమ్మకి ఆ పిల్లల తెలివి తేటలు, ఆలోచన చూస్తే ముచ్చటవేసింది. నాగమ్మ వాటిని చేస్తోంటే పద్మ సాయం చేసింది. గిరిజ మాత్రం ఆనంద్ కనబడగానే "సింగి నాదం తెచ్చారా? పి. డి. గారూ? " అంటుంటే పద్మ చెల్లిని మందలించింది.

ఆనంద్ గిరిజ ఏడ్పిస్తోందని తన పని మాత్రం మానలేదు. ప్రతీరోజూ ఉదయం వచ్చి ఏమైనా కావాలా అని అడుగుతాడు. వాళ్లు కూరలు, అవీ తెంపుతుంటే సాయం చేస్తాడు. చేసిన ఐటమ్స్ ఎలా అమ్మితే లాభం వస్తుందో లెక్కవేసి చెపుతున్నాడు.

పద్మ ఆరోజు ఆదివారమని ఇల్లు కడ గటం పెట్టుకుంది. గిరిజ అక్క వెనకాల పాతగుడ్డ పట్టుకుని కడిగిన ఇల్లు వత్తు తోంది. ఆనంద్‌వచ్చి బయట నిలబడి అడి గాడు "నేనేమైనా మీకు సాయం చేయాలా? "

గిరిజకి అక్కగారు అన్ని గదులూ ఒక్క సారే కడగడం పెట్టిందని చిరాకుగా ఉంది. ఏ సినిమాకో వెళదామంటే అమ్మ లేన ప్పుడు వెళ్లకూడదు. అమ్మ వచ్చాక వెళదా మంటుంది. అమ్మలేదు కనుకనే బోరుగా ఉందని సినిమా ప్రపోజల్ పెట్టిందని తెలి సికోదు. పైగా చేతినిండా ఈ పనులు. అది చాలదన్నట్లు ఇతగాడు ఒకడు. ప్రతీ పనికి హాజరు.

"ఓ.. మహారాజులాగ చేయొచ్చు ఆ సుద్దముక్కలు నీటిలో తడిపి చక్కగా ముగ్గులు వేయవచ్చును. లేదా పక్కగది కడిగేసిందికదా అది నాలాగ పాతగుడ్డ పట్టుకుని నడ్డిపడిపోయేలాగ వత్తవచ్చును" అంది.

పద్మ గాబరాగా బయటికి వచ్చింది. "ఛ... ఛ... అతడికి అలాంటివి చెప్ప చ్చునా? "

గిరిజ ముందుకు పడిన జడలు రెండిం టినీ విసురుగా వెనక్కి వేసుకుంది. "మరి అతడు మాత్రం ఇలాగ ప్రతీ పని సమ యంలో వచ్చి మనమెదడు తినేయవ చ్చునా? అందుకే అలాంటివి నాలుగు పనులు చెపితే మరి మన పరిసరాలకి రాడులెమ్మనుకున్నాన్లే"

పద్మ అతడితో అంది "మాకు ఏం సహాయం కావలసివచ్చినా తప్పక మిమ్మల్ని అడుగుతాం. గిరిజా, పండూ కాస్త అల్లరి వాళ్లు. ఏమీ అనుకోకండి"

అతడు వెళ్లిపోయాడు. గిరిజ అక్కగారి వైపు బుంగమూతి పెట్టి చూస్తూ అంది "నేను అల్లరిదాన్నా"

"కావా? "

"బావుంది. అతడు ఎంత అమ్మ చెపితే మాత్రం అలాగ మనల్ని విసిగెత్తించాలా? స్వాతిముత్యంలో కమల్‌హాసన్‌లాగ ఒడ్డు పట్టుకుని లాగేస్తోంటే చిరాకేసి అన్నాను" అంది.

వెళ్లిపోతున్న ఆనంద్‌కి గిరిజ మాటలు, పద్మ మందలింపు వినబడుతూనే ఉన్నాయి. ఆంటీ వచ్చేలోపు ఈ పిల్ల ఇంకా ఎన్ని పేర్లు పెడుతుందిరా భగవంతుడా




అనుకున్నాడు.

ఇల్లంతా కడిగి, ముగ్గులేసి ఇద్దరూ భోజనాలకి కూర్చునే సమయానికి రాధాకృష్ణమూర్తి రిక్షాలోంచి దిగాడు. గిరిజ అక్కతో భయంగా చూస్తూ "ఇదేమిటి? ఈయనగారి అకాల ఆగమనం. అమ్మ కూడా లేదు. ఎలాగో" అంది.

పద్మ తండ్రికి ఎదురువెళ్లి ఆయన చేతిలోని బేగ్ అందుకుంది. గిరిజ తననితాను సంభాళించుకుని, చెంబుతో నీళ్లు అందించింది. ఇన్ని రోజులకి ఇంటికి వచ్చినందుకు ఎవరూ తనని ఏమీ అనకుండా ఒకపూటో, ఒకరోజో మౌనాన్ని ఆశ్రయిస్తారు ఆయన. వచ్చింది ఎవరో నాగమ్మకి అర్థమవలేదు. పిల్లలు చేస్తున్న మర్యాదలు చూస్తే ఎవరో బంధువేమో అనుకుంది. కదలక కదలక ఆవిడ కాలు బయట పెట్టడం, ఆ అదును లోనే అందరూ రావడమూనా అనుకుంది.

పద్మ మళ్లీ బియ్యం పడేసి చారు పెట్టింది. నాగమ్మ తను వండిన కూర, పచ్చడి తెచ్చి ఇచ్చింది. ఆయన స్నానం చేసి పద్మ వడ్డించిన భోజనం చేసి పడుకున్నాడు. భార్య ఏ కూరలకో బయటికి వెళ్లిందనుకున్నాడు. ఒకవైపు కామాక్షి వెంటనే తనని ఎదుర్కోనందుకు సంతోషపడ్డాడు. పిల్లల్ని క్లుప్తంగా క్షేమసమాచారాలడిగి, తను తెచ్చిన వాటిని అందించాడు. ఇంట్లో వచ్చిన మార్పులు ఆయనకి కొత్తగా అన్పించాయి. నాలుగు డబ్బులు అద్దె రూపంలో వస్తాయని భార్య బయటి గదులేసి ఇచ్చి ఉంటుందనుకున్నాడు.

తండ్రి పడుకున్నాక గిరిజ భోజనం చేస్తూ అంది. "రేడియో, టీ.వీ.ల్లో వాతావరణ సూచన అంటూ తుపానుల గురించి హెచ్చరిస్తారు. అలాగ నాన్నగారి రాక గురించి కూడా హెచ్చరిస్తే బావుండును" అంది.

పద్మ చెల్లి మాటలకి నవ్వింది. గిరిజే మళ్లీ అంది "అమ్మని చూడు. వెళ్లిన నాలుగోరోజే డాక్టరుగారింటికి ఫోను చేసి ఎలా మాట్లాడిందో? తన ప్రయాణం గురించి చెప్పి మనం ఎలా ఉన్నామో కనుక్కుంది. ఈయనేమో ఎక్కడున్నా పది రోజులకి ఒకసారి అయినా ఫోను చెయ్యవచ్చుకదా"

పద్మ "ఆయనింటికి ఆయన వచ్చారని మనం అనుకోవద్దా" అంది. గిరిజ ఫక్కుమని నవ్వింది. నాగమ్మ పిల్లల దగ్గరికి వచ్చి కూర్చుని "మీ చుట్టాలకి ఏం టిఫిన్ చేద్దాం తల్లీ!" అంది.

గిరిజ మళ్లీ పకపకా నవ్వింది. "ఆయన మా చుట్టాలు కాదండీ! రాజ మార్తాండ, రాజ గండరగండ శ్రీమాన్ రాధాకృష్ణమూర్తి నామధేయ మహా చిత్రకళాకారులు మా నాన్నగారు" అంది.

పద్మ చిరుకోపంగా చెల్లిని చూసింది.

"నాకేం తెలుసమ్మా! మేం వచ్చి ఇన్ని నెలలు అయినా ఆయన రాలేదుకదా! అందుకని తెలియక అన్నాను. ఏమీ అనుకోకండి"

పద్మ "అబ్బే ఇందులో అనుకొనేందుకేముందండీ" అంది.

పిల్లల నడిగి ఆయన నిద్ర లేచేవేళకి అరటికాయ బజ్జీలు వేసి ఇచ్చింది. పద్మ ఆయనకి టిఫిన్ పెట్టింది. ఆయన వాటిని తింటూ పిల్లల చదువుల గురించి అడిగారు. బయటివాళ్లు రావడం నాగమ్మ, పిల్లలు వాళ్లకి కావలసినవి ఇచ్చి రావడం ఆయన గమనిస్తూనే ఉన్నారు. ఇల్లు కూడా ఇదివరకటిలాగలేదు. అక్కడక్కడ కొత్త వస్తువులు కనబడుతున్నాయి. పిల్లలు చూస్తే తేటగా, చురుకుగా ఉన్నారు. ఆయనకి ఇంటి వాతావరణంలో ఏదో అస్పష్టమైన మార్పు తోచింది.

రాత్రి పద్మ భోజనం వడ్డించే వరకూ ఆయన భార్య ప్రసక్తి తేలేదు. ఆవిడ వచ్చే లోపు పిల్లలతో మామూలు స్థితికి రావాలనుకున్నారు. ఇంతసేపయ్యాక భార్య, కొడుకుల ఆరా కావలసివచ్చింది.



పద్మ ఎంతో ఆప్యాయంగా ఒద్దికగా వడ్డిస్తుంటే ఆయన మా పద్మతల్లికి వాళ్ల అమ్మ పోలికే వచ్చింది. ఎంత చురుకుగా పనులు చక్కబెడుతున్నదో అంటూ మురిసిపోయాడు.

"మీ అమ్మ వచ్చాక మీరు తింటారా?" అని అడిగాడు.

పద్మ ఇదే సమయమన్నట్లు "అమ్మ ఊళ్లో లేదుకదా నాన్నగారూ?" అంది.

ఆయన తెల్లబోయారు. "ఊళ్లోలేదా? ఎక్కడికి వెళ్లింది? మీ మావయ్య ఊరా?"

"కాదండీ కాశీ వెళ్లింది. సుబ్బమ్మ మామ్మ సాయం రమ్మంటే వెళ్లింది. పండు కూడా అమ్మతో వెళ్లాడు" పద్మ విషయం వివరించింది.

ఆయన తోక తొక్కిన తాచులాగ అయ్యాడు. "కాశీ వెళ్లిందా? ఎవరినడిగి వెళ్లింది. పసివెధవలను, ఆడపిల్లలను వదిలి వెళ్లిందా? ఇప్పుడు ఏం వయసు మించిపోయిందని ఊరేగి వెళ్లింది? అంతా ఆవిడిష్టమేనా? పదేసిరోజులు ఇల్లు వదిలి తిరిగితే ఇక్కడ ఎలా గడుస్తుందనుకుంది?" ఆయన నోటికి వచ్చినట్లు తిట్టసాగారు.

"పసివాడికి కాశీ ప్రయాణమా? పిచ్చెక్కిపోయిందా దానికి. ఇలాగ తిరుగుళ్లు మరిగితే పిల్లలు ఏమవుతారు?" ఆయన నోటికి అడ్డూఆపూలేకుండా పోయింది.

పద్మ ఇక ఊరుకోలేకపోయింది. అటు చూస్తే చెల్లెలు ఆయన చేస్తున్న ఆగడానికి వణికిపోతోంది. ఇటు నాగమ్మ గది బయట నిలువు గుడ్లేసుకుని చూస్తోంది.

"ఎందుకు నాన్నగారూ! అమ్మని అన్ని మాటలంటున్నారు? ఎందుకు తిడుతున్నారు? మీరు వస్తున్నారని ఆమెకి తెలియదు కదా! సుబ్బమ్మ మామ్మ మనకి ఎంతో సాయం చేసింది. చేస్తోంది. అమ్మ దారి ఖర్చులు వాళ్లే పెట్టుకుంటామన్నారు. అమ్మ రానన్నా బలవంతం చేశారు. అమ్మ ఎప్పుడైనా ఎక్కడికైనా వెళ్లిందా? మేం ఉండగలమని వెళ్లమని ధైర్యం చెప్పాం. అందుకే వెళ్లింది" అంది.

రాధాకృష్ణమూర్తి పెద్ద కళ్లు చేసుకొని పద్మవైపు చూశాడు. ఇది తన కూతురు పద్మేనా? ఎప్పుడు తనని చూసినా భయంతో పక్కకి తప్పుకునే తన పిల్లేనా?

ఆయనకి కోపం ఎక్కువైంది. ఎంతో మెత్తనిది అనుకున్న తన కూతురు పద్మ ఇలా అనడమా? ఆయన తీవ్రంగా అడిగారు "ఏం ఒళ్లు పొగరెక్కిందా? ఆ దరిద్రురాలిని వెనకేసుకుని వస్తున్నావు. ఆడముండలని చూసీచూడనట్లు ఊరుకొన్నాననా ఇన్ని వాగుతున్నావు? ఇల్లంతా బజారు లాగ చేసింది. ఆ కొట్టు ఏమిటి? ఆ కూరల బేరాలు ఏమిటి? ఇది మర్యాదస్తుల కొంపేనా? ఇల్లంతా దరిద్రం చేసిన దాన్ని రానీ పాతేస్తాను. దాని సంగతి తేలుస్తాను" అంటూ తింటున్న అన్నంలో చెయ్యి కడిగేసుకున్నాడు.

"అమ్మ దరిద్రురాలుకాదు నాన్నగారూ. తన పిల్లలని తానే కష్టపడి పోషించుకుంటున్న శ్రమజీవి. ఆవిడని ఒక్క మాట అన్నా మనకి పాపం వస్తుంది. అమ్మ బాధ్యతగానే ఉంది. మాకు తెలిసినప్పటి నుండీ మా కష్టం, సుఖం కోసం పాటుపడుతూనే ఉంది. కష్టపడటం, తన కుటుంబాన్ని తాను పోషించుకోవడం మర్యాద అనే అనుకుంటున్నాను"

అతను కోపం పట్టలేక తాగుతున్న మంచినీళ్ల గ్లాసు పద్మ మొహం మీదికి విసిరేశాడు. "దరిద్రపుదానా? నాకే ఎదురు జవాబులు చెపుతావా? నన్నే బాధ్యత లేని వాడినంటావా? నాలుగు రాళ్లు సంపాదించుకుంటున్నామని కొవ్వు ఎక్కినట్లుంది మీకందరికీ. ఫో.. అదొక గొప్ప తల్లి, నువ్వొక గొప్ప కూతురివి"

పద్మ మొహం పక్కకి తిప్పకపోతే గ్లాసు కళ్లకి వచ్చి తగిలేదే. ఇప్పుడు గ్లాసు అంచు వచ్చి పద్మ గడ్డం దగ్గర గట్టిగా తగిలింది.




గడ్డం దగ్గర చీలిపోయి రక్తం రాసాగింది. పద్మ గడ్డం దగ్గర కారుతున్న రక్తంవైపు చూసుకొంటూ అంది. "నేను గొప్ప కూతురిని కాకపోవచ్చును అమ్మ మాత్రం గొప్ప తల్లే నాన్నగారూ!"

గిరిజ ఏడుస్తూ అక్కగారిని చుట్టేసింది. "ఛీ.. మా అక్కని కొడతావా? అమ్మ ఏనాడూ మమ్మల్ని కొట్టి ఎరగదు. మీరు.. మీరు" అంటూ మరి మాటలు రాని దానిలాగ అక్కని చుట్టేసింది. నాగమ్మని కేక పెట్టి పిలిచింది. ఆవిడ గాబరా పడుతూ లోపలికి వచ్చి కాఫీ పొడి వేయబోతే ఆనంద్ ఆపేశాడు. అతడు ఒక గుడ్డ పట్టుకొచ్చి పద్మ గడ్డం దగ్గర అదిమి పట్టుకున్నాడు. గాయంలోతుగా తగిలింది. తల్లిని పిలిచి డాక్టరుగారి దగ్గరికి బయలుదేరమన్నాడు. గిరిజ ఏడుస్తూ వాళ్లని అనుసరించింది.

వెళ్లబోతున్న పద్మ తండ్రి తిన్న కంచంవైపు, చెల్లాచెదురైన పదార్థాలవైపు ఒకసారి చూసింది. పద్మకి కళ్లనీళ్లు తిరిగాయి. "అన్నం పరబ్రహ్మస్వరూపం. దాన్ని పవిత్రంగా చూడాలి" అనే తల్లి మాటలు గుర్తు వచ్చాయి. ఆనంద్ బలవంతం చేయగా గిరిజ, నాగమ్మలు తోడురాగా డాక్టరు దగ్గరికి వెళ్లింది.

పద్మకి గడ్డంపై నుండి కిందికి చీలిపోయింది. డాక్టరుగారు అడిగితే ఏమీ మాట్లాడలేదు. ఆయన తొమ్మిది కుట్లువేసి మందులు రాసిచ్చి పంపించారు. నాగమ్మ పాలు వెచ్చబెట్టి పద్మచేత బలవంతంగా తాగించింది. గిరిజకి దగ్గరుండి అన్నం పెట్టింది. ఆవిడ బలవంతంతో మజ్జిగన్నం తిని అక్క పక్కన పడుకుంది. ఆ ఇద్దరి పిల్లలను అలాగ చూస్తున్న నాగమ్మకి గుండె పిండినట్లయింది.

ఆవిడ రాధాకృష్ణమూర్తి దగ్గరికి వచ్చింది. "మీరు గొప్ప కళాకారులని మా కామాక్షమ్మ చెప్పింది. కళాకారుల మనసు వెన్నముద్ద లాంటిదంటారు. ఇదంతా బాగుందా బాబుగారూ? మేం వచ్చి ఇన్నాళ్లు అయింది. ఏనాడూ ఆ తల్లి బిడ్డలపై చెయ్యి చేసుకోవడం చూడలేదు. మగవాడిలాగ ఒళ్లువంచి నలుగురినీ మంచి చేసుకొని బతుకుతోంది. అదంతా ఎందుకు మీ గురించి ఒక్కమాట మాకు తెలియనీయలేదు. ఆ తల్లికి, ఆ బిడ్డలకి ఇపుడు చాలా గొప్పగా సాయం చేశారు బాబుగారూ? " అంటూ వెళ్లింది. రాధాకృష్ణమూర్తి రాయిలాగ నిలబడిపోయాడు.

ఆనంద్ ఆయన భోజనానికి కూర్చునే సమయంలోనే వచ్చాడు. వీధి అరుగుమీద కూర్చుని ఎప్పుడు ఖాళీ దొరికినా కబుర్లు చెప్పుకొనే ఆడవాళ్ళను చూశాడు. అత్తగారి మీద కోడలు, కోడలు మీద అత్తగారు చాడీలు చెప్పుకోవడం, ఇల్లు విషయం చూడని భర్తలను ఆడిపోసుకొనే భార్యలను చూశాడు. కానీ ఇలాంటి కష్టపడే కుటుంబాన్ని, ఆ కష్టాన్ని పెదవి విప్పి ఇతరులకు చెప్పని వ్యక్తులను ఇక్కడే చూశాడు.

ఆయన మాటలకి సమాధానం చెప్పే పద్మ ధైర్యం అతడికి ఆశ్చర్యం కలిగిస్తోంది. ఎప్పుడూ ఛలాకీగా తిరుగుతూ మాట్లాడే వ్యక్తి గిరిజ. అలాంటి పిల్ల తండ్రిని చూసి నోరు మెదపలేకపోయింది. పద్మసమాధానం, తల్లి యెడల పద్మకి గల గౌరవం, ప్రేమ ఆ పిల్ల మాటలలోనే తెలుస్తోంది. రక్తం కారుతున్న గడ్డం పట్టుకుని నిలబడిన పద్మ రూపమే అతడి కళ్ళ ముందు మెదులుతోంది. అతడు అన్యమనస్కంగా తిరుగుతూంటే మామ్మ ఆయనను కోప్పడటం వినిపించింది. ఆయన తిరగబడి ముసలమ్మని ఒకటి కొడితే...

అతడికి ఆ ఆలోచన రావడమే తడవుగా "మామ్మా! మనకి అప్పచెప్పిన పని మనం చేయాలి. మిగిలిన విషయాలలో కల్పించుకోకూడదు" అంటూ ఆవిడని ఇవతలికి లాగాడు.

"బావుందిరా నాయనా! ఆ తల్లి బిడ్డలను

జాగ్రత్తగా చూడమని అప్పచెప్పింది. రేపు వచ్చి ఇదేమిటి నాగమ్మా, నాబిడ్డకి ఈ అవస్థ ఎలా కలిగింది? అంటే నేనేం చెప్పగలనురా అయ్యా" ఆవిడ దీనంగా అడిగింది. ఆరోజు అందరూ అన్యమనస్కంగానే గడిపారు.

రాధాకృష్ణమూర్తికి చాలాసేపు నిద్రపట్టలేదు. తనేనా కూతురిపై అంత ఎత్తున ఎగిరినవాడు? తనేనా కూతురిని అలాగ కొట్టినవాడు. ఆడపిల్లలంటే ఎంతో అభిమానం తనకి. ఏనాడూ అన్నపిల్లలను, తమ్ముని పిల్లలను ఏమీ అని ఎరగనివాడు తన బిడ్డలను కూడా చిరాకు వేస్తే కళ్ళెర్రచేసి చూడటం తప్ప కొట్టలేదు. అలాంటిది ఈరోజు ఎందుకు ఇలా చేశాడు తను. ఆయన పడుకున్న పద్మ మంచంవైపు వచ్చాడు. పద్మ మాత్రల ప్రభావం వలన నిద్రపోతూ ఉంది. గిరిజ మాత్రం తుళ్లిపడి తాచుపాముని చూసినట్లు బెదిరి మంచం మీద కూర్చుంది.

ఆయనకి మనసు చివుక్కుమంది. తనతో దెబ్బలాడి టిఫిన్లు తెప్పించుకొనే పిల్ల, పువ్వులు కావాలని తల ఎగురవేస్తూ అడిగే గిరిజ తనని చూసి భయపడుతోంది. పద్మకి తన తల్లి అంటే ఇంత ఇష్టమా? ఇంత గౌరవమా? "నేను గొప్ప కూతురిని కాకపోవచ్చును. మా అమ్మ మాత్రం గొప్ప తల్లే" అన్న పద్మ మాటలు ఆయన చెవులలో వినిపిస్తున్నాయి. గొప్పతనమంటే పద్మ దృష్టిలో ఏమిటి?

కామాక్షి ఇంట్లో ఉంటే ఇలాంటి పరిస్థితి ఉండదుకదా! ఆమె ఎందుకు వెళ్లాలి?

తను మాత్రం ఇల్లు వదిలి వెళ్లడం లేదా? అతని అంతరాత్మ నిలదీసింది.

ఆమె అవసరమై వెళ్లింది. నువ్వు అవసరమనుకొనే తిరుగుతున్నావా?

ఆయన ఒక్క విదిలింపుతో అంతరాత్మ నోరుమూసేశాడు. 'ఆడది తిరిగి చెడింది. మగవాడు తిరక్క చెడ్డాడు' అంటారు. తన లాంటి ఆర్టిస్టు ఒక్క చోటే ఉండగలడా? ఆయన తననితాను ప్రశ్నించుకున్నాడు. తను రాగానే భార్య ఎదురుపడకపోవడం వలన కలిగిన అసంతృప్తితో తను ఇలాగ ప్రవర్తించాడా?

అతను నిద్రపట్టక తోటలో తిరగసాగాడు. ఎదురుగా ఆనంద్ గదిలో లైటు వెలుగుతోంది. ఆ క్షణంలో ఇంత జరిగినా ఒక్క మాటకూడా మాట్లాడని ఆ అబ్బాయి ఆయనకి గుర్తు వచ్చాడు.

చల్లటిగాలి ఆయన మనసుని సేద తీర్చింది. జాజిపువ్వులు విరిసి తీగ నిండా నక్షత్రాల్లాగ పరచుకున్నాయి. ఆకుల మధ్య అందంగా, సుకుమారంగా ఆ పూలు, పెరట్లోని ఆకు సంపెంగనుండి వస్తున్న సువాసనలు. అతను మైమరపుగా ఆ చుట్టుపక్కల చూశాడు. వెన్నెల పిండారబోసినట్లుంది. ఆ వెన్నెల్లో ప్రతీ మొక్కా, ఆకూ, పిందె, పూవు తడిసి ముద్దవుతున్నాయి. ఆ గాలిలో చల్లదనం, ఆ వెన్నెల్లో చల్లదనం, ఆ పూలలో చల్లదనం ఆస్వాదిస్తూ మొక్కల మధ్య సిమెంటు బల్లమీద కూర్చుండిపోయాడు. ఈ చల్లదనం, ఈ కాంతీ ఇంటి వాతావరణందా, లేక ఇల్లాలిదా?

అప్పుడే పెరుగుతున్న ఉసిరి లేత కొమ్మలను ఊపుతూ అటూ ఇటూ వంగుతోంది. గులాబీ మొగ్గలు, పూవులు చెట్టుని ఎక్కడా కన్పించనీయడంలేదు. ఎంత అందం? విరిసిన పూవులు, విరిసీ విరియని మొగ్గలు ఆ మొక్కలకే అందాన్ని కలిగిస్తున్నాయి. అతని మనసంతా చల్లదనంతో తడిసిపోయినట్లన్పించింది. అతని మనసు తన పెళ్లినాటి కొత్త రోజులని నెమరువేసుకుంటోంది.

ఎరుపు అంచుగల తెల్లటి గ్లాస్కో చీర, చిన్నచిన్న చెక్స్ ఉన్న తెల్లజాకట్టు, తలంటుకున్న నిడుపాటి జడలోని కురులు ఇమడలేమంటూ బయటికి దండయాత్ర చేస్తున్నాయి. చేతులనిండా గాజులు, కళ్లకి





సన్నటి కాటుకరేఖ, నుదుట చిన్న మంటలాగ కన్పిస్తున్న కుంకుమ. దోసగింజ ఆకారంలో పెట్టుకున్న ఆ బొట్టు ఆమెకి కొత్త అందాన్ని ఇచ్చింది. అతను కామాక్షిలో కన్పిస్తున్న అందానికి ముగ్ధుడయ్యాడు.

తెల్లటి దుప్పటిమీద అక్కడక్కడా తెల్లటి మల్లెలు. ఆయన తన చూపులకే ఆమె అందం వాడిపోతుందేమోనన్నట్లు చూశాడు. కామాక్షి ఆయన మనసుని గ్రహించిన దానిలాగ చిన్నగా నవ్వింది. విరిసీవిరియని ఎర్రగులాబీవంటి ఆ పెదవులను అతను తమకంగా చూశాడు.

"కామాక్షీ! నాకు నువ్వు ఈ రోజు చాలా అందంగా కన్పిస్తున్నావు. నిన్ను చూస్తూ ఇలాగ ఎంతసేపైనా ఉండిపోవాలన్పిస్తోంది"

నిజాయితీగా అంటున్న అతని మాటలను విని ఆమె ముందుకు నడిచి అతని పక్కన కూర్చుంది. ఒకపూల తీగ వయ్యారంగా తనవైపుకి ఒరిగినట్లు అన్పించిందతనికి.

"ఏవైనా కబుర్లు చెప్పు కామాక్షీ"

ఆమె ఆశ్చర్యంగా చూసింది. ఆయనే చెప్పవచ్చునుకదా! తనకు ఏముంటాయి? ఆయనకైతే ఆయన చిత్రాలు, ఆయన చూసిన లోకం, ఆయన ఆశలు, ఆశయాలు ఎన్నెన్నో!

ఆమె ఆలోచనలో పడినట్లు కూర్చున్న తీరే తెలిసిందతనికి. కాలితో చీర కుచ్చెళ్లను సున్నితంగా కదుపుతోంది. అప్పుడప్పుడు ఆమె పాదాలు, వాటి వేళ్లకి గల అందమైన మట్టెలు కన్పిస్తున్నాయి.

ఆమె ఒక నిర్ణయానికి వచ్చినట్లు మంచంపై కొద్దిగా వాలి "ఈ రోజు మా స్నేహితురాళ్ల గురించి చెపుతాను" అంటూ కళ్లు ఎత్తి అతనిపై చూపు నిలిపింది.

మంచంపై ఓరగా వాలిన ఆమె అందమైన శరీరం, పక్కకి తొలగిన జుట్టులో నుండి కన్పిస్తున్న చెవులకున్న చిన్న జుంకాలు, భుజంపైకి వచ్చి కొద్దిగా కన్పిస్తున్న జడలోని పువ్వులు.

అతను పరవశంగా ఆమె పక్కన వాలాడు.

"నాకు స్నేహితులంటే చాలా ఇష్టం" ఆమె తనలోతాను మాట్లాడుకుంటున్నట్లు నెమ్మదిగా చెప్పసాగింది. అతను ఏం వింటున్నాడో అతనికే తెలియదు. శరీరభాగాల్లో కళ్లు మాత్రమే పని చేస్తున్నట్లనిపిస్తోంది.

"అప్పుడు మా నీలిమ ఏం చేసిందంటే..." అంటూ చెప్పబోతున్న ఆమె అతణ్ణి చూసింది. ఏవిధమైన స్పందనా లేదు.

ఆమె తెచ్చి పెట్టుకున్న కోపంతో అంది "మీరు నా మాటలు వినడం లేదు. ఏదో ఆలోచనలో మునిగినట్లున్నారు. నేను పిచ్చి దానిలాగ అనవసరంగా వాగుతున్నాను"

అతను తన చూపుడు వేలితో ఆమె పెదవిపై రాశాడు. "ఇందాక నువ్వు నన్ను కళ్లెత్తి చూశావుకదా"

ఆమె చెప్పమన్నట్లు చూసింది.

"ఆ చూపులు మన్మథుడు ఎక్కుపెట్టిన వింటి బాణాల్లాగ ఉన్నాయి. ఆ చూపులకే నేను దాసోహం. ఇంక నాకు నీ మాటలు ఏం విన్పిస్తాయి"

ఆమె సిగ్గుగా తల వంచుకుంది. అతను నవ్వుతూ "నీలిమ... నీ స్నేహితురాలి పేరు బావుంది. ఆ అమ్మాయి కూడా ఆ పేరులాగే బావుంటుందా?"

ఆమె కళ్లల్లో చిరుకోపం. అతను నవ్వాడు.

"నా పేరు బావుండలేదా?" ఆమె ప్రశ్నించింది.

అతను రెండు చెంపలూ వేసికొని అన్నాడు "కంచి దేవత పేరుగదా! ఏమన్నా అనే ధైర్యమా నాకు?"

ఆమె అతని అభినయానికి నవ్వింది. నవ్వుతున్న ఆ మోమును తమకంగా




చూస్తూ ఆమెని చేరాడతను.

ఏనాటి సంఘటన ఇది! ఇంకా ఇంత పదిలంగా ఈ గుండె లోతుల్లో దాగి ఉందా? అతను ఆశ్చర్యపడ్డాడు. వదిన గారు అప్పుడప్పుడూ అనే మాటలు గుర్తుకొచ్చాయి.

"ఏం భార్యాభర్తలో? గట్టిగా ఒకమాట కూడా రాత్రిళ్లు వినబడదు. అవునమ్మా కామాక్షీ! మీకిద్దరికీ మాటల అవసరం లేదా?"

భార్య ఫక్కుమని నవ్విన శబ్దం. రెండు క్షణాలు గడిచాక "కళాకారునితో కాపురం. ఇలాగే కళాత్మకంగా ఉంటుంది"

వింటున్న తనకే ఆ సమాధానానికి నవ్వు వచ్చింది.

ఆవిడ బుగ్గమీద ఆశ్చర్యంగా చెయ్యిపెట్టుకుని "ఎంత కళాకారుడైతే మాత్రం అంత మాటామంతీ లేకుండా గడపడం ఎంత కష్టం" అనడం తను వింటూనే ఉన్నాడు.

అతను గిరిజ దగ్గువలన ఈ లోకంలోకి వచ్చాడు. ఆ క్షణంలో భార్యని చూడాలన్న కోరిక తాటిచెట్టు ప్రమాణంలో అన్పించింది. చూడలేని తన అశక్తకి చెప్పలేని నీరసం ఆవహించింది.

మర్నాడు బాగా పొద్దెక్కాక ఇంట్లోని గలాటాకి అతను నిద్రలేచాడు. ఎవరెవరో ఆత్రుతగా పిల్లలను ఏవేవో అడుగుతూ కన్పించారు. ఆచారిగారు పద్మ తల నిమురుతూ "ఇంత దెబ్బ తగిలితే రాత్రి మాకు కబురు పెట్టవద్దా? ఏం పిల్లలమ్మా మీరు?" అంటున్నారు. పద్మ తరఫున నాగమ్మ వాళ్లతో మాట్లాడుతోంది.

వాళ్లందరూ పిల్లలపై చూపించే ఆ శ్రద్ధ, ప్రేమ ఆయన దృష్టిని దాటిపోలేదు. లెక్చరర్‌గారు అన్నారు "చూడు పద్మా! మీ అమ్మగారు మాకు ఏ చిన్న ఆపద వచ్చినా 'అవసరం వచ్చినా కన్న తల్లిలాగ వచ్చి ఆదుకుంటారు. ఆ తల్లి బిడ్డలైన మిమ్మల్ని చూడటం మా ధర్మంకదమ్మా! మీరు ఏ చిన్న సహాయం కావలసి వచ్చినా అడగాలి. తెలిసిందా?"

పద్మకి కళ్లనీళ్లు తిరిగాయి. "అలాగేనండీ" అంది.

అతను వాళ్లందరూ వెళ్లేంతవరకూ ఇవతలికి రాలేదు. "వాళ్ల నాన్నగారు వచ్చారండీ" అన్న ఆనంద్ మాటలను విన్నాడు. అతనికి ఎప్పటి సంఘటనో ఒకటి గుర్తు వచ్చింది. వీళ్లు ఉండే వీధి చివరనున్న టైపిస్టు భార్యకి ఎబార్షన్ అయిందంటే కామాక్షి వెంటనే వెళ్లి రెండు మూడు గంటలు వాళ్ల ఇంట్లోనే ఉండిపోయింది.

తనకి చాలాకోపం వచ్చింది. ఇంటికి రాగానే ఛడామడా తిట్టాడు. కామాక్షి ఆ తిట్లని ఏమీ పట్టించుకోకుండా జవాబిచ్చింది.

"బావుందండీ! పాపం ఆయన ఏం చేయాలో తెలియక కంగారుపడ్డారు. బాబుకి అన్నంపెట్టే సమయం. అందుకే ఆవిడకి కావలసినవి అందించి బాబుకి అన్నంపెట్టి వచ్చాను. మనుష్యులమన్నాక ఒకళ్లకి ఒకళ్లం ఆపదలో, అవసరంలో సాయం చేసుకోకపోతే ఎలాగ?"

ఆ సాయంత్రం, మర్నాడు వాళ్లకి తమ ఇంటినుండే కూరలు, పచ్చళ్లు వెళ్లాయి. తను ఇల్లంతా గుల్ల చేస్తోందని ఎగిరాడు. ఆమె సన్నగా నవ్వుతూ "మీకు చెప్పినా అర్థమవదు. మానవులు సంఘజీవులు. ఇచ్చిపుచ్చుకోవడమే మానవత్వం"

"ఏవిటీ కూరలూ పులుసులూనా?" అని తన హేళన.

"కావండీ! ప్రేమాభిమానాలు, ఓదార్పు మాటలూను" ఆవిడ జవాబు.

మరో సందర్భంలో "పశువుకి తిన్నదే బలం. మనిషికి ఉన్నదే బలం. మనిషికి తనవాళ్లు, తనది అనే ప్రపంచం ఉండాలి. ఏమిటో ఈయనకి ఏ విషయమూ తెలియదు" అందావిడ.

గిరిజ ఆ పూట ఆయనకి కావలసినవి



అందించింది. అతను పద్మ దగ్గరగా వచ్చి చూసి వెళ్లాడు ఏమీ మాట్లాడకుండా.

వెళుతున్న తండ్రిని చూసి "ఏం కావాలి నాన్నగారూ? " అని అడగగానే అతను తడబడ్డాడు. చెల్లిని పిలిచి ఆయనకి కావలసినవి చూడమంది. "హోటల్‌కి వెళ్లి టిఫిన్ తెచ్చుకుందామా" అని అడిగితే నాగమ్మగారు దోసెలు పోస్తున్నారని చెప్పింది గిరిజ.

అతనికేం చేయాలో తోచలేదు. ఆ పిల్లలు ఏదీ అడగరు. ఒక డబ్బు కావాలనరు. ఒక వస్తువు కొనుక్కోవాలని అనరు. "నేను బజారుకెళ్ళి పద్మకి హార్లిక్స్ పట్టుకుని వస్తా"నన్నాడు.

"ఆనంద్ మందులతోపాటు రాత్రే తెచ్చేశాడు నాన్నగారూ! వచ్చే నెల కూడా మనం కొనుక్కోనక్కరలేదు" గిరిజ నవ్వుతూ చెప్పిన సమాధానం అతనికి ఏదో చెప్పలేని చిరాకు, అసంతృప్తి కలిగించింది. ఇంటికి వచ్చిపోయేవారిని చూసి చిరాకు పడటం మొదలుపెట్టారు.

"మేం పుట్టిన వంశాలు ఎంత గొప్పవి. అలాంటి ఇళ్ళల్లో పుట్టి ఇలాగ పచ్చళ్ళు, చెగోడీలు అమ్ముకోవడమా? తమ చుట్టాలకి తెలిస్తే ఎంత తలవంపు? అయినా ఇదేంబుద్ధి? తాను బతికి ఉన్నాననుకుందా? లేక చచ్చాననుకుందా? "

పద్మకి, గిరిజకి తల్లి ఇలాంటి మనిషిని ఎలా భరిస్తోందా అన్పించింది.

పద్మ ఆయనతో ఇంక గొడవ పెట్టుకోదలుచుకోలేదు. రెండు చేతులూ మోగితే కదా చప్పట్లు అవుతాయి. ఆయన ఏంమాట్లాడినా పట్టించుకోకూడదనుకుంది.

అతను హేళనగా అడిగాడు, "ఇవేనా? మీ అమ్మ ఇంకా ఏ బట్టలమూటో నెత్తిన పెట్టుకుని ఊరేగుతూ అమ్ముతోందా? "

పద్మకి ఆ హేళన భరించలేనంతగా అన్పించింది. అమ్మ చేసే ప్రతీపనీ ఈయనకి ఎందుకు చులకన? అందరి ఆడవాళ్ళలాగా ఆయన పాదాలు కడగకుండా, ఎప్పుడు వస్తే అప్పుడు వచ్చి ఇచ్చే డబ్బుపై ఆధారపడకుండా స్వంతంగా బతుకుతోందనా?

"అయ్యో! నాయనా! ఆ అమ్మ తన కష్టమే నమ్ముకుంది. చిట్‌ఫండ్స్ నడుపుతుంది. ఆడదైనాసరే ఒక్కమాట రాకుండా ఎంత బాగా నడుపుతోందో? నాలాంటివాళ్లకి ఇంత ఆసరా ఇస్తోంది"

నాగమ్మ అమాయకంగా అన్నమాటలకి అతను పళ్ళు నూరుకున్నాడు. పిల్లలు ఒకరిమొహాలు ఒకరు చూసుకున్నారు. నాలుగురోజులు గడిచాక కాకినాడలో పనుందంటూ బయలుదేరాడతను. తల్లి ఇంక వచ్చేస్తుందని పిల్లలు చెప్పినా విన్పించుకోలేదు. తాను వేసిన ఐదారు చిత్రాలు తీసుకొని వెళ్ళడంమాత్రం మరిచిపోలేదు.

అతని పద్ధతి చూసి నాగమ్మ ముక్కుమీద వేలేసుకుంది.

ఏంమనిషి? రెండురోజుల్లో పెళ్ళాం వస్తుందన్నా విన్పించుకోకుండా వెళ్ళిపోయాడు. ఈయనతో ఏది మాట్లాడినా తప్పులాగే ఉంది అని గొణుక్కుంది. పద్మకిప్పుడు అందరి ప్రవర్తనలూ అర్థమవుతున్నాయి. అందుకే తండ్రి వెళతానంటే మౌనంగా ఉండిపోయింది.

అనుకున్నట్లుగానే యాత్ర ముగించుకుని కామాక్షి అందరితో కలిసి ఊరుకు చేరింది. పండుకి అక్కలను చూడాలని ఎక్కడలేని ఆత్రుత. రిక్షాలోనుండి గబుక్కున దూకేశాడు.

కామాక్షి వెనకాల సామాన్లు తీసుకొనివస్తోంది. పద్మను చూడగానే పండు గట్టిగా అరిచేశాడు. "అమ్మా! పద్మక్క గడ్డంకి పెద్ద దెబ్బ తగిలిందే"

కామాక్షి సామాన్లు అలా వదిలేసి పరుగున వచ్చింది. పిల్లలిద్దరూ తల్లిని బల్లుల్లాగ అంటుకుని పోయారు. సామాన్లు పట్టుకుని వస్తున్న నాగమ్మ జరిగిన విషయ





మంతా వివరించింది.

"అరే! ఆయన అంతపని చేశారా?" కామాక్షి రుద్ధకంఠంతో అడిగింది. ఆవిడ పద్మను ఒడిలోకి తీసుకొని తల నిమరసాగింది. బిడ్డ ఎంత ఓర్చుకుంది. పెదవి విప్పి తన మనసులోని విషయమైనా ఏనాడూ చెప్పని బిడ్డను అలాగే చేస్తారా? ఆవిడ చేతులలో మొహం దాచుకుంది. పద్మ ఆవిడని అనునయిస్తూ తనకి ఏమీ అవలేదనీ, చాలా చిన్న దెబ్బ అని చెప్పినా ఆవిడ ఏడుపుని సంభాళించుకోలేకపోయింది.

భర్తని కోపంతో తిడుతుందేమోననుకున్న నాగమ్మ ఊహ ఊహే అయింది. "మనం చాలా దురదృష్టవంతులం" అంటున్న కామాక్షిని వారిస్తూ నాగమ్మ అంది, "మీరంతా అదృష్టవంతులు కనుకనే బిడ్డకి కళ్ళకి తగలలేదు. లేకపోతే కళ్ళే పోయేవి"

అదీ నిజమేననిపించింది.

గిరిజ "అమ్మా! నీకు ఒకటి చూపిస్తాను. ఒకటి చూపిస్తాను అంటూ మురిపించి, మురిపించి చివరికి తాము చేసిన ఘనమైన పని చెప్పింది. ఆలోచన అక్కది, ఆచరణ నాది అంటూ దానివలన వచ్చిన డబ్బు చూపించింది. ఆవిడ ఆశ్చర్యానికి అంతు లేదు. పద్మతల్లిది అంతా నా జాగ్రత్తే అంటూ మురిసిపోయింది. దాన్ని అభివృద్ధి చేస్తానని తల్లి అనేంతవరకూ వాళ్ళు వదల లేదు.

★ ★ ★

రుతువులు మారిపోతూ ఉంటాయి. రుతుధర్మాలు, మార్పులూ సహజమే. స్వశక్తిపై ఆధారపడితే వచ్చే ఆనందం అనుభవించకనే పోవాలి. అనుభవించాక దాన్ని వదులుకోవడానికి ఎవరూ ఇష్టపడరు.

కామాక్షి సంగతి అలా ఉంటే, శ్రీరామ్ వచ్చినప్పటినుండీ ఒకటే గొడవ. "మీ వదినతో పడలేకపోతున్నాను. ఇంక ఓర్చుకోవడం నావల్లకాదు. దానికి విడాకులు ఇచ్చేస్తాను" అని. అతనా మాటలనడం అది ఎన్నవసారో? కామాక్షి నవ్వింది. "వదినని చూసి ఈ మాటలు చెప్పరా?" అంది.

శ్రీరామ్ మరింత మండిపడ్డాడు. "ఏమిటే... ఏమిటా నవ్వు. ఏదో తోడబుట్టిన దానివి కదా అని బాధ వెళ్ళబోసుకుంటే, ఉపశమనం కలిగించకపోగా నవ్వా? నిన్ను చూసైనా అది నేర్చుకోవద్దా?" అన్నాడు.

కామాక్షి నవ్వాపుకుని, "నన్ను చూసి ఏంనేర్చుకోవాలిరా?" అని అడిగింది.

"నువ్వు నీ కాళ్ళపై నిలబడి ఎలా బతుకుతున్నావో అలా తనూ కష్టపడవచ్చు కదా? అబ్బే... అదేంలేదు. ఎంతసేపూ పిల్లలను చావగొట్టడం, నాపై పడి ఏడవడం

"నువ్వు చూడు బావ ఇంటి విషయం వదిలేసినా ఎలాగ దిద్దుకొచ్చావో, పద్మని డిగ్రీ చదివిస్తున్నావు. చిన్నదాన్ని టీచర్ ట్రైనింగ్‌కి పంపించావు. పిల్లాడిని డాక్టరు చేస్తానంటున్నావు"

కామాక్షి చెయ్యి పట్టుకుని ఆపాడు. "కాసేపు ఆ జాకట్టు కుట్టుకోవడం ఆపవే బాబూ. కళ్ళు కాస్తా పోగలవు. యంత్రం లాగా ఎంతకని కష్టపడతావే?"

కామాక్షి నవ్వింది. "బావుందిరా పండుగ దగ్గరికి వస్తోంది. పిల్లలకి జాకట్లు అమర్చవద్దా?"

"అందరికీ అన్నీ అమర్చావు. చాల్లే, కాస్త విశ్రాంతి తీసుకో. పెద్దదానికి అలాగ పెద్ద చదువు చెప్పిస్తూ చిన్నదాన్ని ఇలాగ ఇంటర్‌తో ఆపించడం నాకు నచ్చలేదు?"

కామాక్షి అన్నగారివైపు చూసింది. "ఏంచేస్తాంరా? వంశపారంపర్యంగా వచ్చే లక్షణాలు కొన్ని ఉంటాయి. మేనమామవి కదా! వినకపోయే పోలిక నీదే దానికి వచ్చింది"

"బావుందే ఉరుము ఉరుమి మంగలం మీద పడిందట. అలాగుంది. నేనేం



మొండిపట్టు పట్టాను" అని గోలపెట్టాడు.

"ఉద్యోగం చెయ్యనన్నావు. అలాగే మానే శావు. వ్యాపారం పాడుచేస్తానన్నావు. అలాగే చేశావు"

కామాక్షిని అతడు "స్టాప్... స్టాప్" అంటూ ఆపాడు. "అది ఊరికే చిరాకుపడి మీ వదినని ఏడ్పించడానికి అన్నానే! అది కాస్తా నిజమై కూర్చుంది"

కామాక్షి పాఠం నేర్పుతున్నదానిలాగా అంది.

"అందుకే అందరి గురించీ మంచే పల కాలి. పైన తథాస్తు దేవతలుంటారురా! చిన్నది పై చదువులు ప్రైవేటుగా చదువు కుంటుందిట. టి.టి.సి. అయ్యాక ఉద్యోగం చేసుకుంటూ చదువుతుందిట. అమ్మకి శ్రమ తగ్గిస్తుందట. పద్మ ఏనాడూ నామాట కాదనలేదు. బి.యస్.సి. చదువు తోంది. ఇది అయితే బి.ఇడి. అవుతుంది. ఈ పిల్లలు ఒకదారికి చేరితే నేను ఏమైపో యినా ఫర్వాలేదురా"

శ్రీరామ్ ఆమె దగ్గరగా వచ్చాడు. "వద్దే... అలాగ మాట్లాడకు. నీ పిల్లల అభి వృద్ధిని చూడవద్దా? వాళ్ళు సంపాదించి తెస్తోంటే అప్పుడు సుఖంగా ఉండవచ్చు"

కామాక్షి బరువుగా నవ్వింది. ఆ నవ్వులో ఎన్నో కష్టసుఖాలున్నాయి. ఎన్నో ఒడిదుడు కులున్నాయి. అతడు నిష్ఠూరంగా అన్నాడు. "బావగారు మరి మారరా? "

కామాక్షి అతడివైపు నిశితంగా చూసింది. "బావగారు ఇప్పుడు, అప్పుడు బాగానే ఉన్నారుకదురా! ఇంకా మారడం ఏమిటి? ఆయనేమైనా చెడిపోయారా నీలాగ"

అతడు ఆమెని కోపంగా చూశాడు. "ఇల్లు, పిల్లలు, నిన్నూ పట్టించుకోని ఈయన తిరుగుళ్ళని ఎలా భరించడం. ఎన్నాళ్ళకి మారతారు? "

ఆమె శూన్యంవైపు చూస్తూ అంది, "కొందరు జీవితమంతా మారరురా! వాళ్ళవ లన మనం మొదట్లో పొందిన బాధలాగా ఇప్పుడుండదు. బాధ అలా అలవాటైపో తుంది"

అతడు ఆ మాటలలోని వ్యథకి బాధప డ్డాడు. తనకి బుద్ధిలేదు. ఏదో అవాకులూ, చవాకులూ వాగి ఆమెను బాధపెడతాడు. అలా అనుకున్నాక వచ్చిన పని చెప్పే ధ్యాసలో పడ్డాడతను. "బావగారు క్రిందటి నెలలో గుంటూరులో కన్పించారే! నాతో పాటు మా అత్తవారివైపు వాళ్ళ ఇంట్లోనే ఉన్నారు. గుంటూరులో ఆయనకి ఒక శిష్యుడు దొరికాడులే! వాడికి మన పద్మని స్తానని అన్నారు. అదే నీ చెవిని వేద్దామని వచ్చాను. వాడు పదవతరగతి పాసవలేక వదిలేశాడు. ఏవో భూములు, డబ్బు ఉన్నా యట. వాడికి బావగారు వేసిన బొమ్మలు చూస్తే ఈ కళ నేర్చుకోవాలన్పించిందట. తల్లిదండ్రులకి ఒక్కడే కొడుకు"

కామాక్షి శిలాప్రతిమలాగా ఉండిపో యింది. చరిత్ర పునరావృతమవుతోందా? భర్త గట్టిగా అనుకున్నాడంటే ఆ పనిచేసి తీరతాడు. తన జీవితంలాగా పిల్లల జీవి తాలు కాకూడదు. అందుకు ఏ మూల్యా మైనా తను చెల్లిస్తుంది.

శ్రీరామ్ చెప్పవలసిన విషయాలు చెప్పి ఆ పూట ఉండి వెళ్ళిపోయాడు. కామాక్షికి ఏమీ తోచడంలేదు. అతడి మాటలవైపే దృష్టి వెళుతోంది. ఆయనకి వాళ్ళింట్లో ప్రస్తుతం రాజభోగాలు అమరుతున్నాయి. ఆయన వాళ్ళకి ఎన్నో విషయాలు చెప్పా రుట.

ఆయనకి విశాలమైన మనసుందిట. అందుకే భార్యని గిరిగీసి కూర్చోపెట్టక అన్నివిధాలుగా ప్రోత్సహిస్తున్నాడుట. ఈ ఊర్లో తనకి ఉన్న పరపతి వలననే భార్య, పిల్లలు హాయిగా బతకగలుగుతున్నారుట. అతడి కబుర్లు కొత్తవాళ్ళకి ఎంత తీయగా నిజంగా ఉంటాయో ఆమెకి బాగా తెలుసు. తాము ఎంతోకొంత డబ్బు సంపాదించడం వెనుక ఆయన కీర్తిప్రతిష్ఠలు, పరపతి ఉన్నా





యిట.

కామాక్షిలో అసహనం రేగింది. "ఈ కబుర్లకేం? నిజమేమిటో తన చుట్టుపక్కల వారికి, తనకి, ఆ భగవంతుడికి తెలుసు. ఇప్పుడు నాలుగురాళ్ళు సంపాదించుకుని, స్థిరపడతామనుకుంటున్నవేళ తమని మళ్ళీ దారి మళ్ళిస్తున్నాడు. ఆయనకి నచ్చినవాళ్ళు ఆయనలాగే ఉంటారు" అనుకుంది.

పద్మ "ఎందుకమ్మా అనవసరంగా బాధ పడతావు. నీమాట దాటి నేను దేనికీ అంగీ కరించను" అన్నా ఆమె మనసు శాంతించ లేదు. వెంటనే రమ్మనమని గిరిజకి ఫోన్ చేసింది. పిల్లల్ని ముగ్గురినీ కూర్చోపెట్టు కుంటే ఆవిడకి ఎంతో ధైర్యం వచ్చింది. "మరో నెలలో పరీక్షలైపోయాక వస్తాను కదమ్మా! కంగారెందుకు" అంది. ఆవిడ బేలగా గిరిజని చూసి విషయం చెప్పింది.

గిరిజ పద్మవైపు చూసింది ఏమిటన్నట్లు! "అమ్మకి ఎందుకో నా విషయంలో భయం పట్టుకుందే! నాన్నగారు నన్ను తిట్టి మెడలు వంచైనా పెళ్ళి జరిపిస్తారని అనుకుం టోంది. అది జరగని పని" అంది పద్మ.

"అమ్మా! ఆయన నీకు వ్యతిరేకంగా ఏమీ చేయలేరు. మనల్ని, ఇంటిని తన చెప్పుచే తల్లో పెట్టుకోవడానికి ఈ విధంగా ఆలోచి స్తున్నారేమో! అయినా అక్కకీ, నీకు ఇష్ట మైతే నీ వీరభక్తుడు ఉన్నాడుకదా! ఆయ ననే అడగండి. ఇష్టమేనంటే పెళ్ళి జరిపిం చేద్దాం" అంటూ పద్మను చూసి కన్నుగీ టింది.

కామాక్షికి ఈ సలహా నచ్చింది. ఆనంద్ ఇప్పుడు బి.యిడి. టీచర్‌గా పనిచేస్తు న్నాడు. పిల్లవాడు బుద్ధిమంతుడు. తమ పరిస్థితులు తెలిసినవాడు.

మొదట పద్మ అభిప్రాయం ఆవిడ తెలు సుకోదలచింది. అయినా ఆనంద్‌కి ఏంత క్కువ? బంధుబలం లేనివాడన్న విషయం తప్పిస్తే వంక పెట్టడానికి ఏమీలేదు.

పద్మకి ఆనంద్ అంటే ఇష్టమే. అతడు, అతడి ప్రవర్తన, చదువుయందు శ్రద్ధ అన్నీ పద్మ గుర్తించింది. పండుగాడు కూడా నా ఓటు ఆనంద్‌కే అన్నాడు. "ఆయన ఎప్పుడూ మనకి ఆత్మీయుడే. ఇప్పుడు ఫ్రెండ్. పెళ్ళైతే బావ అవుతాడు" అన్నాడు. ఆనంద్‌కి రాజమండ్రిలో బి.యిడి. ట్రైనింగ్ సీటు వచ్చింది. వెళ్ళేటప్పుడు ఎంతో బాధప డ్డాడు. నాగమ్మ అతడితో వెళదామను కున్నా అతడు ఒప్పుకోలేదు.

కామాక్షి తన వ్యాపారం బాగా ఊపు అందుకున్నాక ఆవిడకి డబ్బు మరికాస్త ఎక్కువ ముట్టచెప్పసాగింది. ఇద్దరు మను ష్యులు. ఏం ఖర్చు ఉంటుంది? ఎక్కువ డబ్బు బాంక్‌లోనే ఉంచేశారు. మామ్మ, మనవడు ఇద్దరూ పొదుపే. గిరిజ అందుకే అతడికి "పీనాసిగొట్టు ఆనందయ్య" అని పేరు పెట్టింది. 'ముద్దపప్పు', 'చలిమిడి ముద్ద' ఆ పిల్ల పెట్టిన పేర్లే. అతడు నవ్వి ఊరుకునేవాడు. పండు మాత్రం దెబ్బలాడే వాడు.

కామాక్షికి కూతురి అభిప్రాయం అర్థ మైంది. ఇన్నాళ్ళూ తమతో కలిసి ఉన్నా అతడు ఏ చనువూ తీసుకోలేదు. ఇంటికి డాబా వేస్తోంటే ఎంతో సాయంగా నిలబ డ్డాడు. అతడి సలహాతో ఇంటిముందు ఎడ మవైపు షాపులాగా కట్టారు. ఇప్పుడు ఇల్లు ప్రశాంతంగా ఉంది. అలా అతడు తమకి ఎలా ప్రతీ విషయంలో సహాయపడిందీ అన్నీ గుర్తు రాసాగాయి.

కామాక్షి నాగమ్మకు ఏ ఉపోద్ఘాతాలూ లేకుండా విషయం వివరించింది.

"ఏ సంబంధాలూ లేకుండా పరిచయాలు పెరగవు. మీకు, మాకు ఏ జన్మాంతర అను బంధాలో ఉండి ఉంటాయి. ఇద్దరం జీవి తాన్ని కాచి వడపోసినవాళ్ళం. ఇద్దరికీ పిల్లల శ్రేయస్సే ముఖ్యం. ఇప్పుడు నా కుటుంబ సభ్యులుగా కూడా అనుబంధం ఏర్పరచుకోమని అడుగుతున్నాను. ఏనాడో నా కుటుంబానికి దగ్గరగా వచ్చారు. కను

కనే ధైర్యంగా ఈ కోరిక కోరుతున్నాను" అంది కామాక్షి.

నాగమ్మ లేచి పద్మ దగ్గరికి వచ్చింది. "ఇంత బంగారు తల్లి నా మనవడి చెయ్యి పట్టుకుని వస్తానంటే నేను ఎంత అదృష్ట వంతురాలిని. నా దినం ఈ పద్మతల్లి చేతిలో నిశ్చింతగా తీరిపోతుంది" అంటూ బుగ్గలు పుణికింది.

కామాక్షి మనసు తేలికపడింది.

ఆనంద్‌ను అడగడానికి తనే బయలుదేరింది కామాక్షి. "వాడు మీ చేతిలోని పిల్లవాడు. మీరు రమ్మంటే వచ్చి వాలవలసిందే! మీరు శ్రమపడి వెళ్ళడం ఎందుకు?" అని నాగమ్మ గోలపెట్టినా కామాక్షి వినలేదు.

ఇప్పుడు అతడు పెళ్ళికొడుకు. తాను ఆడపిల్ల తల్లి. అతడి గౌరవం కాపాడవలసిన బాధ్యత తనమీద ఉంది. ఆవిడ నాగమ్మని రమ్మనమన్నా రాలేదు. నా మనసు, నా మనవడి మనసు, మాట ఒకటే అంది. మనవడి పట్ల ఆవిడకి గల నమ్మకం పిల్లలకి నచ్చింది. చదువంటే పుస్తకాలలో ఉన్నదేకాదు. మనుష్యులను, మనసులను చదవగలిగే ఈ సంస్కారం గొప్పదని పద్మ అనుకుంది.

సాయంత్రం స్కూలునుండి వస్తున్న ఆనంద్ తన కళ్ళను తాను నమ్మలేకపోయాడు. గబగబా వచ్చి కామాక్షికి నమస్కరించి, "ఎప్పుడు వచ్చారమ్మా" అన్నాడు. అతడు ఒక్కొక్కసారి ఆంటీ అని, ఒక్కొక్కసారి పండుతోపాటూ "అమ్మా" అని అనేవాడు. కామాక్షికి రెండు పిలుపులూ ఒక్కలాగే అన్పించేవి. అతడు కామాక్షికి సదుపాయాలు చేయడానికి హైరానా పడసాగాడు. కామాక్షి తను తెచ్చిన ముద్దకోవా అతడికి పెట్టింది. చక్కిలాలు అన్నా, ముద్దకోవా అన్నా అతడికి ఇష్టం. అతడు వద్దన్నా వినకుండా ఇద్దరికీ కాఫీ తనే కలిపింది.

సాయంత్రం ఇద్దరూ డాబాపైకి వెళ్ళారు. డాబా చాలా విశాలంగా ఉంది. కామాక్షి దూరంగా కన్పిస్తున్న దేవాలయం చూసి నమస్కారం చేసింది. తరువాత ఆనంద్ వైపు చూస్తూ అంది.

"నేను ఎందుకు వచ్చానా అని తర్జనభర్జన పడుతున్నావు కదూ. నీతో పని ఉండి వచ్చానయ్యా" అంది.

ఆనంద్ ఆమెవైపు తిరిగాడు. "పనుందని కబురుపెడితే నేనే వచ్చేవాడిని కదమ్మా. మీరు శ్రమపడి ఇంతదూరం రావాలా?" అన్నాడు.

కామాక్షి నవ్వింది. "ఇదొక శ్రమా? అయినా ఇలాంటిపనికి వచ్చేముందు శ్రమపడాలిలే"

ఆవిడ మాటలు అతడికి అర్థమవలేదు.

"ఆనంద్! పెళ్ళైన దగ్గర్నుండీ ఆటుపోట్లు అనుభవిస్తూనే ఉన్నాను. నిశ్చింతలేదు. నాకు జీవితంలో నిశ్చింత ప్రసాదిస్తావా? నా పద్మతల్లిని చేసుకొని నాకు అల్లుడిగా కాదు మరొక పండుబాబులాగా రాగలవా?

"పద్మను నీలాంటి మంచివాడికిచ్చి వివాహం చేస్తే నాకు బెంగ ఉండదు. వాళ్ళ నాన్నగారు పద్మకి వేరే సంబంధం చేయాలని చూస్తున్నారు. అందుకే తొందరపడాలని వచ్చాను" ఆవిడ పరిస్థితి విప్పిచెప్పింది.

"నీకు కావలసిన కట్నం ఇస్తాను. నాకు వీలైనంతవరకూ మర్యాదలు, ముద్దుముచ్చట్లు జరిపిస్తాను"

అతడు "అమ్మా" అంటూ ఆవిడ చేతులు పట్టుకున్నాడు. "కట్నకానుకలకి ఆశపడేవాడిని కాదమ్మా"

కామాక్షి కళ్ళు వత్తుకుంటూ అంది. "పద్మ చాలా మంచి పిల్ల. నా ప్రాణం. అటువంటి బంగారుతల్లికి మంచి భర్తని తీసుకొని వచ్చి పెళ్ళి చేయవలసిన బాధ్యత నాకుంది" అంది.

"మామ్మ అభిప్రాయం స్వయంగా అడుగుతానమ్మా. మామ్మ కాదనదు. తప్పక ఈ పెళ్ళి జరుగుతుంది. ఏ అర్హతాలేని ఒక





వంటలామె అందర్నీ కోల్పోయి, ఈ మన వడి కోసమే బతుకుతోంది. మమ్మల్ని మీరు అందలం ఎక్కిస్తానంటున్నారు. ఇంత అదృష్టం పడుతుందని కలలో కూడా అనుకోలేదమ్మా" అని అతడు కామాక్షితో ప్రయాణమయ్యాడు.

ఇద్దరినీ చూసి నాగమ్మ అంది, "ఒరే అబ్బీ! నువ్వు వస్తావనే ఫిల్టర్ డికాషన్ తీశానురా! కాళ్ళు కడుక్కొనిరా, కాఫీ ఇస్తాను"

అతడు పెరట్లోకి వెళుతూ చుట్టూ చూశాడు. అతడి కళ్ళు పద్మకోసం వెతుకుతున్నాయి. మామ్మ పిలవడంతో ఇంట్లోకి వచ్చాడు. కామాక్షి చెప్పిన విషయంచెప్పి, ఆవిడ అభిప్రాయం అడిగాడు. "మామ్మా! నీకు ఈ వార్ధక్యంలో తృప్తి కలిగించడం నా బాధ్యత. నీకు మనస్ఫూర్తిగా ఇష్టమైతేనే ఈ పెళ్ళి చేసుకుంటాను" అన్నాడు.

మనవడి మాటలకి నాగమ్మ ఆనందపరవశురాలైంది. "ఏమైనా నా మనవడి దారే వేరు" అంది.

గిరిజ వచ్చింది. "ఏదో సరదాగా పెద్ద దిక్కు అని బిరుదు ఇస్తే మీరు మాకు నిజంగానే పెద్దదిక్కు అయిపోతున్నారే" అంది.

ఆనంద్ నవ్వుతూ, "ఈ కొంటిపిల్లకి గట్టి పెళ్ళికొడుకుని తేవడానికి రేపు ఈ పెద్ద దిక్కు దిక్కవుతాడు" అన్నాడు.

"సరేకానీ ఎలాంటివాడిని తేవాలి? నాలాంటి పప్పుసుద్దనా? చలిమిడి ముద్దనా? అమాయకపు చక్రవర్తినా? లేక స్వాతిముత్యాన్నా? "

గిరిజ ఆశ్చర్యంతో కళ్ళు పెద్దవి చేసింది.

"ఓరి నాయనోయ్. వానపాము బుసలు కొడుతోందే. ఇన్నాళ్ళూ నోట్లో నాలుక లేని వాడిలాగా నటించి ఇప్పుడు రివర్స్‌లో వాయిస్తున్నారే! పద్మక్కా! ఈయనతో ఎలా వేగుతావే" అంది.

ఆనంద్ కొంటెగా అన్నాడు, "మామ్మ ఎప్పుడూ అంటుంది, ఎద్దు ఎప్పుడూ ఒకే వైపు పడుకోదుట"

"అయితే ఈ మొద్దబ్బాయి వట్టి ఎద్దు అన్నమాట" అని గిరిజ నవ్వుతూ అంటే పండు వచ్చి ఆ మాటలు విని కోప్పడ్డాడు.

ఆనంద్ వేలు చూపిస్తూ అన్నాడు, "చూశావా? నా బలగం ఎంత ఎక్కువమందో? ఇప్పటినుండి నన్ను మంచిచేసుకో! ఏదన్నా లాభం ఉంటుంది"

గిరిజ వెళ్ళిపోతూ వెక్కిరించి అంది, "ఏంలాభం ఉంటుంది, చలిమిడి ఇప్పిస్తారా? "

ఆనంద్‌కి వచ్చినప్పటినుండీ పద్మని ఒకసారి చూడాలని, మాట్లాడాలని ఉంది. పద్మ దర్శనం అయితేకదా! ఇదివరకే నయం. హాయిగా అటూఇటూ తిరిగేది. ఖర్మ. ఇప్పుడు ఇంట్లోనుండి ఊడిపడదేం అనుకున్నాడు. వాళ్ళ ఇంట్లోకి వెళ్ళడానికి మొహమాటంగా ఉంది. కామాక్షి ఏమీ అనదుకానీ మనసులోనైనా నవ్వుకొంటారేమోనని అతడి భయం. ఇంట్లోవాడినవడం వలన పెళ్ళిచూపుల యోగం కూడా ఉండదుకదా అనుకున్నాడు.

తను మాట్లాడుతున్నా, పరాకుగా ఉన్న ఆనంద్‌ని చూసి పండు అసలు విషయం గ్రహించాడు. తల్లి కొట్లో ఉన్నవేళ చూసి ఆనంద్ దగ్గరికి వచ్చి "ఈమధ్య కొత్త బొమ్మలు వేశాను చూస్తారా? " అంటూ తమ ఇంట్లోకి తీసుకెళ్ళాడు. ఆనంద్ పరమ ఉత్సాహంగా బయలుదేరాడు.

ఆనంద్‌ను తమ గదిలో కూర్చోపెట్టి అతడు "పద్మక్కా, కాస్త మంచినీళ్లు తెచ్చిపెట్టవా? " అని కేకలేశాడు. ఆనంద్‌కి సౌంజ్ఞ చేసి తాను గిరిజ చదువుకుంటున్న చోటుకి వచ్చాడు.

ఆనంద్ గుండె స్పీడందుకుంది. ఆ అమ్మాయి వస్తే ఏం మాట్లాడాలి? ఏం అడగాలి? తన ఆత్రుత చూసి ఏడ్పించదుకదా. నన్ను పెళ్ళిచేసుకుంటావా? అని అడిగితే

బావుంటుందా?

పద్మా! ఐ లవ్ యు అంటే? అతడికి గిరిజ మాటలు గుర్తొచ్చాయి. అందుకే ఆ పిల్ల అలాగ తనకు తాటాకులు కడుతుంది. ఏంమాట్లాడాలి అని ఒక్కలా తలకిందులవు తున్నానేంటా అని చిరాకుగా అనుకున్నాడు.

ఈలోపు గాజుల గలగలలు విన్పించాయి. కాలిపట్టాల సన్నటిశబ్దం. మృదువుగా వినబడుతున్న పాదాల ధ్వని. అతడి అరచేతులు చెమటలు పట్టాయి.

గుమ్మంలోకి వచ్చిన పద్మ, "ఇవిగోరా మంచినీళ్ళు" అంటూ అతడిని చూసి తెల్లబోయింది. తర్వాత కంగారుగా "పండు అనుకున్నాను" అంది. అతడు చెయ్యి చాచి ఆమెచేతిలో నీళ్ళగ్లాసు అందుకుని గటగటా తాగాడు.

పద్మ అతడి అవస్థని ఓరగా చూస్తూ గమనించసాగింది.

పసుపురంగు పట్టుపరికిణీమీద నలుపు ఓణీ లేత పసుపురంగు జాకట్టులలో పద్మ రూపం మరీ ఆకర్షణీయంగా కన్పించింది. అప్పుడే స్నానం చేసిందేమో తడిసిన మల్లె మొగ్గలా ఉంది. చేతులకి బంగారు గాజుల మధ్య అందంగానున్న గాజుగాజులు, సుకుమారమైన వేలికిపెట్టిన అమెరికన్ తెల్లపాడి ఉంగరం, మెడలోని సన్నటి గొలుసు ఏదో పనిలోనుంచి రావడంవల్ల పైటపైన మెరుస్తూ కనబడుతోంది. అతడు తనని అలాగ మొదటిసారి పరిశీలనగా చూస్తుంటే పద్మ సిగ్గుపడింది. వెంటనే లోపలికి వెనుదిరగబోయింది.

"ప్లీజ్..." అతడు ఆమెను ఆపాడు. "మీ అమ్మగారు కైకరం వచ్చిన సంగతి... ఆహా... కాదుకాదు... మన పెళ్ళిగురించి మాట్లాడిన సంగతి మీకు తెలుసుకదూ? "

ఆమె కొద్దిగా తెరుచుకున్న పెదవులపై నవ్వుతూ అతడిని చూసి తలూపింది.

"పద్మా! ఇది... ఇది... నిజమా? కలా? నాకు కలేమో నన్పిస్తోంది" అతడు అస్పష్టంగా అన్నాడు.

పద్మ అతడివైపు ప్రేమగా చూసింది. "అమ్మకి ఈ ఆలోచన రావడం నా అదృష్టం. అసలు ఈ ప్రతిపాదన చేసిన మా చెల్లికి నేను కృతజ్ఞురాలిని" అంది.

ఎప్పుడూ ఏడ్పిస్తూ, ఆటలుపట్టించే గిరిజ ఈ ప్రసంగం తెచ్చిందా? అతడు ఆశ్చర్యంగా ఆమెచెప్పింది విన్నాడు.

"పద్మా! నా జీవితం సామాన్యమైనదే కావచ్చును. కానీ ఈ గుండెలో నీపట్ల నిండి ఉన్న ప్రేమానురాగాలు అసామాన్యమైనవి"

పద్మ తలవంచుకుని అంది, "నాకు తెలుసును"

అతడు చిరుకోపంగా అన్నాడు, "ఏం తెలుసును? ఉదయంనుండీ నిన్ను చూడాలని ఎంత తపిస్తున్నానో నీకు ఏంతెలుసును? తెలిస్తే ఒకసారైనా కనబడకుండా, మాట్లాడకుండా ఉంటావా? "

"ఎంత తపించారేమిటి? " సూటిగా వచ్చిన ప్రశ్నకి అతడు కంగారుపడి తలెత్తాడు. పద్మ అక్కడినుండి పరుగున వెళ్ళిపోయింది. గిరిజ తర్జని చూపిస్తూ, "ఇంట్లో పనిచేసుకుంటున్న పిల్లని పిలిచి, ప్రేమపాఠాలు వల్లిస్తున్నారని మా అమ్మకి చెప్పేస్తాను" అంటూ 'అమ్మా' అని పిలవసాగింది.

అతడు నిస్సహాయంగా పండువైపు చూశాడు.

పండు అతడిని చూస్తూ, "ఈవిడని మభ్యపెట్టడం ఎవరివలనా కాదు. పాఠం తెలియటంలేదని అడిగానా? చెపుతానంటూ వచ్చేసింది" అన్నాడు.

"ఊ... గూడుపురాణీ... క్షమార్హంకాదు. నన్నే బతిమాలి ఏ సినిమాకో తీసుకెళతానంటే పచ్చజెండా ఊపేదాన్ని కదా" అంది గిరిజ.

గిరిజ మాటలకి అతడు "చిక్కిపోయానురా ఈ పిల్లనోటికి" అన్నట్లు చూశాడు. అంతలో "గిరిజా ఎందుకే పిలిచావం"టూ





కామాక్షి వచ్చేసింది. అతడికి ఎలా బయట పడతానా అన్పించి తనని రక్షించమన్నట్లు గిరిజని చూశాడు.

గిరిజ తల గోక్కుంటూ అంది. "ఏం లేదమ్మా! ఆనంద్‌గారు రెండురోజులుండ మంటే రేపే వెళ్ళిపోతానంటున్నారు" అంది. కామాక్షి ఆ పిల్ల ఫిర్యాదుకి నవ్వింది. "పిల్లలు సరదా పడుతున్నారు. రెండు రోజులుండకూడదా" అంది.

అతడు సెలవులు అయిపోతే ఏడాదంతా బాధపడాలనీ, అవసరమైనప్పుడు ఉండవని గట్టిగా చెప్పాడు. అంత గట్టిగా చెప్పడం లోపలివాళ్లకి వినబడాలనే.

పిల్లలు రాత్రి పడుకొనే వరకూ సంబ రంగా కబుర్లు చెప్పుకుంటూనే వున్నారు. కామాక్షికి వాళ్ల ఆనందం చూస్తే ఎంతో ముచ్చటగా ఉంది. గిరిజ అక్క నడుం చుట్టూ చెయ్యి వేసి పడుకుని తల్లితో అంది. "అమ్మా! మనం నాన్నకి తెలియ కుండా పెద్దపెద్ద ప్లాన్లు వేస్తున్నాం కదూ! పాపం నాన్నకి తెలిశాక ఎన్ని తిడతారో, ఎంత గెంతుతారో? "

కామాక్షికి ఆ మాటలు నిజమేనన్పిం చాయి. కానీ తను ఈ విషయంలో ఆయన ఏ అల్లరిచేసినా సహనం చూపించవల సిందే! "సహనం" అన్నమాటకి మళ్ళీ ఆవిడ కలతపడింది. తను ఆయనతో పెళ్లి జరి గాక ఏ విషయంలో సహనం చూపించ లేదు గనుక. ఆవిడ కళ్లముందు అతిచేదైన సంఘటనలు గిర్రున తిరగసాగాయి.

గిరిజ చిన్నదిగా ఉన్నప్పుడు ఆయన దగ్గ రకి ఆర్టు నేర్చుకుంటానని ఓ అమ్మాయి రావడం మొదలుపెట్టింది. ఇంట్లో వాళ్ళు ఆ పిల్ల బాధపడలేక పంపించారు. లేకపోతే పెళ్ళైన అమ్మాయిని ఏ భర్తగాని, అత్తమా మలుగాని అలా పంపిస్తారు! మొదట్లో ఈయన వాళ్ళ ఇంటికి వెంకటరమణమూర్తి బొమ్మ అమ్మడానికి వెళ్ళాడు. ఆ తర్వాత వాళ్ళకోరిక మేరకి గోదాదేవి, విష్ణుమూర్తి చిత్రాలు వేసి పట్టుకెళ్లారు. ఈ పిల్ల ఆ చిత్రాలు చూసి ఈయన వెంటబడి నేర్పిం చమంటూ బయలుదేరింది.

దాంతో ఈయన ఇంటికి అయస్కాంతం లాగ అంటుకొనిపోయారు. పళ్ళు, స్వీట్లు, ఒకటేమిటి తినడానికి బోలెడు పట్టుకొచ్చే వారు.

ఈయన నేర్పుతున్న ఆర్టు ఆమె నేర్చు కొంటున్న ఆర్టు ఏమిటో తనకి తెలియదు. ఒకటే ఇకఇకలు, పకపకలు మాత్రం విని పించేవి. అరగంటకి ఓసారి కాఫీలో, కూల్ డ్రింక్సో కావాల్సిందే. తనకి చాలా కష్టంగా అన్పించేది. అయినా సహనం కోల్పోకూడ దని ఓర్పు వహించింది. ఓసారి పద్మ వాళ్ళ గదిలోకి వెళితే తీసుకొని రావడానికి వెళ్ళిన తన తల తిరిగిపోయింది. ఆ అమ్మాయిని ఆయన ఆనుకుని కూర్చుని, ఒకవైపు డ్రాయింగ్ షీట్‌మీద పెన్సిల్‌తో రేఖా చిత్రంవేస్తూ కబుర్లు చెపుతున్నారు.

పద్మ తనకి పెన్సిల్ ఇవ్వమంటూ పేచీ పెడుతోంది.

"సార్! మనకి ఏకాంతం సరిగ్గా కుదరడం లేదు. ఆర్టు నేర్చుకోవాలంటే నిశ్శబ్ద వాతా వరణం అవసరమన్నారు. మనం వేరే గదిఒకటి తీసుకొందామా" అంటోందా మ్మాయి. ఆయన అసహనంగా పద్మ వీపు మీద కొట్టి అమ్మ దగ్గరికిఫో అంటున్నారు.

పద్మ ఏడుపు చూసిన తనకి ఒళ్ళు తెలి యని ఆవేశం వచ్చింది. వెంటనే ఆ పిల్లని లేవదీసింది. "ఆర్టు అన్నది ఒక దివ్యమైన కళ. దాన్ని నేర్చుకోవడానికి అర్హత ఉండాలి. ఒళ్ళో కూర్చుని, వీపు పామించు కుని నేర్చుకునేది కళ కాదు. నేర్పించేది కళ కాదు. ఇంక ఇంటికి వెళ్ళి నీ భర్తకి కావల సినవేమిటో చూడు" అంది.

"సార్! ఆవిడ... మీ మిసెస్ నన్ను అవ మానపరుస్తున్నారు" అందామె.

తను వాళ్ళవైపు అసహ్యంగా చూసి, పాపని తీసుకొని ఇవతలికి వచ్చేసింది.



ఆ పిల్ల వెళ్ళిపోయాక ఆయన ఎన్ని తిట్టారో! నాగరికత తెలియని మొద్దు అన్నారు. సభ్యసమాజంలో బతకడానికిఅన ర్హురాలన్నారు. తనకి రాని కళ ఇతరులు నేర్చుకొంటూంటే చూసి సహించలేనితనం అన్నారు. కళాకారుని భార్యగా ఉండడానికి పనికిరాని వ్యక్తన్నారు.

అప్పటికే పద్మ తండ్రి కేకలకు భయపడి ఏడుపు మొదలుపెట్టింది. ఇరుగుపొరుగు వాళ్ళు ఆసక్తిగా బయటికి వచ్చి వినసా గారు. ఇంక తాను ఏం మాట్లాడగలదు?

నాగరికత అంటే స్త్రీ, పురుషులు విచ్చల విడిగా బతకడమా? కళను నేర్పించడ మంటే ఎదుటి ఆడపిల్లల బలహీనతతో ఆడుకోవడమా? తనకి బాగా అనుభవమైన విషయం ఆయన స్త్రీల విషయంలో బలహీ నుడని.

ఆ తర్వాత ఆయనని ఆ అమ్మాయి తన ఇంటికే రమ్మంది. ఆమె భర్త ఆఫీసుకి వెళ్ళ డంతో వీళ్ళు స్వేచ్ఛగా ఉండటం, ఇంటిప ట్టున ఏనాడూ నాలుగు నెలలు కుదురుగా ఉండని ఆయన ఇప్పుడు బుద్ధిగా ఉండిపో వటం ఆశ్చర్యం కలిగించింది. తర్వాత ఆయన కేంప్ వెళ్ళిపోయాక తెలిసింది. ఆ అమ్మాయి భర్త ఒకనాడు వీళ్ళని చూసి ఖంగుతిని దెబ్బలాడాడని. అంతవరకూ వచ్చాక ఎవరు తగ్గుతారు. ఆ ఆవేశంలో ఆ పిల్ల అతడితో కాపురం చేయనని, ఈయనతోనే బతుకుతూ కళాసేవ చేస్తానం దిట. ఆపిల్ల తామిద్దరం పెళ్ళిచేసుకొంటా మని భర్తతో అనడంతో అది విన్న ఈయన ఊరెళ్ళిపోయాడు 'పెళ్ళి, బాధ్య తలు అంటూ మళ్ళీ రొంపిలోకి దిగ నంటూ! దాంతో పాపం ఆ అమ్మాయి అటు పెద్దలు, ఇటు పెద్దలు వచ్చి మందలించేసరికి భర్తతో రాజీపడిపో యింది.

కామాక్షి ఆ జ్ఞాపకాల్లోంచి లేచి తోటలో తిరగసాగింది.

మనసులోని అగ్నిజ్వాలలను ఆర్పే శక్తి ఈ చల్లని ప్రకృతికే ఉందేమో! ఇద్దరు పిల్లలు కలిగేవరకూ ఆయనకిష్టమైనట్లు బతకాలని ఎంత తపనపడింది. ఎన్నిరకాల అలంకారాలు చేసికొనేది. ఎలాగైనా ఆయ నని తనవాడిగానే మిగుల్చుకోవాలని ఆరాటం. ఆయన కళతో తను పోటీప డిందా? లేదే! ఆయన కళని నిరుత్సాహప రచాలని కూడా ఏనాడూ అనుకోలేదు. భగ వంతుని అనుగ్రహం, పూర్వజన్మ సుకృతం లేనిదే ఏ కళా సిద్ధించదని తన గాఢమైన నమ్మకం. ఒక గొప్ప కళని హస్తగతం చేసు కొన్న భర్తంటే ఆరాధన. ఆయన కీర్తిప్రతి ష్టలు చూస్తే సంతోషం కానీ ఏం లాభం. కళతో స్నేహం చేస్తూ, కళాకారుని బలహీ నతలతో రాజీపడుతూ బతకడం ఎంత కష్టం?

పోనీ మనిషి తన పర్సనల్ లైఫ్‌ని ఏమైనా గుప్తంగా ఉంచుకుంటారా? అది లేదే. కేంప్‌నుండి రావడం భయం. రాత్రిళ్ళు నిద్రపోయేవరకూ వాళ్ళ కబుర్లే. సత్యవతి చాలా ఆకర్షణీయంగా ఉంటుంది. వసంత మంచిది. ఆ ఊర్లు వెళ్ళినపుడు ఏదో మామూలుగా పరిచయం అయ్యారు అంతే. నువ్వు ఏవేవో ఊహించుకోకు సుమా! అదీ ఆయన తీరు.

రాత్రిళ్ళు తను ఎంత ఆనందాన్ని ప్రసా దించినా, నిద్రలో వాళ్ళ పేర్లతో కలవరిం తలే! ఉదయం లేచాక కాఫీ ఇచ్చి "నేను ఏవేవో ఊహించుకోకూడదు. అంతే! కానీ మీ ఊహలలో వాళ్ళని ఎన్నిసార్లు పిలి చారో తెలుసా? ఏం చేస్తాం? శ్రీరాముడి లాంటి వాడిని పెళ్ళిచేసుకోవాలని అనుకు న్నాను. కానీ ఇలాగ శ్రీకృష్ణుడు లభిస్తాడని అనుకోలేదు" అని బాధపడ్తూ, ఆవిడ పూజగదివైపు చూస్తూ "మళ్ళీ జన్మకైనా మంచి భర్తని ప్రసాదించు స్వామి" అని మొక్కుకునేది.

ఆయన ఆవిడ చేతిని తీసుకొని ముద్దా





డుతూ "అబ్బా... ఆశ... జన్మజన్మలకీ నేనే నీ భర్తని" అనేవాడు. ఆవిడ రెప్పలా ర్పుతూ భయంభయంగా చూసేది.

"ఈ జన్మకే మిమ్మల్ని భరించడానికి నాకు శక్తిచాలడంలేదు. ఇంక జన్మజన్మలకీ కూడానా? వద్దండీ! కాస్త... ఇంత కొంచెం నా మీద దయచూపించండి. నా తరపునే కాదు మీవైపుగా కూడా నా కోరికే తీర్చమని దేవుడిని కోరండి" అంది.

ఆయన ఫక్కుమని నవ్వేవారు. ఆమె మైమరపుగా చూసేది. ఇంత అందం ప్రసాదించిన దేవుడు స్థిరమైన బుద్ధి, మంచి గుణం ఇస్తే బావుండేది... అనుకున్నేది.

ఆయన "ఓయ్ ఏమిటలాగ తినేసేలాగ చూస్తున్నావు. నాకు దిష్టి తగలగలదు" అనేవాడు.

ఆమెకి రోషం వచ్చేది. "ఊళ్లు తిరిగినపుడు అడ్డమైనవాళ్ళూ అనుభవించి, అనుభవించి వదిలేసిన ఈ శరీరానికి దిష్టా? "

ఆయన గాబరాగా చుట్టూ చూసేవారు. "మంచిదానివే. ఏదో సరదాకి అంటే అంత సీరియస్సా? ఏమైనా నీకు నేనంటే ఇష్టమోయ్"

ఆయన మాటల్లో గర్వం. అదీ నిజమేనేమో! ఆయనని చూస్తే ప్రాణం సంబరపడేది. మళ్ళీ ఎంత త్వరలో వెళ్ళిపోతాడో అని భయపడేది. ఏవిటీ వివాహబంధం అని కోపం వచ్చేది. అతడు గౌరవించని ఈ బంధాన్ని తాను ఎందుకు గౌరవించాలి?

కామాక్షి చిన్నప్పుడు వాళ్ళ రైతు భార్య ఎప్పుడూ ఏడ్చేది. భర్త తాగి వచ్చి తంతున్నాడని, ఊళ్ళో ఎవరినో ఉంచుకున్నాడని, దానిమీద మోజుతో డబ్బు తగలేస్తున్నాడని గొడవ. తండ్రి విని, సానుభూతితో కొంచెం డబ్బు ఇచ్చి పంపేసేవారు.

తను ఆయనతో వాదనకి దిగేది. "అలాంటి తాగుబోతుని, తిరుగుబోతుని వదిలేసి హాయిగా బతకమనవచ్చుకదా నాన్నా! ఆ సలహా చెప్పరేం? కాస్త డబ్బు ఇస్తే సమస్య తగ్గిపోతుందా? "

ఆయన నవ్వుతూ, "మనం చెప్పినా ఆమె అలాగ చేయదమ్మా! అదే ఈ దేశంలోని గొప్పతనం. మన వివాహబంధంలోని మహత్యం" అనేవాడు.

తను చిరాకుపడేది. "అనవసరమైన మాటలు చెప్పకండి నాన్నా!" అని హేళనగా అనేది. ఇప్పుడు... ఇప్పుడు... తను ఏం చేయగలుగుతోంది?

తను ఇలాగ స్వంత సంపాదన అంటూ నికరంగా బతకడానికి ఎంత శ్రమపడవలసి వచ్చింది. ఎంత ధైర్యం తెచ్చుకోవలసి వచ్చింది. ఆయనని చూడాలని కోరిక. చూశాక మాట్లాడాలని కోరిక. కలిసి బతకాలని ఆరాటం. మరి ఆయనకి ఇలాంటివి ఉండవా? కామాక్షి మనుసు ప్రశ్నించింది. ఏమో! తను కాశీనుండి వచ్చినపుడు ఆయన వచ్చి వెళ్ళిపోయారని విలవిలలాడింది. పద్మనలాగ బాధించడానికి ఆయనకున్న హక్కేమిటి అన్పించింది. మనసులో ఏమూలో తనని చూడలేదన్న కోపం, ఆయన సహాయం లేకున్నా తాము బతకగలుగుతున్నామన్న అసహనం... ఆయనచేత అలాగ చేయించాయేమోనన్పించింది. మళ్ళీ త్వరలో రావచ్చునని నచ్చచెప్పుకొంది.

అలాగే వచ్చారు కూడా. పేపర్లో ఆయన ఫొటోవేసి ఆయనతో ఇంటర్వ్యూ రాసినప్పటినుండీ పిల్లలు ఎదురుచూస్తున్నారు ఆయనకోసం.

ఎవరో విలేఖరి అడిగారూ "మీ వారసత్వం పిల్లలెవరికైనా వచ్చిందా? " అని. ఆయన లేదని జవాబిచ్చారు.

అది చదివిన పండు మోహం ఎంత వెలవెలపోయిందని. వాడి ప్రతిభ వాడి తండ్రికి తెలియదు. భగవాన్... ఏం పరిస్థితి సృష్టించావయ్యా?

కామాక్షి వెంటనే ఆయన గదిలో పండు వేసిన బొమ్మలు, నఖచిత్రాలు పెట్టింది. ఈసారి వచ్చినపుడైనా ఆయన ఇది తెలుసు



కోవాలి. ఆ వారం పత్రికలో పండు వేసిన 'నిరీక్షణ' అన్న చిత్రం వచ్చింది. ఇంట్లో అందరూ ఎంతో సంబరపడ్డారు.

ఆయన లోపలికి అడుగుపెడుతూంటే సన్నగా రాగంతీసింది. "ముందు తెలిసెనా ప్రభూ... ఈ మందిరమిటులుంచేనా? మందమతిని... నీవు వచ్చు మధురక్షణ మేదో... కాస్త ముందు తెలిసెనా ప్రభూ!"

ఆయన కన్నులలో కోటి కాంతులతో సంబరంగా అడిగాడు, "కామాక్షీ! నాకోసం అంతలా ఎదురుచూస్తున్నావా? "

తను నవ్వింది. "నేను పాడేది 'మేఘసందేశం' సినిమాలోని పాట" అంది.

"నీ మాటలు, పాటలు విని చాలాగోజులైంది కామాక్షీ! నిన్ను చూడాలన్పించింది. వచ్చేశాను"

ఆమె తల ఎత్తి ఆయనకళ్లల్లోకి చూసింది. ఆ చూపులు ఆప్యాయంగా ఉన్నాయి. కావలసిన మనిషిని చూశానన్న తృప్తి.

ఆమె కళ్లల్లో సన్నటి నీటి పొర. అది ఆయన కంట పడటం ఇష్టం లేక మొహం పక్కకి తిప్పింది. "గుమ్మంలోనే ఏమిటి మన కబుర్లు. లోపలికి రండి" అంది.

ఆయన కొంటెగా అడిగారు. "ఏ లోగిలి లోకి రావాలి? నీ మనసు లోగిలిలోకా? ఈ ఇంటి లోగిలిలోకా? "

ఆమె ఓరకంట చూసింది. "ఊ... చాలా హుషారుగా ఉందే? ఏది వచ్చినా అతి వృష్టీ, అనావృష్టి"

పద్మని దృష్టిలో పెట్టుకుని ఆమె ఆ మాటలంటోందని ఆయనకి అర్థమైంది. ఎంత సున్నితమైన మందలింపు.

అటూఇటూ చురుకుగా కదులుతూ, ఇటు వంటా వార్పూతోపాటు అటు వ్యాపారం చూస్తూ అవధానం చేస్తున్న భార్యను చూస్తే జాలి కలిగింది. దగ్గర కూర్చోపెట్టుకుని మాట్లాడాలనే కోరిక పుట్టింది.

పండుని పిలిచాడు "అమ్మే అన్నీ చూసుకోవాలా? కాస్త సాయం చేయవచ్చు కదా!" అన్నాడు.

పండు ఆయన మొహంలోనికి అయోమయంగా చూశాడు. "నాకు జ్ఞానం వచ్చినప్పటినుండీ అమ్మే అన్నీ చూసుకోవడం చూస్తున్నాను" అన్నాడు వెంటనే.

పండు జవాబు ఆయనకి చెళ్ళుమని తగిలింది. "ఏం మాట్లాడుతున్నావో, ఎవరితో మాట్లాడుతున్నావో కాస్త ఆలోచించి మాట్లాడు" అన్నారు.

కామాక్షి లోపలికి వస్తూ పండు మొహం చూసి "ఏం జరిగింది" అంది.

"నువ్వు శ్రమపడి పోతున్నావుట. మీ ఆయనగారు జాలిపడిపోతున్నారు? "

కామాక్షి వాడి మాటలకి నవ్వింది. ఆవిడ తెల్లటి పలువరుస మెరిసింది. ఆవిడ ఆయనని అడిగింది. "మీకు ఏం కావాలి? "

ఆయన తడబడ్డాడు. "అబ్బే.. నువ్వు ఒక్కదానివీ అటూఇటూ హైరానాపడుతున్నావు. అందుకని అన్నాను"

ఆవిడ విచిత్రంగా చూసింది. తర్వాత భుజాలు కుదించి నవ్వింది. ఆ నవ్వులో ఎన్నో ప్రశ్నలు, ఎత్తిపొడుపులు ఆయనకి తగిలాయి. పండు, నాగమ్మ కొట్లో కూర్చున్నాక ఆవిడ ఆయన దగ్గరికి వచ్చి కూర్చుంది. "ఊ...చెప్పండి. మీరు నాకోసం దాచిన కబుర్లు"

అతనికి కాసేపు మాట్లాడాలన్పించలేదు. "మౌనం కూడా ఎంత హాయిగా ఉంది? "

ఆవిడ వారపత్రిక తీసి పండు వేసిన చిత్రం చూపించింది. ఆయన దాన్ని చూసి అప్రతిభుడయ్యాడు. "వీడికి ఈ కళ ఎలా వచ్చింది. ఎవరు నేర్పించారు? "

కామాక్షి అంది. "ఈసారి ఏ పత్రికల వాళ్ళు ఇంటర్వ్యూ చేసినా పిల్లల గురించి ఈ విషయం మీరు సగర్వంగా చెప్పుకోవచ్చును"

ఆవిడ ఇంకా పండు వేసిన, వేస్తున్న చిత్రాలను చూపించింది. పండులోని కళాకారుణ్ణి ఆయన గుర్తించాడు.





ఆయన ఆసక్తిగా అడిగాడు. "పండు చదువుతున్నాడా? "

"హాయిగా చదువుతున్నాడు. క్లాసులో నాల్గవ రాంక్ లోపునే ఉంటాడు"

ఆయన సందిగ్ధంగా అన్నాడు "నీకు కళలంటే ఆసక్తిలేదు కదా! వాడిని మరి ఎలాగ..."

ఆ ప్రశ్న అర్థోక్తిలో ఆగిపోయింది.

ఆవిడ బాధగా నవ్వింది. "నేను కళాద్వేషినని మీరెలా అనుకున్నారు. ప్రతీ వారిలాగే నేనూ కళలను చూసి ఆనందిస్తాను. అభినందిస్తాను. ఒక మంచి పాట వింటే పులకించిపోతాను. ఒక మంచి పుస్తకం చదివితే మైమరచిపోతాను. మహామహుల సంగీతం వింటే అన్ని కష్టాలూ మరిచి ఆనందిస్తాను. అంతెందుకు మీరు వేసిన చిత్రాలను చూసి ఎంత ఆనందం పొందుతానో మీకు తెలియదు"

అతనికి విషయం అర్థమై కూడా అవనట్లుండి "మరి నా విషయంలో ఏవేవో చెపుతావేం"

ఆమె స్పష్టంగా అంది. "మీరు జీవితాన్ని నిర్లక్ష్యం చేస్తున్నారు. కళకి న్యాయం చేయడం మంచిదే. ఉత్తమాశయాలు కలిగి ఉండటం కూడా మంచిదే. కానీ ఈ జీవితం ఒక అద్భుతమైన వరం. దీన్ని నిర్లక్ష్యం చేస్తే అది క్షమించదు. కళే జీవితం కాదు. జీవితంలో కళ ఒక భాగం'

అతనికా మాటలు కోపాన్ని కలిగించాయని తెలుస్తున్నా ఆవిడ నిర్మొహమాటంగా అనేసింది. కళలు మనకి రాకపోయినా పర్వాలేదు. వస్తే అదృష్టవంతులమే. కానీ జీవితాన్ని అర్థవంతంగా, అనుభూతిగా బతకకపోతే చాలా నష్టపోతాం. మాటలలో చెప్పలేనంత"

అతను మౌనంగా ఉండిపోయాడు.

ఆవిడ కొడుకు పిలుపుతో ఈ లోకంలోకి వచ్చింది.

తండ్రి ముందున్న తన బొమ్మలను చూసి పండు విషయం గ్రహించాడు. పండు తను ఎలా, ఎవరిదగ్గర నేర్చుకున్నాడో తండ్రికి చెప్పాడు. అంతా విన్నాక ఆయన తన చేతి ఉంగరం తీసి పండు వేలికి పెట్టి అభినందించాడు. అతడు వేసిన చిత్రాలు ఆయనకి నచ్చాయి. ఇంకా చిత్రాలను ఎలా మెలకువతో, నైపుణ్యంతో వేయాలో కొడుక్కి సూచించసాగాడు.

వయసు వచ్చిన తరువాత మొదటిసారిగా తండ్రితో సన్నిహితత్వం పొందిన పండు తండ్రిలోని ఒక గొప్ప కళాకారుని చూడగలిగాడు. ఆయన బోధనలోని ఆంతర్యం గ్రహించాడు.



చాలాసేపటికి తన దగ్గరకి వచ్చి ఒడిలో పసివాడిలా ఒదిగిపోయిన బిడ్డను చూసి కామాక్షి కంగారుపడింది. నుదుటిపై చెయ్యివేసి చూసింది.

"పండూ! ఒంట్లో బావుందా? " ఆవిడ కంగారుగా అడిగింది.

వాడు తల్లిమెడ వంచి గారంగా అన్నాడు. "నాకు... నాకు ఏమిటోగా ఉందమ్మా"

ఆవిడ వాడి ఆరోగ్యంకి సంబంధించి

అనేకం అడిగింది. వాడు తల్లి ఒడిలోని చల్లదనాన్ని అనుభవిస్తున్నాడు. ప్రపంచంలో ఎక్కడా దొరకని శాంతి, సౌఖ్యం దేవుడు తల్లిఒడిలో పొందుపరిచాడా?

వాడు ఏమీ మాట్లాడటం లేదు. కామాక్షి కొడుకు నుదిటిమీద ముద్దుపెట్టుకుంది. వచ్చీరాని మీసాలతో కొడుకు అందమైన మొహం కామాక్షికి అద్భుతంగా కన్పించింది.

"పండూ! నువ్వు ఇప్పుడు ఇలాగ చంటివాడిలా అమ్మ ఒడిలో పడుకోవడం నీ ఫ్రెండ్స్‌గానీ చూశారా, నీకు తాటాకులు కడతారు"

"అమ్మా! ఆయన... ఆయన చాలా గొప్పవారు. కానీ ఆ గొప్పతనంలో, ఆయన జీవితంలో మనకి భాగం లేకుండా పోయింది" వాడు తండ్రి కూర్చున్న గదివైపు వేలు చూపించి అన్న మాటలు ఆవిడలో అలజడి లేపాయి.

ఆవిడ కొడుకు పరిస్థితి, మనస్థితి గ్రహించగలిగింది. ప్రశాంత సరోవరంలో కల్లోలం చెలరేగుతోంది.



ఆవిడ నిట్టూర్చింది.

కొద్దిసేపు గడిచాక వాడు ఆవిడ చీర కుచ్చిళ్ళలో మొహం దాచుకుంటూ అన్నాడు, "అమ్మా! నువ్వు చాలా మంచిదానివి. చాలా గొప్పదానివి"

అప్పుడు... అప్పుడు వచ్చింది కామాక్షికి అంతులేని ఏడుపు. ఆవిడ నోట్లో పైట కొంగు కుక్కుకుని గోడకి చేరబడింది.

★ ★ ★

రాధాకృష్ణమూర్తికి ఇల్లు కొత్తకొత్తగా అన్పిస్తోంది. పిల్లలు మరీను. ఇంట్లో ఉన్న పద్మ, పండు ఆయనతో మాట్లాడుతున్నా ఇదివరకటి సన్నిహితత్వంలేదు. ఆయన పండుని పిలిచి అందరికీ టిఫిన్లు పట్టుకొని రమ్మనమని డబ్బులివ్వబోయాడు.

"మనకోసం అమ్మ అద్భుతంగా సాంబారు, చెట్నీ, ఇడ్లీ చేస్తోంది" అన్నాడు వాడు.

కొడుకు మాటలకి కళ్లజోడులోంచి చూశాడాయన. "మీ అమ్మ ఒక్క ఇడ్లీయే చేస్తుంది. అదే మనం బయటినుండి అయితే పూరీ, ఉల్లిదోశ, ఉప్మాలు నాలుగు రకాలు తెచ్చుకుని రుచి చూడవచ్చును" అన్నాడు.

అతడు మరి తర్కించలేదు. తండ్రికి కావలసినవి అడిగి వెళ్లిపోయాడు. పూరీల పొట్లాంతో వచ్చిన అతడిని చూసి "మీకు కావలసినవి తేలేదేం? " అని అడిగాడు.

అతడు ఎటువంటి జంకూగొంకూ లేకుండా చెప్పాడు. "అమ్మచేసిన ఇడ్లీలే మాకు అద్భుతంగా అన్పిస్తాయి నాన్నగారూ! మేం వీటికే అలవాటు పడిపోయాం"

ఆయన కొడుకు హేళనగా అంటున్నాడేమోనని చూశాడు. విషయం చెప్పడం మాత్రమే ప్రధానమన్నట్లు అతడు కన్పించాడు. ఆయనకి చిన్నప్పటి పండు గుర్తువచ్చాడు. తను తెచ్చే వాటికోసం ఎంత సంబరంగా చూసేవాడు. తెచ్చిన వాటిని తింటూ ఎన్ని కబుర్లు, నవ్వులు.

ఆయనకి ఏమిటోలాగ అన్పించింది. పైగా అందరూ వాటిని తింటుంటే తను మాత్రం వాళ్లకి భిన్నంగా ఈ టిఫిన్ తినడం చిన్నతనమే కలిగించింది.

ఒకరోజు పద్మని పిలిచి తను వాళ్లకి చాలా సన్నిహితుడనని తెలియచేయడానికి ఆయన డబ్బు పైకి తీశాడు. "నువ్వు బజారుకి వెళ్లి నీకు నచ్చిన చీరలు మీ అమ్మకి, నీకు తెచ్చుకో. పండుకి మంచి ప్యాంటు, షర్టు తే" అంటూ చెప్పాడు.

ఆయన మొదట ఆరువందలు తీశాడు. అవి ఇచ్చి సరిపోతాయా అని అడిగాడు. పద్మ చాలన్నట్లు తల ఊపింది. మళ్లీ ఏమనుకొన్నాడో మరొక రెండు వందలు కలిపాడు.

"మంచివి కొనుక్కోండి" అంటే, అలాగేనన్నట్లు తల ఊపింది. "మీ అమ్మకి మంచి జరీచీర తీసికొనిరా" అంటే పద్మ ఆయన వైపు ఆశ్చర్యంగా చూసింది.

బజారునుండి తల్లికి జరీచీరకొని, మిగిలిన వాటితో తనకి, చెల్లికి వాయిల్ చీరలు కొంది. పండుకి మధ్యస్థాయి ప్యాంటు షర్టు తీసింది.

అతను భార్యకు తెచ్చిన నాచురంగు జరీ చీర చూసి బావుందన్నాడు. పండు బట్టలు, పిల్లల వాయిల్ చీరలు చూసి "ఇదేమిటి? మంచివి కొని తేకపోయావా? " అన్నాడు.

"అమ్మ చీరకి పోగా మిగిలిన డబ్బులతో ఇలాగే వచ్చాయి నాన్నగారూ" అంది పద్మ.

అతనికి చెళ్లుమని కొట్టినట్లయింది. డబ్బు చాలదని తనని అడగవచ్చుకదా! లేదా అరువు తెచ్చాను అని చెప్పి మళ్లీ పట్టుకెళ్ల వచ్చునుకదా! ఆ బట్టలు పిల్లలకి ఆనందం కలిగించాయో లేదో అతనికి తెలియలేదు కానీ వాళ్లు తనకి ఎలా దూరమయ్యారో మాత్రం బాగా అర్థమైంది.

"అమ్మా! ఎంతసేపు అలా తిరుగుతావు? లోపలికి రామ్మా!" పద్మ పిలుపుతో ఆవిడ ఇంట్లోకి నడిచింది. గతం ఆనందమైనదైతే





పర్వాలేదుకానీ దుఃఖపూరితమైతే కష్టం. ఆవిడ దిండులో తలదాచుకుంది ఆ అశాంతిని భరించలేనిదానిలాగ.

ఉదయం నిర్మలంగా పూజచేసికొంటున్న ఆవిడ దగ్గరికి వచ్చి "అమ్మా ఆయన ఇంటికి ఫోను పెట్టమని డబ్బు కట్టారుట. వాళ్లు వచ్చారు. ఎక్కడ పెట్టించమంటావు?" అని అడిగింది పద్మ. ఆవిడకి ఆయన అంటే ఎవరో అర్థమవలేదు. తర్వాత తట్టి భర్తకి ఇంతమంచి బుద్ధి ఎలా పుట్టిందా అనుకుంది.

ఆవిడ ఆనందంగా అడిగింది "నాన్నగారి స్నేహితులు తెచ్చారా?"

పద్మ సిగ్గుపడింది "కాదమ్మా!"

కామాక్షి "మరి..." అంటూ చూసింది.

పద్మకి చెప్పక తప్పలేదు. "ఆనంద్‌గారి ఫ్రెండ్"

ఆవిడకి సంతోషమన్పించింది. ఈ కుటుంబాన్ని ఆనంద్ బాధ్యతగా చూస్తాడు పర్వాలేదు!

ఫోను పెట్టిన తర్వాత ఆవిడ అడిగింది నాగమ్మను "మనవడు, మామ్మ, నన్ను, పిల్లల్ని ఆశ్చర్యంలో ముంచెయ్యాలనుకున్నారు కదూ!"

"మీరు అంత మంచి మాట చెప్పి మమ్మల్ని ఆశ్చర్యపరచలేదా? దాని ముందు ఇదెంత?" నిగర్వంగా అంది నాగమ్మ.

కాసేపటికి ఫోను పలికింది. పండు తీశాడు. అవతలినుండి ఆనంద్ గొంతు. పండు నవ్వుతూ "ఫోను రాయబారం" అంటూ అక్కగార్కి అందించాడు.

ఫోను రాగానే మొదటి ఫోను ఆనంద్ తనకి చేసినందుకు పద్మ సిగ్గుపడింది. దూరంగా కదులుతున్న వాళ్లకి పద్మ నెమ్మదిగా "మామ్మగారితోనో, అమ్మతోనో మొదట మీరు మాట్లాడవచ్చునుకదా" అనటం సన్నగా వారికి విన్పించింది.

అవతల ఆనంధ్ ఏమన్నాడోగానీ పద్మ చిన్నగా నవ్వుతోంది. కామాక్షికి ఆ నవ్వు ఎంతో బాగుంది. తన బిడ్డ ఇలాగే జీవితం గడపాలి.

ఫోను వాళ్లని కనుక్కొని ఆ డబ్బు కామాక్షి నాగమ్మ చేతికి అందించింది.



రాధాకృష్ణమూర్తి రెండుసార్లై ఫోనులో ఇంటికి మాట్లాడాలని చూస్తున్నాడు. లైన్సు బావుండలేదని ఒకటేమాట. చివరికి మర్నాడు ఉదయం ఎలాగో ఫోను వచ్చింది. డాక్టరుగారింటికి ఫోను చేసి, తన భార్యని పిలవమన్నాడు.

ఉదయమే లేచి చదువుకొంటున్న పండు కబురురాగానే డాక్టరుగారింటికి వచ్చాడు. ఆయన కోపంగా అడిగాడు "నేను మీ అమ్మను పిలవమంటే నువ్వు వచ్చావేం?"

పండు నెమ్మదిగా చెప్పాడు, "మన ఇంటికి ఫోను వచ్చింది. మీరు అక్కడికే చేస్తారని నెంబరు చెప్పడానికి నేను వచ్చాను"

ఆయన కొంత తగ్గారు. "ఫోను ఎప్పుడు వచ్చింది?"

"మొన్న"

అతడు చెప్పిన నెంబర్ నోట్ చేసుకొ

న్నాడు.

కాసేపయ్యాక ఇంటికి ఫోను వచ్చింది. పండు నవ్వుతూ తల్లిని పిలిచాడు. "చూడమ్మా! ఎవరో పోకిరీవాడు. ఎంతసేప టినుండో రాంగ్‌నంబర్ అని చెప్పినా విన డంలేదు. నువ్వు వచ్చి కాస్త ఉతికి ఆరవేస్తే సరి".

కామాక్షి కొడుకు మాటలు నమ్మింది. ఫోను మళ్ళీ రింగవగానే కామాక్షి కోపంగా "ఏవయ్యా! మీరు మనిషికాదా? రాంగ్‌నెం బరని ఎన్నిసార్లు చెప్పాలి. ఈ బాధ పడ లేక నేను ఇన్నాళ్ళె ఫోనే వద్దనుకున్నాను"

అవతలినుండి ఆయన దిమ్మెరపో యారు. "కామాక్షీ! నేను...రాధాకృష్ణను మాట్లాడుతున్నాను. రాంగ్ నెంబర్ అంటావేం? పండుగాడు చెప్పలేదా?' అన్నారు.

ఆయన నిలదీస్తోంటే కామాక్షి చూపులు పండువైపు మళ్ళాయి. వాడు నవ్వుతూ చూస్తున్నాడు. అవతలినుండి భర్త మాటలు వినబడుతూంటే ఆవిడ దృష్టి అటు తిరిగింది.

ఫోను పెట్టేశాక తల్లి వచ్చి తన చెవులు మెలివేస్తుందని చూస్తున్న పండు తల్లి నిస్స త్తువుగా వచ్చి మంచంమీద చతికిల బడ టంతో ఏమయిందా అనుకొన్నాడు.

"నాన్నగారు ఏంమాట్లాడారమ్మా?"

ఆవిడ బెంగగా కొడుకు మొహంలోకి చూసింది.

తల్లి మాట్లాడకపోయేసరికి పండు మళ్ళీ అడిగాడు చివరికి ఆవిడ చెప్పింది "ఆయన ఆ అబ్బాయిని తీసుకొని ఎల్లుండి వస్తున్నా డట. అతడికి పద్మనిచ్చి పెళ్ళి చేద్దాం అంటున్నాడు. ఆయన ఎంతసేపూ వాళ్ళ డబ్బు గురించే మాట్లాడుతున్నారు. ఆయన అతడిని పెళ్ళయ్యాక మంచి చిత్రకారునిగా చేస్తారుట"

ఆవిడ ఆయనని ఈ విషయంలో ఎలా ఎదుర్కోవాలా అని ఆలోచనలో పడింది.

★ ★ ★

గుంటూరులో రాధాకృష్ణ శిష్యునితో కబు ర్లలో పడ్డారు. "నరసింహం, నువ్వు నాకు చాలా నచ్చావయ్యా. మా ఇంట్లో నా మాట వేదవాక్కు. పద్మ చాలా మంచిది. నేను అంటే భయం, భక్తి"

"నా కొడుకు ఆర్టిస్టేననుకో! కానీ అల్లుడు కూడా అయితే ఇంకా బావుంటుంది. నాకున్న పేరుప్రతిష్ఠలతో నిన్ను, వాడిని అందలం ఎక్కిస్తాను. పెళ్ళి ఘనంగా మీ ఇంట్లోనే చేస్తామని మీ అమ్మగారు అన్నారు.

అతడు "అవునండీ, మాకు ఈ పద్ధతే అలవాటుట" అన్నాడు.

ఆ విషయం అతి బలవంతం మీద అంగీకరిస్తున్నట్లు ఆయన అన్నాడు. "పోనీ! మీ ఇంట్లోనే మీ ఇష్టప్రకారమే చేద్దాం. పద్మ నీకు తప్పక నచ్చుతుంది"

అతడు ఆ మాటలకి సిగ్గుపడిపోయాడు.

తల్లి ఒక్కడేకొడుకని గారంచేసి ప్రేమగా తినిపించడం వలన అతడు గున్నఏనుగు లాగ తయారయ్యాడు. వయసుకి మించిన ఒళ్ళు. రాధాకృష్ణ మాత్రం మగవాడికి అందం ఏమిటి? అనుకున్నాడు. ఆ అబ్బాయి ఇల్లు, ఐశ్వర్యం చూశాక ఆయనకి ఒకనాటి తమ ఐశ్వర్యం డబ్బు గుర్తుకి వచ్చాయి. ఆ అబ్బాయి రాకతో తనకి రాజ భోగాలు వస్తాయనుకున్నాడు. ఆయనకి భార్య విషయంలో చిన్న అనుమానం లేక పోలేదు. ఫోనులో ఆవిడ "ఇప్పుడు పద్మ పెళ్ళికి ఏం తొందర? మీరు ఒక్కరూ రండి. పద్మ ఇష్టాయిష్టాలు కూడా మనం గమనించా"లని హెచ్చరించడం అనుభవ శూన్యంగా తీసిపారేశాడు. కష్టమైనా నిష్ఠూ రమైనా తను ఇచ్చినమాట చెల్లించుకోవాలి.

కామాక్షి మర్నాడంతా అన్యమనస్కంగానే గడిపింది. భర్తకి ఫోనుచేసి చెపుదామంటే ఆయన బయటికి వెళ్లాడట. కాలుకాలిన పిల్లిలాగ తిరుగుతున్న తల్లిని పద్మ, పండు





జాలిగా చూశారు. ఆవిడకి ఎప్పుడూ ఏదో ఒక సమస్యే. వాళ్ళు గిరిజని రమ్మన్నారు.

ఇంతలో కామాక్షికి శ్రీరామ్ నుండి ఫోను వచ్చింది. "అమ్మ పెరట్లో కాలుజారిపడింది. తలకి బాగా దెబ్బ తగిలింది. కాలు ఎముక చిట్లిందంటున్నారు. మీ అందరినీ చూడాలని ఏడుస్తోంది. రండి" అని.

కామాక్షికి తల్లికి అలాగ జరిగినందుకు బాధగా ఉన్నా భర్తని ప్రస్తుతం తప్పించుకోవచ్చుననుకుంది. పద్మని వెంటబెట్టుకుని వెళ్ళిపోయింది. పండు, గిరిజలు తండ్రిని ఎదుర్కోవడానికి సన్నద్ధులయ్యారు.

నరసింహంతో ఆర్భాటంగా దిగిన రాధాకృష్ణమూర్తి భార్య కనబడకపోయేసరికి చిరాకుపడ్డాడు. గిరిజని చూసి "నువ్వు ఎప్పుడు వచ్చావు? " అని అడిగాడు.

"పరీక్షలైపోయాయి. ఫ్రెండ్స్‌తో టూర్ వెళ్ళమంది అమ్మ. నేనే వద్దని వచ్చేశాను" అంది గిరిజ.

"మీ అమ్మ ఏది? "

గిరిజ బదులు పండు జవాబు చెప్పాడు. జరిగిందివిన్నాక ఆయనకి మింగలేనంత కోపం వచ్చింది. 'వాళ్ళ అమ్మకి బావుండకపోతే తను వెళ్ళాలి. పద్మని ఎందుకు తీసికెళ్ళాలి? అడ్డగాడిదలాగ ఎదిగిన కొడుకుండీ వెళ్ళకపోవడమేమిటి? ఆ పిల్లని మంచి రోజులు కదా అని చూపిద్దామనుకున్నాడు. ఇలాగైంది.'

నాగమ్మ ఆ వచ్చిన వ్యక్తికీ, ఆయనకీ కావలసిన సకల సదుపాయాలూ చూసినా ఆయన శాంతించలేదు. కొడుకుని పిలిచి వెంటనే వెళ్ళి పద్మను తీసికొని రమ్మన్నాడు. తల్లికి తోడు అవసరమైతే అతడిని అక్కడే ఉండమన్నాడు.

బయటినుండి తల్లికి ఫోను చేశాడు పండు. దాంతో ఆవిడే రాత్రికి ఆయనతో ఫోన్లో మాట్లాడింది. "తల్లి చాలా రోజులకి పద్మను చూసినందువలన వదలడం లేదు. పండుని పంపవద్దు" అని చెప్పి ఫోన్ పెట్టేసింది. అంత సూటిగా భార్య మాట్లాడటం ఆయనకి మింగుడు పడలేదు.

నాలుగు రోజులు మర్యాదలయ్యాక వచ్చిన అతడు వెళ్ళిపోదామనడంతో ఆయనకి బయలుదేరక తప్పలేదు. కారాలు, మిరియాలు నూరుతూ బయటపడ్డాడు.

వాళ్ళు వెళ్ళాక పండు తల్లికి ఫోను చేశాడు.

యశోద కూతురి నడిగి విషయమంతా తెలిసికొంది. "ఏం దారి తల్లీ! ఎలా బతుకుతున్నా ఆయన నీకు ఎప్పటికప్పుడు ఏదో ఒక సమస్య తెస్తూనే ఉన్నాడు. ఈ పిల్లలకోదారి ఎలా చూపిస్తావో" అని ఆవిడ బాధపడింది.

వాళ్ళ మాటలు విన్న చిన్నక్క "ఏమైనా నీకు గొప్ప ధైర్యం లేవే! నువ్వు అనుకున్నట్లు చేస్తావన్నీ" అంది.

వదినగారు "మా కామాక్షి వదినగారు చాలా అదృష్టవంతురాలు. పిల్లలు తల్లి మాట జవదాటరు. మా పిల్లలూ ఉన్నారు ఎందుకూ? " అని వాపోయింది.

కామాక్షికి నవ్వు వచ్చింది. "అదృష్టం. గొప్ప అదృష్టం అక్కా! నేను ఎంత అదృష్టవంతురాలినో తెలుసా? బయటికి వెళ్ళిన భర్త ఎప్పుడు వస్తాడో, ఎక్కడికి వెళ్ళాడో మీకందరికీ తెలుస్తుంది. నాకు మాత్రం తెలియదు. స్త్రీ సదా భర్త సాన్నిత్యం కోరుకుంటుంది. అది నాకు ఎండమావి.

"మీ పిల్లలు ఏ చిన్న విషయం సాధించినా రాత్రి వచ్చే భర్త చెవినవేసి ఆ ఆనందం మీరు పంచుకుంటారు. కష్టంలో ఒక తోడున్నాడని మీకు ధైర్యం. నా భర్తేమో తన వృత్తి పేరు చెప్పి దేశమంతా తిరుగుతాడు"

కామాక్షి కంఠం ఆపై పలకలేనన్నట్లు మూగపోయింది.

తల్లి కూతురి బాధచూసి కళ్ళు ఒత్తుకుంది. చిన్న అక్క చెల్లిని ఓదార్పుగా భుజం తట్టి ధైర్యం చెప్పింది. ఏనాడూ

పెదవి విప్పని కామాక్షి ఎవరికీ తన గురించి అడగడానికైనా అణువంత అవకాశం అయినా ఇవ్వని కామాక్షి తోబుట్టువు దగ్గర కొంత బహిర్గతమవడంతో చెల్లి ఎంత ఆవేదన చెందకపోతే అంతమాత్రం నోరువిప్పుతుందనుకుంది చిన్నక్క.

'సమస్య' అన్న మాట చిన్నదేకానీ దాని వెంట వచ్చే విషయం పెద్దదే. ఇల్లు చేరాక పండు, గిరిజ పోటీలు పడి జరిగిన భాగోతం చెప్పారు.

నాగమ్మని పిలిచి "మా అల్లుడు ఇతడు" అంటూ ఆయన పరిచయం చేశాడుట. "నువ్వు, నేను ఆడకూతుళ్లం. ఆయన అతగాడే తన అల్లుడంటున్నాడు. ఎలా వీళ్లిద్దరికీ మనువు అవుతుంది? " అంటూ.

నాగమ్మ బాగా డీలాపడిపోయింది. మనవడు ఆ పిల్లని మనసారా ఇష్టపడ్డాడు. అయినా ఇది జరిగే దారి కనబడలేదు. కామాక్షి నవ్వి "నాగమ్మా! మీరు అధైర్యపడకండి. అన్నీ నాకు వదలండి" అంది. ఆ మాటలలోని గంభీరతకి స్థిర నిర్ణయానికి ఆవిడ అబ్బురపడింది.

పద్మని పండు ఆట పట్టించాడు. "నీ పెళ్లి కొడుకు భలే ఉన్నాడే. నువ్వు చూడలేదుకానీ అతి సుందరాకారుడు. సుకుమార దేహుడు"

పండు చిన్నక్కవైపు చూశాడు. "పోనీ చిన్నక్కా! నాన్న మాట తీర్చడంకోసం నువ్వు ఆయనని పెళ్లి చేసుకోవచ్చుకదా"

గిరిజ తమ్ముడిని తన్నడానికి లేచింది. "నా ఆలోచనకాదే. పద్మక్క పెళ్లయ్యాక నాన్నకి తప్పక అయిడియా వస్తుంది. ఈ ఆలోచన రావడమే ఆలస్యం. నీపై దండయాత్ర తప్పదు"

గిరిజ బెంగగా తల్లివైపు చూసింది. ఆ పిల్లకి ఉద్యోగం చేయాలని, తల్లిని సుఖపెట్టాలని గొప్పకోరిక.

పండు వదలలేదు. "గిరిజక్కా! అందరూ మన సినిమాల్లో అయిపోయింది చూపించడానికి జంతికల చక్రం తిప్పుతారు. కానీ నేను అలాగకాదే. ఇదిగో నా వేలుతో చక్రం తిప్పి భవిష్యత్తు చూపిస్తున్నాను. నాన్న దృష్టి నీమీద పడక తప్పదోచ్. అతడి పక్కన నువ్వు ఎలాగ ఉంటావో ఊహించుకుంటాను. ఒక టర్నింగ్ ఇచ్చుకో"

గిరిజ భయంభయంగా వాడివైపు చూస్తూ అంది. "ఒరేయ్. బాలవాక్కు బ్రహ్మవాక్కు అన్నారురా! పైన తథాస్తు దేవతలుంటారు. నీ నోటితో అనకురా"

"ఊ... అలాగ దారికిరా! ప్రతీదానికీ రాణీరుద్రమదేవిలాగ పోట్లాటకి వస్తావేం? ఇంక మానేస్తావా? "

గిరిజ మానేస్తానన్నట్లు చూసింది.

"అమ్మా! ఒక పని చేద్దాం"

కామాక్షి ఏమిటో అన్నట్లు కొడుకు వైపు చూసింది.

"పద్మక్క కాస్త విశాలమైన మనసు చేసికోవాలి. ఆనంద్‌గారినే దీనికి ఇచ్చి కట్టబెడదాం. ఒకరికి దేవాలయంలో ఒకరికి రిజిస్ట్రార్ ఆఫీసులో కానిచ్చేద్దాం. ఈ సంసారం ఈదలేక చస్తున్నాను. నాకూ ఓ నిశ్చింత వస్తుంది"

అక్కలిద్దరిచేతులకి అందకుండా పండుగాడు పరుగు ప్రారంభించాడు. పరుగులు తీస్తున్న ఆ పిల్లలను చూస్తున్న ఆవిడకి ఎలాంటి సమస్యనైనా ఎదుర్కోగలనన్పించింది. పద్మ, ఆనంద్‌ల పెళ్లి రిజిస్ట్రార్ ఆఫీసులో చేయడమే మంచిదన్పించింది. రిజిష్టర్ మేరేజ్ అయితే గుట్టుగా చేయవచ్చు పెళ్లయ్యాక బంధువులని ఏ వ్రతానికో పిలవవచ్చును. ఆవిడ ఆనంద్, నాగమ్మలను కూర్చోపెట్టుకుని అన్ని విషయాలూ వివరించింది. పందిరివేసి బాగా పెళ్లి చేద్దామంటే భర్త ఊరుకోడు. భర్త బంధువులు అతడి పక్షమే. రిజిష్టర్ మేరేజ్ అయితే చట్టపూర్వకమైనది కనుక ఆయన ఏం చేయలేడు.

వాళ్లిద్దరికీ పెళ్లి గురించి ఏ చక్కని కలలు ఉన్నాయో? ఇలాంటి పరిస్థితులు




వచ్చాయని బాధపడింది. తను మాత్రం ఏం చేయగలదు?

భర్తకి "పద్మకి ఆ సంబంధం నచ్చలేదుట. మరొక సంబంధం చూద్దాం. మనకి ఉన్న ఆస్తి పిల్లలేకదా! వాళ్ల ఇష్టం ఎందుకు కాదనాలి" అని ఉత్తరం రాస్తే "చిన్న పిల్ల. దానికి ఇష్టం ఏమిటి? నువ్వు దాన్ని సరిగ్గా పెంచలేదు. తండ్రి మాట వినాలని చెప్పు. వీళ్ల వంశం ఎంత గొప్పదో మీకు ఏం తెలుసును?" అంటూ నాలుగు పేజీలు వాళ్లని పొగుడుతూ రాశాడు. "ఇద్దరి నక్షత్రాలకి నప్పే రోజు మన సిద్ధాంతిగారిని అడుగు. తాంబూలాలు పుచ్చుకుందాం" అన్నాడు.

ఇంక అతడికి నచ్చచెప్పడం ఎవరి వలనా కాదని నిర్ణయించుకుంది. ఎంతసేపూ అతగాడి డబ్బు మనదవుతుందని రాస్తాడు. ఏమిటీ డబ్బు పిచ్చి ఆయనకి ఏ పిచ్చి వచ్చినా తారాస్థాయేననుకుంది.

ఆయన వచ్చేముందురోజే వసంత పిల్లలను తీసికొని వచ్చింది. ఎక్కడో దూరపు చుట్టరికం. దాన్ని అడ్డం పెట్టుకుని ఆ అమ్మాయి అలాగ వస్తుందని ఆవిడ అనుకోలేదు.

వసంతకూడా రావడానికి భయపడింది. కానీ డబ్బు చాలకపోవడంవలన రాక తప్పలేదు. పండు, గిరిజలు ఆవిడ ఎవరమ్మా అంటూ కామాక్షిని అడగడం మొదలుపెట్టారు. ఏం చెపుతుంది? ఎవరని చెప్పగలదు?

"ఆవిడ మనకి ఏమవుతుంది" గిరిజ సూటి ప్రశ్న.

కామాక్షి విసుక్కుంది "మనకి బంధువు. నీకు పిన్ని వరస అవుతుంది"

వసంత స్టైలుగా ఉంటుంది. వచ్చినప్పటి నుండీ ఆయన ఎక్కడ ఉన్నారు? ఎప్పుడు వస్తారు? ఏం చేస్తున్నారు? అంటూ ఆరాలు.

కామాక్షి గురించి బంధువులందరూ గొప్పగా ఆసక్తిగా చెప్పుకోవడం వసంతకి తెలుసును. పిల్లల్తో వాళ్లతో ఆవిడకున్న అనుబంధాన్ని వసంత ఆశ్చర్యంగా చూస్తోంది.

కామాక్షి వాళ్లకి మర్యాదలు చేస్తోంటే పద్మ అసహనంగా అంది "నాన్నగారి డబ్బంతా తిని మనకి ద్రోహం చేసినవాళ్లకి మన ఇంట్లో మర్యాదలు ఏమిటమ్మా?"

పద్మకి తండ్రి విషయాలు తెలుసును. తల్లిలాగ వచ్చినవాళ్లను ఆదరించలేకపోయింది.

కామాక్షి స్పష్టమైన నిర్ణయంతో పద్మకి సమాధానం ఇచ్చింది. "ఏ ఒక్కరూ చెడ్డగా బతకాలని అనుకోరు. పరిస్థితుల ప్రాబల్యం వలన బలహీనతలను జయించలేక పక్కదారులు పడతారు. రెండు చేతులూ కలిస్తే కదా చప్పట్లు మ్రోగేది. తప్పు చేసిన మగవాడిని ఏం శిక్షించగలిగాం? అతడిని ఇంటికి రాకుండా ఆపగలిగామా? అసహాయురాలిమీద జాలిపడాలికానీ ఆగ్రహపడకూడదు. ఆడదాన్ని తోటి ఆడదే అర్థం చేసుకోలేకపోతే ఇంక మగవాడు ఏం అర్థం చేసుకొంటాడు?"

వాళ్ల సంభాషణ విన్న గిరిజకి ఆవిడ ఎవరో బోధపడింది. "ఏం సమర్థించావమ్మా ఆమెను?" అంది.

"ఇది నా అనుభవాల సారాంశం. ఈ ఇంటి గృహిణిగా అతిథికి మర్యాద చేయడం నా ధర్మం" అంది కామాక్షి.

"పరిస్థితుల ప్రాబల్యంవలన పతనమవుతారన్నావు. మరి నువ్వు మాకోసం ఎలా కష్టపడ్డావు? ఎన్ని రకాలుగా శ్రమపడ్డావు. ఏనాడూ దారి తప్పలేదేం?"

కామాక్షి పలుచగా నవ్వలేనట్లు నవ్వింది. "ఇది నా సంస్కారం. సాంప్రదాయానికి నేను ఇచ్చిన గౌరవం. నా బిడ్డల గౌరవాన్ని కాపాడటం నా ధర్మం"

గిరిజ, పద్మ తల్లిని ఆనందబాష్పాలతో చుట్టేశారు. "తొందరపడి నిన్ను ప్రశ్నించాం. మమ్మల్ని క్షమించమ్మా"



" వాళ్లని ఆవిడ ప్రేమగా అక్కున చేర్చు కుంది.

"నాకేం కష్టం కలగలేదు. మంచి చెడు తెలిసికోగలిగే తార్కిక జ్ఞానం మీలో పెర గాలి. అదే నా కోరిక"

ఆ తల్లీబిడ్డల సంభాషణ వింటున్న వసంత సిగ్గుతో నిశ్చేష్టురాలై నిలబడిపో యింది. వసంత కొడుకు వచ్చి అన్నాడు. "పెద్దమ్మగారి మాటలకర్థం మాకు తెలి సింది. నీకు తెలియకపోతే మేం ఏమీ చెయ్యలేం? ఇంక ఒక్క క్షణం ఇక్కడ ఉండం. నువ్వు మాతో వస్తే రా"

ఆ పిల్లవాడు కామాక్షి పాదాలకి నమస్క రించాడు. "రెండు రోజులుంటామని వెళ్లిపో తున్నారు. ఇది నాకు ఏమీ బావుండలేదు" అని కామాక్షి అంటుంటే ఆవిడ ఔన్నత్యం ముందు తను ఎంతో వసంతకి అర్థమైంది.

"మీ బిడ్డల్లాగ చక్కగా పెరగాలని మమ్మల్ని ఆశీర్వదించండి పెద్దమ్మా" అంటున్న ఆ పిల్లవాడి తల కామాక్షి ఆప్యా యంగా నిమిరింది.

వాళ్లు పద్మ దగ్గరికి వచ్చారు. "మేం బాగా చదువుకొని అభివృద్ధి చెందాక మిమ్మల్ని పిలుస్తాం. తప్పక రావాలిసుమా"

పద్మ నిండు మనసుతో తలాడించింది.

"ఇక్కడ మేం గడిపింది అతిస్వల్పకాలం. అయినా మాపై బాగా ముద్రించుకుపో యిందీ సంసారం. కష్టపడటంలో ఉన్న ఆనందం ఏమిటో తెలిసికొన్నాం"

పద్మ అతడి భుజం తట్టి సాగనంపడానికి వెనుకనే వెళ్లింది.

రాధాకృష్ణమూర్తి మర్నాడు వస్తోంటే గిరిజ "విశాలహృదయుడుగారు విచ్చేస్తున్నా రురా పండూ" అంది.

పండు వస్తున్న తండ్రివైపు ఒకసారి చూసి వెంటనే అక్కవైపు చూశాడు.

"అమ్మ స్థాయికి మనం తగిన బిడ్డలుగా ఉండాలికదే" అన్నాడు.

గిరిజ అదిరిపడి తమ్ముడిని చూసి అంది, "ఏమిటిరా పండూ? నీకు ఈ రోజు ఏమైంది? ఉన్నట్టుండి ధర్మరాజులాగ నీతి సూక్తులు వల్లిస్తున్నావు"

పండు నుదురు కొట్టుకున్నాడు. "ఏమి టోనే! కొందరు అనవసరంగా పెద్దవాళ్లుగా ముందు పుట్టేస్తారు. వాళ్ల మెదడులు మాత్రం మోకాలు కిందికి దిగిపోతాయి"

గిరిజ వాడి నడ్డిమీద ఒకటి కొట్టింది. "నా మెదడు మోకాలికింద ఉందా? ఎంత పొగరు? "

పండు ఆశ్చర్యంగా అడిగాడు "బావుందే! ఆల్రెడీ అరికాలు కిందికి దిగిపోయిందా? నాకు తెలియదు సుమా, ఇదివరకటి స్థానం లోనే ఉందనుకున్నాను"

గిరిజ వాడిని దొరకపుచ్చుకుని తల్లి దగ్గ రికి తీసికెళ్లాలని వెంటపడింది. ఇంటికి వస్తున్న ఆయనకి వీళ్లిద్దరూ ఎదురుపడ్డారు. "వచ్చిన వాళ్లను చూసుకోకుండా ఏమిటర్రా ఆ పరుగులు? " అని ఆయన విసుక్కొ న్నారు.

కామాక్షి సుబ్బమ్మ ఇంటికి పనుందని వెళ్లి ఉంది. అందుకని పద్మే తండ్రికి ఉప చారాలు చేసి కుశల ప్రశ్నలడిగింది. గిరిజ పెరట్లోనుండి వచ్చి "నాన్నగారూ! మీ చుట్టాలుట. వసంతగారుట. విజయవాడ నుండి వచ్చి రెండు రోజులుండి వెళ్లారు" అంది. ఆయన ఆ మాటలకి తెల్లబోయారు. తర్వాత తెప్పరిల్లి "మన చుట్టాలు ఎవరూ విజయవాడలో లేరు" అని "నాకు స్నానంకి నీళ్లు పెట్టు" అని మాట మార్చారు.

గిరిజ నవ్వుకుంటూ వెళ్లింది.

స్నానం చేస్తున్నా ఆయనకి ఆలోచనలే! ఆ వసంతకి బుద్ధిలేదు. బంకలాగ పట్టు కుంది. తిరుపతి ప్రయాణం ఆమె చలవే కదా! అందరిలో చులకనైపోయాడు. కామాక్షి ఇదివరకటిలాగ దగ్గరికి రావడమే మానేసింది. అది చాలక వసంత ఇప్పుడు ఇక్కడికి రావడం ఏమిటో? కామాక్షికి ఏం చెప్పి వెళ్లిందో? దెయ్యంలాగ సిగ్గు వదిలేసి




ఎన్నైనా చెప్పిఉంటుంది.

ఆయనకి విసుగు వచ్చేసింది. చెపితే చెప్పనీ! తను ఈమధ్య వసంత మొహమే చూడలేదు. కామాక్షి నమ్మితే నమ్మనీ లేక పోతే మానెయ్యనీ! తను లెక్కచేయడు.

ఆయన భార్య ఎప్పుడు వస్తుందా అని చూడసాగారు.

పద్మను దగ్గర కూర్చోపెట్టుకుని తను ఎంత కష్టపడి ఆ సంబంధం చూశాడో, ఆ పెళ్లి అయితే పద్మ ఎంత సుఖపడుతుందో నూరిపోయసాగాడు.

పద్మ జీవితానికి డబ్బు కుప్పలుగా వచ్చే సంబంధం చూశానని ఆయనకి సంబరం. పద్మ ఏమనగలదు? ఇన్ని ఏళ్ళు వచ్చాయి. ఏనాడైనా ఆయనని అది కావాలనీ, ఇది కావాలనీ తను అడిగిందా? కన్న తల్లిదండ్రులనే అడగనివాళ్ళు కట్టుకున్న భర్తని చీరలకోసం, నగలకోసం పీడిస్తారా?

పద్మ ముఖంలోని అసంతృప్తిని ఆయన గమనించకపోలేదు. ఈ గిరిజ ఒకర్తి. దానికి ఏవేవో నూరిపోసి ఉంటుంది. అయినా వాళ్ళ అమ్మ ఇంతకన్నా బింకం పోయింది. ఏమైంది? తండ్రిమాట విని తల వంచుకొని తాళి కట్టించుకుంది. ఆయన పద్మతో అదే అన్నారు, "మీ అమ్మ అంటే నీకు ప్రాణంకదా! మీ అమ్మ జీవితమే నీకు ఆదర్శం కావాలి"

తండ్రి చెప్పిన అన్నిమాటల్లో ఇది ఒక్కటే పద్మకు బాగా నచ్చింది.

కామాక్షికి ఒళ్ళు మండింది. ఏం పెద్ద వాళ్ళు. బిడ్డల ఇష్టాయిష్టాలు ముఖ కవళికల్లో గుర్తింపవచ్చునే! అయినా గుర్తించని గుడ్డివాళ్ళలాగా తాము పట్టిన కుందేలుకి మూడే కాళ్ళంటారు. ఆయన మహా హుషారుగా భార్యతో భోజనం చేస్తూ "ఇది మన ఇంట జరిగే శుభకార్యం. కాదు, మగ పెళ్ళి వారి ఇంట్లో జరిగే పెళ్ళి. పిల్లని ఇచ్చాక వాళ్ళేమిటి, మనమేమిటి? అందరం ఒకటే" నంటూ కబుర్లు చెప్పసాగాడు.

కామాక్షి నొసలు చిట్లించి అడిగింది, "ఏమీ దిక్కులేని వాళ్ళలాగా పిల్లని ఊరేగించుకుని వాళ్ళ ఇంటిమీద పడతామా? మీరు జమీందారులు, ఇంక మా వాళ్ళా అంతకన్నా కుబేరులు. ఇవేం నాకు నచ్చలేదు. ఇక్కడే చేద్దాం" అంది.

ఆయనకి భార్య దెబ్బలాడటం చిరాకనిపించినా ఈ పెళ్ళిసంబంధం విషయంలో ఆమోదించినట్లే మాటలున్నాయని సంబరపడ్డారు.

తమ ప్రస్తుత పరిస్థితులు దృష్టిలో పెట్టుకోమని, ఇంకా పండు, గిరిజల అభివృద్ధికి కష్టపడాలని, కనుక కాళ్ళ దగ్గరికి వచ్చిన సంబంధం కాలదన్నవద్దన్నారు.

అసలే ఆయన మాటకారి. ఇప్పుడు మంచి హుషారు మీద ఉన్నాడు. కామాక్షికి ఎన్ని చీరలు కొందామనుకుంటున్నారో, పిల్లల బట్టలు, బంధువుల పెట్టుపోతలు... అన్నీ గొప్పగా చెప్పసాగారు. కామాక్షికి ఆయన దృష్టి మరల్చడం ఎలాగో అర్థమవలేదు. ఒకవైపు కట్టుకున్న భర్తను వంచన చేస్తున్నానన్న బాధ కలుగుతోంది. మరొకవైపు ఈయనకి ఇంత మొండి పట్టుదల ఏమిటనిపిస్తోంది. టాపిక్ మార్చడానికి "ఈ కబుర్లకేంగానీ ఈమధ్య మీరు వెళ్ళిన ఊళ్ళ విశేషాలు చెప్పండి" అంది.

తలకిందులైనట్లు చూశాడతను. తనంతట తాను భార్య తన ప్రయాణం వివరాలు అడగడమా? ఆయన ప్రేమగా అన్నారు. "ఈసారి ఏదన్నా సన్మానం జరిగితే నిన్నూ తీసుకొనివెళతాను"

★ ★ ★

పెళ్ళి నిర్ణయం చేసుకొన్న రోజు దగ్గరికి వచ్చేస్తోంది. భర్త చూస్తే ఇల్లు కదలటం లేదు. ఏం చేయడమో ఆవిడకి అర్థంగాక కంగారుగా ఉంది. ఆయన ఉంటే చచ్చినా ఈ పెళ్ళి జరపనివ్వరు.

గిరిజ యధాలాపంగా అన్నట్లు, "ఆనంద్ గారు బాగుంటారు కదమ్మా! అక్క గురించి



అడుగుదామా? " అంది. కామాక్షి, "ఆనం ద్‌కేం తక్కువ? బంగారు తండ్రి చక్కటి రూపం. చక్కటి ఉద్యోగం" అంది. కావా లనే ఆయన ధోరణి తెలుసుకొని దాన్ని బట్టి అసలు విషయం చెప్పడానికి వాళ్ళు ఆమాట అన్నా ఆయన మాత్రం మండిప డ్డారు.

"ఒక వంటలక్క మనవడు నాలాంటి ఆర్టిస్టుకి అల్లుడు అవడమా? నా స్టేటస్ ఏం కావాలి? ఏదో స్నేహం చేస్తే చేశారు. అందరినీ బుర్రమీద పెట్టుకోకండి"

"సంచి చేత పట్టుకుని యాయవారం బ్రాహ్మణుల్లాగా బియ్యంకోసం, పక్కవాళ్ళ ఇంటికి, వీధిలోని వాళ్ళందరి ఇళ్ళకూ మీ భార్యాబిడ్డలు తిరిగిననాడు ఈ స్టేటస్ ఏమైంది? సరుకులకోసం షావుకారిని దేవి రించినపుడు స్టేటస్ లేదా? చనిపోయాక అందరం వెళ్ళేది మరుభూమికే. మన స్టేటస్ చూసి మనల్ని వేరే స్వర్గంలో తగ లబెట్టరు" అంది కామాక్షి.

ఆయన ఆవిడ మాటలకు అగ్నిహోత్రుడే అయ్యాడు. "మీ బుద్ధి ఇలా తగలడింది కనుకనే మీ బతుకులు ఇలా ఏడుస్తు న్నాయి. నేను రాజాలాగా బతికాను. సరే! ఒక్కమాట మాత్రం ఖాయం. నా గొంతులో ప్రాణం ఉండగా ఈ పెళ్ళి జర గదు. వాడు నాకు అల్లుడా? " అన్నాడు.

ఆవిడ కొంత తగ్గింది. "పిల్ల ఏదో ప్రసక్తి తెచ్చింది అంతమాత్రంచేత అన్నన్ని మాట లెందుకు? ఎదిగిన పిల్ల ఉన్నాక వంద సంబంధాల గురించి ఆలోచిస్తాం. అయినా మన ఇద్దరివీ ఉత్తర దక్షిణ ధృవాలేమో! మీరు చెప్పిన ఆ కుర్రవాడు మోటుగా, పిప్పళ్ళ బస్తాలాగున్నాడని పిల్లలు చెపుతు న్నారు. వాడు నాకు నచ్చలేదు. మేం అనుకుం టున్నది మీకు నచ్చలేదు. భలేగా ఉంది"

ఆవిడ నవ్వుతాలుగా అంటున్నా ఆయనకి భయంగానే ఉంది.

ఆయనని ఏ ఊరైనా పంపిద్దామన్నా వీలవడంలేదు. "మనం తాంబూలాలు పుచ్చుకుంటామని మా అన్నావదినల్ని, అమ్మనీ, మీవాళ్ళనీ పిలవద్దా? పద్మ ఫొటో చూసే అత్తగారు ఆనందపడింది. ఇంకా మనం ఆలస్యం చేయడం ఎందుకు? ఇద్దరం ఎప్పుడు వెళదాం? " అన్నాడాయన.

పద్మ పరీక్షలవ్వాలని ఇన్నాళ్ళూ ఆపింది కామాక్షి. పద్మ పరీక్షలు ముగిశాయి. ఇంక ఆయనమాట దేముడెరుగు. ముందు పద్మను అర్జెంటుగా ఒక ఇంటిదాన్ని చెయ్యాలనుకుంది. ఆనంద్‌కి, పద్మకి, ఇంట్లో అందరికీ బట్టలు తేవాలి.

ఇంటికి రంగులు వేయించడం మొదలు పెట్టింది.

ఆనంద్ కట్నం వద్దన్నాడు. అయినా వాళ్ళకి ఏ విధమైన లోటు చేయదలచుకో లేదు కామాక్షి. నాగమ్మ ఉంటున్న ఇల్లు స్లాబ్ చేయడానికి మనుష్యులను పెట్టింది. ఏదైతే అయిందని బట్టలు తీయడానికి బజా రుకెళ్ళింది. ఆనంద్‌కి డబ్బు ఇచ్చి నచ్చిన బట్టలు కొనుక్కోమంది.

ఆవిడ ఇస్తున్న కొత్త పంచె, లాల్చీ బట్టలు చూసి ఆయన నవ్వుతూ, "ఇప్పుడు నాకెందుకు ఈ బట్టలు? " అన్నాడు.

"నా వ్యాపారం బాగా సాగుతున్నందుకు నాలుగు డబ్బులు సంపాదించుకోగలిగినం దుకు కానుకగా మీకు ఇవి" అంది.

ఆయన అడిగేశారు, "ఇవి ఇచ్చి కాకాపట్టి, ఏ వరం కోరుకుందామనుకుంటున్నావు? "

"అలాగ ఎందుకనుకోవాలి? ఆర్టిస్టుగారికి సన్మానం చేయాలన్పించి చేస్తున్నాను అను కోవచ్చు కదా!"

ఆయన బెదురు నటిస్తూ, "ఏమో, నువ్వంటే నాకు భయం. సూది ఇచ్చి దబ్బలం లాక్కొంటావు"

ఆవిడ అపనిందలకి గురైనదానిలాగా చూసింది. "ఛ... ఛ... అమాయకురాలినైన నన్ను పట్టుకుని ఇన్ని మాటలూ, నింద లూనా? "




ఆయన వెంటనే అన్నారు, "నువ్వా? అమాయకురాలివా? అందులోంచి 'అ' కొట్టే య్యాలేమో"

"గిరిజా! ఈ రోజు మనం లేచినవేళ బావుండలేదు. ఎన్ని నిందలు పడుతున్నాను ఉదయంనుండీ" ఆవిడ వాపోయింది

ఆయనకి ఎంతో ఉత్సాహంగా అన్పించింది. కామాక్షితో సంభాషణ ఎప్పుడూ ఆయనకి సరదాయే! ఆయన అనుభవిస్తున్న ఆనందం కొట్టొచ్చినట్లు మొహంలో ప్రతిఫలిస్తోంది.

ఆరోజు సాయంత్రం కామాక్షి ముడివేసుకొని, దానిపై ఆకు సంపెంగపూవు పెట్టింది. లేత సిమెంటు రంగు చీర, చివర్న కొద్దిగా తెలుపు అంచున్నది కట్టుకుంది. ముదురు సిమెంటు రంగు జాకట్టు, మెడలో పుస్తెలతాడు, రెండుపేటల నల్లపూసల దండ, జీవితంలోని కష్టసుఖాలను కాచి వడపోసిన ఆ కళ్ళు ఉత్సాహంగా ఉన్నాయి.

ఆయన పది నిముషాలు ఆమెను చూస్తూ ఉండిపోయారు. "కామాక్షీ! నాకు నీ చిత్రం వేయాలని ఉంది. రేపే ప్రారంభిస్తాను. నువ్విచ్చిన బట్టల ఖర్చు వృధా పోదులే!"

ఆవిడ పెదవులపై మల్లెలు తళుక్కుమన్నట్లు నవ్వు, కాంతి. "నేను వాటిని మంచి మనసుతో ఇచ్చాను. మీరే దానికి లేనిపోనివి ఆపాదిస్తున్నారు"

చిరుకోపంతోనున్న ఆమె మొహం ఆయన మనసులో గాఢముద్ర వేసింది. "ఈరోజు మనం సినిమాకి వెళదాం పద" అన్నాడు.

కామాక్షి పెదవులపైకి పిండారపోసినట్లు, వెన్నెలకాంతి పరచుకున్నట్లు నవ్వు వెలిసింది. ఆవిడ ఎలాగో ఆపుకుని, "అదేమిటి? మనల్ని సినిమాకి వెళ్ళి తీరాలని ఎవరైనా ఆజ్ఞాపించారా? " అంది.

ఆయన తన మనసువైపు వేలుపెట్టి చూపించి అన్నారు, "ఇదిగో ఈ మూర్తి, నీ మొగుడు ఆజ్ఞాపించాడు. బయలుదేరు"

ఆవిడ పిల్లలవైపు చూసింది. ఆయన గ్రహించినట్లు, "వాళ్ళెందుకు? వేరే మరొకసారి వెళతారులే"

ఆవిడ ఆయన వెంట బయలుదేరలేదు. "క్షమించండి. వాళ్ళను వదిలి నేను ఆనందం పొందలేను. వాళ్ళకి తీరని కోరికలు నాకెందుకు? " అంది.

నాగమ్మ ఆశ్చర్యపోయింది. భార్య అంటే ఎంతో ప్రేమ ఉన్నట్లు, ఒక్క నిముషం వదలలేనివాడిలాగా అన్పిస్తారు చూడడానికి. మళ్ళీ నెలలు, నెలలు ఇల్లుని, ఇల్లాలిని వదిలి పారిపోతారు. ఎటువంటి మనిషిరా బాబూ అనుకుంది.



కామాక్షి ప్రార్థన ఫలించింది. బరంపురంలోని ఒక సంస్థవారు రాధాకృష్ణమూర్తికి సన్మానం చేయదలిచారుట. వెంటనే అంగీకరించవలసినదిగా ఫోను. కామాక్షి తేలికగా నిట్టూర్చింది. ఆయన ఒప్పుకోవడమా, మానడమా అని ఊగిసలాడుతున్నాడు. చివరికి కోరికే జయించింది.

ఆయన వెళ్ళాక కామాక్షి పద్మ, ఆనంద్

లను కూర్చోపెట్టి కొత్తబట్టలు అందించింది నాగమ్మకి మంచి పట్టుచీర పెట్టింది. ఆనంద్ ఒంటరిగా ఉన్నప్పుడు పద్మ అడిగింది. "ఇలా మనం సాదాసీదాగా వివాహం చేసుకొంటున్నందుకు నిరుత్సాహంగా ఉందా?"

అతడు పద్మవైపు చూశాడు. ఎరుపు సిల్కు జరీచీర, దానిపై చిన్నచిన్న పువ్వులు, ఎరుపు జాకట్టు, చేతులకి అందంగా ఎంబ్రాయిడరీచేసిన జాకట్టు వేసుకొంది. మెడలో సన్నటి గొలుసుతోపాటు సున్నితంగా పనిచేయబడిన నెక్లస్ వేసింది. కాళ్లకి పసుపు ఎంతో శోభనిచ్చింది. ఇంత అందమైన, వినయవంతురాలైన అమ్మాయి తన జీవితంలోకి రావడంకన్నా ఆనందకరమైన విషయం ఏముంది అనుకున్నాడు.

నెమ్మదిగా అన్నాడు, "కలలుండటం తప్పుకాదు. పందిరిలో పెళ్ళి చేసుకోవాలని, మనవాళ్ళు పదిమందీ ఆశీర్వదించాలని, సిగ్గులమొగ్గ అయిన అందమైన పెళ్ళికూతురు తన సుకుమారమైన గోరింట చేతులతో చిటికెనవేలు పట్టుకుని ప్రదక్షిణాలు చేయాలని, ఆ వధువు తాలూకా కొత్తకొత్త శరీర స్పర్శలు మనసులో పదిలంగా దాచుకోవాలని ఇలా... ఎన్నో... ఎన్నో... కలలు. ఎప్పటినుండో పెరిగినవి ఉంటాయి. అలాగని ఆ కలలు నెరవేరడానికి అడ్డుపడే పరిస్థితులను అర్థం చేసుకోలేని వాడిని కాను. కలలకన్నా పరిస్థితులు గొప్పవికదా! ఎటువంటి ఆలోచనలూ పడవద్దు. అమ్మగారు చెప్పింది చేద్దాం"

పద్మ వాలిన కనురెప్పలనుండి రెండు కన్నీటి బిందువులు. అతడు తమ కుటుంబం కొరకు ఎంత త్యాగం చేస్తున్నాడు? అమ్మ అతనిలోని ఈ ఔన్నత్యాన్ని చూసే అల్లునిగా చేసుకోవాలనుకుందేమో?

కామాక్షి తమ వీధిలోని వారిని కొంత మందిని తనతోపాటు పనుల నిర్వహణకి సాయం తీసుకొంది. నాగమ్మ ఇంటి గృహ ప్రవేశం, వధూవరుల సత్యనారాయణ వ్రతం పెళ్లయిన మర్నాడు నిర్ణయించింది. పండుని పంపి బంధువులందర్నీ పిలిపించింది.

పెళ్ళి నిరాండబరంగా రిజిష్టర్ మేరేజ్ చేసినా మర్నాడు అట్టహాసంగా ఫంక్షన్ ఏర్పాటు చేసింది. వచ్చినవాళ్ళతో మొదటే చెప్పింది. "ఈ వివాహం నా భర్తకిష్టం లేదు. ఆయన ఏమిటో, ఆయన చేసే పనులేమిటో మీకు అందరికీ నాకన్నా బాగా తెలుసును. నా బిడ్డల క్షేమం నాకు ముఖ్యం. మీ అందరి చల్లటి ఆశీర్వచనం మా ఇంటికి కావాలి. మీరందరూ ఉన్నారన్న ధైర్యంతో ఆయనకిష్టంలేని ఈ పెళ్ళి జరిపించాను. నా పరిస్థితి అర్థం చేసుకోండి. ఒకటవ్వాలని అనుకున్న ఆ జంటను అభినందించి, ఆశీర్వదించండి"

వాళ్ళు ఆవిడలోని నిజాయితీకి ముగ్ధులయ్యారు. వధూవరులిద్దరూ ఈడూజోడుగా ఉన్నందుకు ఆనందించారు.

మర్నాడు వాళ్ళందరూ వెళుతోంటే కామాక్షి అందరికీ బట్టలుపెట్టింది. బావగారికి, తోడికోడలికి నమస్కరిస్తూ అంది, "మన ఇంటికి పెద్ద మీరు. ఈ పెళ్ళి ఇలాగ జరిగిందని, తమ్ముడు లేడని కలతపడకండి. మేం అంత అదృష్టవంతులం కాదు. ఆయన ఈ పిల్లల ఇష్టాన్ని గమనించరు. ఆయన చెప్పింది చేసి, వీళ్ళ బతుకు పాడు చేయడం నాకురాదు. అందుకే ఏకాకిగా ఈ శుభకార్యం జరిపించాను"

ఆయన కదిలిపోయాడు. మరదలిని ధైర్యంగా ఉండమని చెప్పి వెళ్ళాడు.

కామాక్షి ఆనంద్‌ను పిలిచింది. "ఇది నీ ఇల్లు, మేం నీ వాళ్ళం. నా తర్వాత ఈ కుటుంబభారం నీది. మనిషిలోని చెడ్డతనాన్ని ద్వేషించండి. కానీ ఏనాడూ మనిషిని ద్వేషించకండి. ఎటువంటి తప్పు చేసినవాడినైనా ఆదరించి, అంగీకరించగల మనసు పెంచుకోండి" అని చెప్పింది.




అతడు ఆవిడ మనసులోని భావాన్ని గ్రహించాడు.

ఆనంద్, పద్మలు సంతోషంగా తిరుగుతోంటే కామాక్షికి చూడడానికి రెండు కళ్ళూ చాలడంలేదు. పెళ్ళి అయిన తర్వాత నాగమ్మ కామాక్షిని కౌగలించుకుని అంది, "ఇప్పుడు... ఇప్పుడు మిమ్మల్ని వదినగారూ అని పిలిచే ధైర్యం వచ్చింది. బాబుగారు కూడా వచ్చి, పిల్లల్ని దీవించి మనతో కలిస్తే చాలు. నాకు మరేం అక్కరలేదు"

కామాక్షి ఆవిడ కోరిక విని ఆలోచనలో పడింది. అది జరిగే విషయమా? ఏమో? ఆయన మనస్థితిపై ఆధారపడిన విషయం.

★ ★ ★

ఆనంద్ పద్మ జడ పుచ్చుకుని చిరుకోపంతో అన్నాడు, "మనం వెడదామనుకున్నది ఫస్టు షోకా? లేక సెకండ్ షోకా? ఎప్పటికీ మన ముస్తాబు అవదే? "

పద్మ మృదువుగా జడ విడిపించుకుంటూ, "అబ్బే... రేపు మేట్నీకి" అంది.

"అమ్మో! అమాయకంగా కనబడే ఈ పిల్లకి మాటలు రావనుకున్నాను. ఫర్వాలేదే? చమత్కారివే!"

గిరిజ పక్కనుండి అందుకుంది. "మేమూ మీ విషయంలో అలాగే అపోహపడ్డాం బావగారూ! నోట్లో వేలు పెడితే కొరకడం రానివాడిలాగా ఎలా ఉన్నారో అనుకున్నాం. వేలేం ఖర్మ. మండ కూడా కొరికేస్తున్నారు"

ఆనంద్ జాలిగా చూశాడు. "ఏం చేస్తాం? ఆ కృష్ణుడంతటివాడికే నిందలు తప్పలేదు. నేను ఒక లెక్కా? "

గిరిజ ఊరుకోలేదు. "బావగారూ! కృష్ణుడితో పోల్చుకుని చిన్నఇల్లు పెడదామనుకుంటున్నారా? అదేం కుదరదు. మేం కోపగించామా ముప్పు తిప్పలు పెట్టి మూడు చెరువుల నీరూ తాగిస్తాం"

ఆనంద్ ఆ అమ్మాయిని వెక్కిరిస్తూ "ఏదీ తాగించు చూద్దాం" అంటూంటే, గిరిజవైపు సపోర్టుగా వస్తూ "మూడేం ఖర్మ. ఆరు చెరువుల నీరు తాగిస్తాం" అంది పద్మ.

"అమ్మో! శ్రీమతిగారు ఈ దీనుడిని ఒంటరిని చేసి పుట్టింటి పక్షపాతంతో అటు వెళ్ళారా" అంటూంటే పద్మ, గిరిజ నవ్వసాగారు.

గుమ్మంలోనుండి లోపలికి వస్తున్న రాధాకృష్ణమూర్తి ఆ మాటలు విన్నాడు. ఆయన వాళ్ళవైపు చూశాడు. పద్మ మెడలోని తాళి, కాళ్ళకి మట్టెలు, మొహంలోని వింతకళ ఆయనకి భయం కలిగించాయి. నవ్వుతున్న పిల్లల మొహాలు భయంతో ఎర్రబడ్డాయి. సాయంత్రం వీచే చల్లగాలి కూడా వాళ్ళని చెమటనుండి కాపాడలేకపోతోంది. పద్మకి కాళ్ళూ, చేతులూ వణకసాగాయి. ఆయన అక్కడే నిలబడి పద్మవైపు, ఇంటిగుమ్మంముందు కట్టిన మామిడి తోరణాలవైపు, పందిరివైపు చూశాడు.

"పద్మా!" ఆయన ఉరుము ఉరిమినట్లు పిలిచారు.

పద్మ గజగజా వణకసాగింది.

పద్మ స్థితి చూసి ఆనంద్ ముందుకు వచ్చాడు. ఆమె చేతిని తన చేతిలోకి తీసుకున్నాడు. పద్మ చెయ్యి అంతా చెమటతో తడిసిపోయింది. తండ్రి అంటే పద్మకి ఎంత భయమో అతడికి అర్థమై, జాలి కలిగించింది.

పద్మను నడిపించుకుని తీసుకొని వచ్చి ఆయన పాదాలకి నమస్కరించుతూ, "మావయ్యగారూ! నేను పద్మని రిజిష్టర్ మేరేజ్ చేసుకున్నాను. మీకు చెపితే మా పెళ్ళి జరగనీయరని రహస్యంగా చేసుకున్నాం. మమ్మల్ని ఆశీర్వదించండి" అన్నాడు.

రాధాకృష్ణమూర్తి పాదాలు ఇవతలికి లాగాడు. "ఎవరురా నీకు మావగారు? నా కూతురిని పెళ్ళి చేసుకునే అర్హత నీకు ఉందా. ఒక వంటలామె మనవడు నా అల్లుడవగలడా? నా అంతస్థు ఏమిటి? నీ అంతస్థు ఏమిటి? మా ఇంటికి కుక్కలాగా

కాపలా కాసేవాడివి మా పిల్లని చేసుకోవడమా? ఎంత ధైర్యంరా నీకు? "

ఆనంద్ ఏమాత్రం చెదరకుండా, నిశ్చలమైన స్వరంతో అన్నాడు. "నిజమే మావగారూ! కుక్కకి ఉండే విశ్వాసంతోనే ఈ ఇల్లు కళకళలాడాలని ఈ పెళ్ళికి సిద్ధపడ్డాం. మీరు సున్నిత మనస్కులు. మేం చేసిన తప్పు మన్నించి, మమ్మల్ని పెద్ద మనసుతో దీవించండి"

రాధాకృష్ణమూర్తి ఆ పిలుపు భరించలేని వాడిలాగా అన్నాడు, "ఛట్... కుక్కా! ఎవరు ఇచ్చారురా నీకు ఈ ధైర్యం. ముందు నా ఇంట్లోనుండి బయటికి ఫో... నీ పాపిష్టి మొహం నాకు జన్మలో చూపించకు. ఊ... వెళ్ళు" తర్జని చూపిస్తూ మీది మీదికి రాసాగారు.

ఆనంద్ ధైర్యానికి పద్మ, గిరిజ తెల్లబోతున్నారు. గిరిజకి పెరట్లో కూరలు తెంపుతున్న తల్లి దగ్గరికి వెళ్ళాలనే ఉంది. కాళ్ళు రావడంలేదు.

అప్పుడే అక్కడికి వచ్చిన కామాక్షి ఆయన మాటలకి స్థాణువే అయింది. "ఏవండీ! మీరు తొందరపడవద్దు. ముందు లోపలికి పదండి"

ఆవిడ చేతిలోని బుట్టలో నవనవలాడుతున్న వంకాయలు, బెండకాయలున్నాయి. ఆనంద్‌ను ఆయన అన్న చివరి మాటలకి ఆవిడ మొహం పాలిపోయింది.

ఆయన ఆవిడవైపు చూశారు. "నేను లోపలికి రావాలంటే ఈ వెధవ బయటికి పోవాలి"

ఆవిడ ఆయనను వారిస్తూ అంది, "అతడు మనకి అల్లుడు. మీకు అన్ని విషయాలూ చెపుతాను. తొందరపడి పిల్లలను తిట్టవద్దు"

"తిట్టడమా? మెడబట్టి గెంటుతాను"

"అదే కూడదని చెపుతున్నాను. నవదంపతులైనవాళ్ళని ఆశీర్వదించండి"

నిశ్చలంగా చెపుతున్న ఆవిడ మాటలకి ఆయన విచిత్రంగా చూశాడు.

"ఓ... దీనికంతటికీ సూత్రధారివి నువ్వే కదూ? నీ ధైర్యం లేకపోతే వాడు పద్మని చేసుకోగలడా? నీ ప్రోత్సాహం లేకపోతే అది పెళ్ళికి అంగీకరిస్తుందా? భర్తకి తెలియకుండా ఎంత దారుణం చేశావే? ఇందుకేనా నేను బరంపురం రమ్మంటే రానన్నావు. ఈ ప్లాను కోసం నన్ను తరిమావా? "

"నేను ఏనాడైనా మీ వెంట ఊళ్ళు తిరిగానా? మీ సన్మానాల్లో భాగం పంచుకున్నానా? "

"ఓహో... అయితే ఏమిటంటావు? యజమాని చచ్చిపోయాడనుకున్నావా? అసలు భర్తకి తెలియకుండా కూతురి పెళ్ళి చేసే ధైర్యం నీకు ఎలా వచ్చిందే పాపిష్టి దానా? "

కామాక్షి మెడలోని తాళిని తీసి పట్టుకుని అంది, "ఈ తాళి వలన వచ్చింది. ఈ కన్న కడుపు బిడ్డల జీవితాలను ఆనందమయం చేయమంది"

అతను ఆవిడని చాచి లెంపకాయ కొట్టాడు.

పద్మ, "నాన్నా! అమ్మేం చేయలేదు. నాకు ఈ సంబంధం కావాలని నేనే పట్టుబట్టాను. అమ్మని ఏమీ అనవద్దు"

ఆయన పద్మ మాటలు లెక్కచేయలేదు. భార్యని మళ్ళీ కొడుతూ, "చంపేస్తాను. ముదనష్టపుదానా? చాపకింద నీరులాగా నా మాట కాదని ఈ పెళ్ళి చేస్తావా? నేను చచ్చాననుకున్నావా? ఎంత ధైర్యం? ఎంత నిబ్బరం? నువ్వసలు ఆడదానివేనా? "

కొడుతున్న ఆయనని కామాక్షి సూటిగా చూసింది. "బంధువులందరూ వచ్చారు. పిల్లల్ని ఆశీర్వదించారు. అందరిలాగే మీరూ మాకు ఇన్నిరోజులూ బంధువులాగే మిగిలారు. మీరున్నారని మాకు ఎలా ధైర్యం వస్తుంది? " అంటూ ఆవిడ పిల్లల వేపు చూసింది. "అమ్మా! ఆకలి" అంటే




ఏనాడూ గడపదాటనిదాన్ని. పెదవి విప్పి ఎవరినీ అడగనిదాన్ని. ఇరుగుపొరుగులను అప్పులడిగాను. ఎలా తీర్చగలనని ధైర్యంతో తెచ్చాను? ఏమో! పిల్లలకు కట్టుకుందుకు లేకపోతే చీరలు చింపి బట్టలు కుట్టాను. నలుగురూ నవ్వుతున్నారమ్మా అని పిల్లలు గోలపెట్టినా ధైర్యంగా వెళ్ళాలని చెప్పాను. అప్పుడూ నాలో పెల్లుబికింది ధైర్యమే. భర్త మనసుపడినపుడు వచ్చి పదిరోజులుండి నెలలు నెలలు కళాభివృద్ధికోసం, పేరు ప్రతిష్టలకోసం ఊళ్ళు పట్టుకొని తిరుగుతుంటే, 'నీకు భర్త ఉన్నాడా? లేక భర్త వదిలేసిన ఆడదానివా?' అని సమాజం అన్నా పట్టించుకోలేదు. ధైర్యంగా నిలబడ్డాను. ఎందుకోసం?

"ఈ పిల్లలకోసం? ఈ పిల్లలకోసమే, వారిని ఆనందపరచడంకోసమే ఈ పెళ్ళి చేశాను. ఏది తప్పో, ఏది ఒప్పో నాకు తెలియదు. నా బిడ్డల సుఖమే నాకు కావాలి. వాళ్ళ భద్రత నాకు కావాలి.

"నాకు ఒకటి ఆశ్చర్యంగా ఉంది. అన్నం పెట్టినపుడు ఎందుకు వండావని అడగలేదు. బట్టలు కుట్టించిననాడు, చదువు చెప్పించిననాడు ప్రశ్నలు వేయలేదు? ఈరోజు ఎలా ధైర్యం వచ్చిందని అడుగుతారేం? వాటిలాగే ఇదీ ఆ ధైర్యంతోనే చేశాను"

అతను ప్రళయకాల రుద్రుడే అయ్యాడు. "ఎన్ని మాట్లాడుతున్నావు? దరిద్రురాలా. నిన్ను చంపితే పోయేది. బతకనివ్వడమే నేను చేసిన తప్పు. నా పరువు మంటగలిపావు. నా వంశ మర్యాద కాలరాశావు" అని ఊగిపోయాడు.

కామాక్షి నవ్వింది. "పరువు... మా లావు పరువు. మీరు కాపాడిన మీ వంశ పరువు ఎలాంటిదో ఎవరికి తెలియదు? "

పద్మ తండ్రి చేతులు పట్టుకుంది. "నాన్నా! అమ్మను ఏమీ అనవద్దు. మాదే ఈ తప్పు. ఆనంద్‌గారంటే నాకు ఇష్టం"

ఆయన ఆ పిల్లని ఒక్కతోపు తోశాడు, "ఛీ... నీకు కూడా మీ అమ్మలాగా జంతికలు అమ్ముకునే యోగం దేవుడు రాసి ఉంటాడు. నీ రాత ఇలాగ తగలడితే బ్రహ్మాండమైన ఆ సంబంధం ఎందుకు నచ్చుతుంది. ఆ ముష్టివాళ్ళలాగే బతకండి. పురుగులు పట్టి చస్తారు" అన్నాడు.

గిరిజ రోషంగా అంది, "అమ్మని అంటే ఊరుకోను. మీరు అమ్మని ఎందుకు కొడుతున్నారు? మీరు... మీరు" అంటూ పడిపోయింది.

"గిరిజా... గిరిజా" అంటూ కామాక్షి పిల్లని ఒళ్ళోకి తీసుకొంది. పద్మ తండ్రివైపు తిరిగింది.

"మీరు మా అందరినీ వదులుకొన్నా మేం ఎప్పుడూ మీరు కావాలనే అనుకున్నాం. పుట్టిన దగ్గర్నుండీ ఒక్క తప్పూ చేసి మీకు బాధ కలిగించలేదు. ఈసారి... ఈ ఒక్కసారీ క్షమించండి. మమ్మల్ని ఆశీర్వదించండి"

ఆయన కంపరంగా ఆ పిల్లని తోసేశాడు. "నాకు తెలియకుండా ఏనాడైతే పెళ్లి చేసుకొన్నావో ఆనాడే నువ్వు నాకు లేవు. మీ అమ్మ మొహంకూడా చూడను. ఛీ... నాకు ద్రోహం చేసిన ఈ ఇంట్లో ఒక్కక్షణం ఉండను. మీకూ, నాకూ ఇంతటితో సరి"

కామాక్షి రెండుచేతులూ జోడించింది. "మీరు అంతమాట అనవద్దు. ఈ పిల్లలు, నేను మీవాళ్ళం. మన పరిస్థితులు తెలిసినవాడు, మంచి వాడూ ఆనంద్‌తో అమ్మాయి పెళ్ళి జరిపించాను. మీరు మమ్మల్ని క్షమించండి. లేదా శిక్షించండి. అంతేకానీ సంబంధం లేదని అనవద్దు" ఆ మాటలంటూంటే ఆవిడ గొంతు రుద్ధమైంది.

అతను వికటంగా నవ్వాడు. "ఓహో... నా పెద్దరికం బాగా నిలిపారు. నేనూ, నా నిర్ణయాలూ పనికిరావు. నేను పనికివస్తానుట. పాము విషం, పడగ చుట్టం అన్న మాట" అంటూ వెనుతిరిగాడు. పెద్దపెద్ద

అంగలేసుకుంటూ బయటికి నడిచాడు. "కామాక్షీ! నీకూ నాకూ రామ్‌రామ్, నీ ఇష్టం వచ్చినట్లు బతుకు" అన్న ఆయన మాటలు క్రమేపీ దూరమయ్యాయి.

కామాక్షి కళ్ళనిండా నీరు. పక్కన తల్లిని ఆనుకుని కూర్చున్న గిరిజ. పద్మ ఇదంతా తనవలననే వచ్చిందని ఆయనని బతిమాలుతూ లోపలికి రమ్మనమని ఆయన వెనకగా వెళ్ళింది. కొత్త పెళ్ళికొడుకైన ఆనంద్ మొహం కళావిహీనంగా ఉంది.

కామాక్షికి ఒక్కసారి ఎంతో దుఃఖం వచ్చింది. రెండుచేతులతో మొహం కప్పుకుంది. అయిపోయింది, తాను భయపడినంతా అయింది. ఆయనని సమాధానపరచలేనేమోననే తన భయం నిజమైంది.

పద్మ మాటలను పెడచెవిని పెట్టి కనీసం ఆ పిల్లవైపు అయినా చూడకుండా ఆయన ఆటో ఎక్కాడు.

గిరిజ తల్లిని రెండు చేతులతో చుట్టుకుని ఏడ్చింది. "అమ్మా నువ్వు ఏడవకమ్మా! నువ్వు ఏడిస్తే మేం చూడలేం"

ఆ పిల్ల మాటలకి ఆవిడ మరీ కదిలిపోయింది. పద్మ ఆ ఇంటిని, ఏడుస్తున్న తల్లిని చూసింది. "అమ్మా" అని పిలిచింది.

పద్మ తల్లివైపు చూస్తూ, రెండు చేతులూ మొహంమీదనుండి తీసింది. ఆవిడ కంఠంలోని నరాలు కదులుతున్నాయి. భుజాలు రెండూ దుఃఖోద్వేగం వలన కంపిస్తున్నాయి.

పద్మ మనసు ఆర్ద్రమైంది. ఏనాడూ కదిలి ఏడవని తల్లి. ఈ ఏడుపు జీవితంలో మళ్ళీ చూడకూడదు. ఈమెకి ఆనందం కలిగించే శక్తి మాకు ప్రసాదించు భగవాన్! అంటూ దైవాన్ని ప్రార్థించింది.

తల్లిని చుబుకం పట్టి ఎత్తింది. "అమ్మా! ఎందుకు ఏడుస్తున్నావు? చెప్పమ్మా! ఎందుకు ఏడుస్తున్నావు? "

అక్కడే నిలబడిన ఆనంద్ భార్యవైపు చూశాడు. ఈమెకి ఏమైనా పిచ్చిపట్టిందా? ఎందుకు ఏడుస్తున్నావంటుందేమిటి? అప్పుడే పండు వచ్చాడు. వాడికి అందరూ అలాగ కూర్చోవడం, వాళ్ళ మొహాలు కళావిహీనంగా ఉండటం భయం కలిగించింది. నాన్నగారు వచ్చారా? అనుకొన్నాడు.

పద్మ తల్లిని ప్రేమగా చూస్తూ అంది. "అమ్మా! ఇదంతా మనం ఊహించినదే కదమ్మా! ఆయనకి ఈ సంబంధం ఇష్టం లేదు. ఘర్షణ తప్పదనుకొన్నాం. అలాగే అయింది. ఆయన విషయం మనకి తెలిసినదే! ఆయన ఆ సంబంధం విషయంలో ఏవో ఆశలు పెట్టుకున్నారు. ఆయన మమ్మల్ని ఆశీర్వదించడానికి కొంత సమయం పడుతుంది. ఇవన్నీ నీకు తెలుసుకదా? "

కామాక్షి వెక్కుతూ అంది, "మాకు ఇద్దరికీ ఇంక ఎటువంటి సంబంధం లేదన్నారు. మరి రానన్నారు"

పండుగాడు కోపంగా అన్నాడు "పెద్ద సీనే క్రియేట్‌చేసి వెళ్ళారన్నమాట."

పద్మ చిన్నగా నవ్వింది. "కోపంలో ఎన్నో అంటాం. ఎన్నో చేస్తాం. మనకి తెలిసి అనం, తెలిసి చేయం. నాన్నగారు అనేవే అలాంటి మాటలు! నిన్ను చూడకుండా ఆయన అసలు ఉండలేరు"

కామాక్షి తల ఎత్తి కూతురి మొహంలోకి చూసింది. పద్మ చేతులలోనుండి ఏదో ధైర్యం, నిశ్చింత ఆవిడలోకి ప్రవహించసాగాయి. గిరిజ ఏడుపు ఇంకా తగ్గలేదు. ఆనంద్, పండుల మొహాలు జాలిగొలిపేవిగా ఉన్నాయి. ఆవిడ దృష్టి నాగమ్మమీద పడింది.

ఆవిడ అప్పుడే పనున్నదానిలాగ షాపువైపు నడిచింది. షాపు దగ్గరకి వచ్చినవాళ్ళు ఎవరో ఆవిడని అడుగుతున్నారు. "ఆయన అంత గొడవపెట్టే మనిషని తెలిసి ఎందుకు పిల్ల పెళ్ళిచేశారు. బాబోయ్, ఎంత గొడవ జరిగిందీ? "

నాగమ్మ తేలికగా నవ్వింది. "చూడం




డయ్యా! ఇంటింటా ఉంది ఇటుకల పొయ్యి. మా ఇంట్లో ఉంది మరొక పొయ్యి అన్నారుట నాలాంటివాళ్ళు. గొడవలు అందరి ఇళ్లల్లో ఉంటాయి. సరేకానీ నీకు ఏం కావాలో చెప్పు"

అతడు మరిమాట్లాడలేదు.

కామాక్షి సిగ్గుపడింది. పద్మ మాటలు ఆవిడని కర్తవ్య పరురాలిని చేశాయి. తనే బెంబేలు పడితే, పసివాళ్ళు ఎలా తట్టుకుంటారు? అల్లుడు మరీ భయపడి ఉంటాడు. ఆవిడ కళ్ళు ధైర్యం చెపుతున్నట్లుగా ఆనంద్ వైపు చూశాయి.

ఆవిడ మామూలుగా అవుతూ, "రాత్రికి ఏం కూర చేయను? " అంది.



రోజులు గడుస్తున్నాయి. కామాక్షిలో మార్పు బాగా తెలిసినవారికి మాత్రమే అర్ధమవుతుంది. పనులు యధాతథంగా జరుగుతున్నాయి. పద్మ అప్పుడప్పుడు భర్త దగ్గరకి వెళ్ళడం, అక్కడ వండి పెట్టడం చేస్తోంది. పద్మకి బి.యిడి సీటు రావడం ఆనంద్‌కి, ఇంట్లోనివారికీ ఆనందం కలిగించింది.

గిరిజ తన సమర్ధతతో ప్రైవేటు స్కూల్లో ఉద్యోగం తెచ్చుకుంది. ఆ జీతం తక్కువ. చాకిరీ ఎక్కువ. నాగమ్మ మొదట దెబ్బలాడింది. "ఇంట్లో ఉండి మన వ్యాపారం చూసుకో! బయట ఎందుకు కష్టపడటం? రోజురోజుకీ చీటీలు పెరిగిపోతున్నాయి" అని.

గిరిజకి ఆశ్చర్యం. డబ్బు లేదంటారు. వచ్చిన డబ్బంతా చీటీలు కట్టేస్తారు. సరేనని తల్లికి సాయంగా డబ్బు లెక్కలు చూసే బాధ్యత గిరిజ వేసుకొంది.

కామాక్షి భర్త దగ్గరినుండి ఫోనుగానీ ఉత్తరంగానీ వస్తుందేమోనని చూస్తోంది. ఏదీ అవడంలేదు. మొండి మనిషి. కోపం ఇంకా తగ్గి ఉండదు అనుకుంటోంది.

రాధాకృష్ణమూర్తికి ఎక్కడికి వెళ్ళాలో తెలియలేదు. చివరికి హైదరాబాద్ ప్రయాణమయ్యాడు. కొన్నాళ్ళు అక్కడ ఉందాం. నచ్చకపోతే మరో ఊరు ఉండనే ఉంది అనుకున్నాడు. పెళ్ళి వాళ్ళ ఇంటికి వెళ్ళి విషయం చెప్పాలని కూడా అన్పించలేదు. హైదరాబాద్ వెళ్ళాక అప్పుడు అక్కడనుండి వాళ్ళకి ఫోను చేశారు.

ఇంటి విషయం తలుచుకొన్నకొద్దీ ఆయనకి ఆగ్రహం రాసాగింది. ఏంమనిషి? తను అనుకున్నది అలాగ జరిపించేసిందే? భర్త అన్న భయం ఉందా?

ఆయనకి ఆ క్షణంలో ఒక నిజం గుర్తు వచ్చింది. వాళ్లందరూ స్వశక్తిని నమ్ముకున్నారు. బతుకంటే వారికి భయంలేదు. ఎవరి పోషణకిందో పడి ఉండేవారైతే ఇంత ధైర్యంచేయరు.

అప్పుడు... అప్పుడు మొదటిసారిగా తన మీద తనకి కోపం వచ్చింది. తను ఒక అవివేకి. కుటుంబాన్ని చెప్పుచేతలలో పెట్టుకోలేకపోయాడు. నెలకింత అని ఎప్పుడైనా పడేశానా? అంతరాత్మ నిలదీసింది. నీ సెంట్లు, నీ పౌడర్లు, నీ సబ్బులు, నీ షోకులు, నలగని నీ బట్టలు చూసుకున్నావు కానీ వాళ్ళ విషయాలు చూశావా?

ఆయనకి చప్పున గుర్తు వచ్చింది. వాళ్ళకి



ఐదారుజతలకంటే బట్టలుండవు. తనకి ఏ ఇరవై జతలో ఉంటాయి. ఏ ఊర్లో బంధువులుంటే వాళ్ళ ఇళ్ళల్లో ఉంటాయి. ఉన్నందుకు మోహమాటంగా, వాళ్ళ మెప్పుకోసం డబ్బు ఖర్చుపెడ్తాడు. ఆయనకి వెంటనే బరంపురం వెళ్ళేందుకు తన దగ్గర తగినంత డబ్బు లేకపోతే కామాక్షి ఇవ్వడం గుర్తువచ్చింది. ఛ... ఛ... దాని డబ్బు తనకెందుకు? వెళ్ళినపుడు పడెయ్యాలి? ఆయన ఉలిక్కిపడ్డారు. వెళ్ళడమంటూ ఉంటుందా? ఆయన కళ్ళకి గిరిజ, పండు, పద్మ, కామాక్షి కనబడ్డారు. ఇదివరకే వాళ్ళకి భయంలేదు. ఇప్పుడు భవిష్యత్తంటే మరీ నిశ్చింత. అల్లుడు, నాగమ్మ ఉన్నారు కదా!

ఆయన తల విదిలించారు. ఈ వెధవ ఆలోచనలు పోవాలంటే విధిగా చిత్రాలు వేయాలి.

ఆయన కావలసిన పరికరాలు తీసి బొమ్మ వేయడంలో మునిగిపోయారు.

'శివధనుర్భంగం' చిత్రం అద్భుతంగా వచ్చింది. పూమాలతో, సిగ్గుదొంతరలతో సీత అతి అందంగా ఉంది. సీతారాములను చూడగానే పద్మ, ఆనంద్‌లు గుర్తువచ్చారు. ఆయనకి ఏవైతే మరిచిపోవాలని ఉందో అవే గురురావడం నరకంగా ఉంది. సీతకన్నులలోని కాంతి, ఆనంద పారవశ్యం ఆయనకి తృప్తి కలిగించింది.

వరుసగా రోజూ చిత్రాలు వేయసాగారు. అవి హైదరాబాద్‌లాంటి పెద్ద సిటీలో తేలికగా అమ్ముడుపోతున్నాయి. డబ్బు చేతికి వస్తోంది.

★ ★ ★

పండుకి ఇష్టమని కామాక్షి కలర్ టీ.వీ కొంది. ఆరోజే దాన్ని తెచ్చారు. కామాక్షికి ఏ వస్తువు వచ్చినా ఈ సమయంలో భర్త ఉంటే బావుంటుందికదా అనిపిస్తుంది. ఆయన కూడా వాళ్లలాగా సంబరంగా చూసేవాళ్లు కదా! పడకకుర్చీలో పడుకుని తనతో మాట్లాడుతూ ఆయన కూర్చుంటే ఎలా ఉంటుందో అనిపించింది.

పండు బుంగమూతి పెట్టి అన్నాడు. "ఏమిటమ్మా ఎన్నిసార్లు పిలిచినా పలకవు. టీ.వీ మోడల్ నచ్చిందా? "

పద్మ సాలోచనగా అంది, "అమ్మ ఈమధ్య తరచుగా పరధ్యానంలో పడిపోతోంది. నీరసంగా కనిపిస్తోంది. అమ్మను డాక్టరు దగ్గరకు తీసుకెళ్లి చూపిద్దాం"

కామాక్షి తననుతాను తిట్టుకుంది. పిల్లలు అన్నది నిజమే. ఈ మధ్య ఏది తిన్నా, ఏంకొన్నా ఆయనే గుర్తు వస్తున్నారు. ఇదివరకు కూడా ఆయన తిరిగేవారు. కానీ ఇంత ఎక్కువగా ఊహలలో అనిపించలేదు. ఆమె మనసు బదులిచ్చింది. అప్పుడు ఎప్పుడో వస్తారని ధీమా. పక్షి ఎంతవరకని ఎగురుతుంది? గూటికి వాలకపోతుందా? అన్న ధీమా. ఇప్పుడు... ఇప్పుడు ఆయన మాటలు పట్టించుకుంటోందా?

భర్త గొంతు వినబడడంతో ఆవిడ ఉలిక్కిపడింది. వీధివాకిలి వైపు చూసింది. పండు వెంటనే సంబరంగా అన్నాడు, "అమ్మా! టీ.వీ లో నాన్నగారితో ఇంటర్వ్యూ. భలే. మనం కొన్నరోజునే ఈ ప్రోగ్రాం"

గిరిజ నవ్వుతూ అనేసింది, "అమ్మ ప్రేమంటే ఏమిటనుకున్నావు? ఆ పరధ్యానం నాన్నగారిగురించి. అందుకే ఆయన కనిపించారు"

కామాక్షి కళ్ళింతలు చేసుకుని ఆ ప్రోగ్రాం చూస్తోంది. ఆయన కూడా తనని చూస్తున్నట్టు అన్పించింది. ఆయన తన కళ గురించి, కళలోని లోతుల గురించి చెపుతున్నారు.

"కళలకి సరైన ప్రోత్సాహం లభించడం లేదు. ప్రభుత్వం పాఠశాలల్లో కొన్నింటిలో మాత్రం డ్రాయింగ్ పోస్టులు పెట్టింది. వాళ్ళైనా సైన్స్ బొమ్మలకే పరిమితమవుతున్నారు"

"మరి ఏం చేయాలంటారు? "





"ప్రభుత్వం చిత్రకళా ప్రదర్శనలు నిర్వహించాలి. యువతరం కూడా కళలయందు ఉత్సాహం చూపించాలి. కళ వలన మనం పొందే తృప్తి అనిర్వచనీయం. ప్రతి తల్లిదండ్రులూ తమ పిల్లలకి ఒక సంగీతమో, సాహిత్యమో, ఒక చిత్రలేఖనమో నేర్పించాలి. ఎక్కడ కళలకి సంబంధించిన మీటింగులున్నా వాళ్లను తీసుకెళ్లాలి"

"చాలా మంచి విషయాలు చెప్పారు. మీ పిల్లల్లో ఎవరికైనా ఈ విద్య వచ్చిందా? "

"నా కొడుకు వేస్తాడు. నఖ చిత్రకళలో కూడా వాడు పాండిత్యం సంపాదించాడు"

"యువతకి మీరిచ్చే సందేశం? "

"విద్యను తపస్సుగా భావించాలి"

ఇంటర్వ్యూ ముగిసినా టీ.వీ వైపే చూస్తున్న తల్లిని చూసి గిరిజ పాడింది. 'కుశలమా? నీవు కుశలమేనా? ఎటనుంటివో ప్రియతమా? '

నాగమ్మ అంది "ఉండు తల్లీ! ఆ పాటలు పాడే సమయం నీకూ వస్తుంది"

తర్వాత కామాక్షికి ఏమీ తోచలేదు. మనసు ఇంత ఉద్విగ్నత ఎప్పుడూ పొందలేదు. పండు టి.వి. స్టేషన్‌కి ఫోను చేసినా, ఎడ్రస్ కరెక్టుగా చెప్పలేకపోయారు. మొత్తానికి ఆయన హైదరాబాద్‌లోనే ఉన్నారని తెలిసింది.

★ ★ ★

ప్రభుత్వం ఉపాధ్యాయ పోస్టులు నింపుతోంది అని తెలియగానే గిరిజ ఆనందానికి అంతులేదు. ఆనంద్‌కి భీమవరం దగ్గరలోని చినమిరంలో పోష్టుకి ట్రాన్స్‌ఫర్ అయింది. అతడు దీని గురించి గట్టి ప్రయత్నమే చేశాడు. కామాక్షికి ఎంతో సంతోషం అన్పించింది. పిల్లాడు ఇంటిదగ్గర ఉంటాడు. రోజూ వెళ్లి వచ్చెయ్యవచ్చును.

సుబ్బమ్మ తన బోసినోరు తెరిచి నవ్వుతూ అంది. "శుభాలు వస్తే ఒకటే పరంపరల్లాగా వస్తాయిట. పిల్ల పెళ్ళి అయింది. అల్లుడు ఉద్యోగంతోసహా దగ్గరకి వచ్చాడు"

గిరిజ అంది "మామ్మగారూ! నాకూ ఇక్కడే ఉద్యోగం వచ్చెయ్యాలని దీవించండి"

ఆవిడ బుగ్గలు పుణికింది. "అవునుగానీ పిల్లా! ఎవరైనా పెళ్ళి జరగాలని దీవించమంటారు. నువ్వు ఉద్యోగం అన్నావు. సరే! అదీ దీవిస్తాను. ఇదీ దీవిస్తాను"

ఆవిడ కామాక్షి భుజం తట్టి అంది. "ఒక నాటి కామాక్షికి, ఇప్పటి మా కామాక్షికి తేడా ఆలోచిస్తూ ఉంటాను. నీ బ్రతుకులో మార్పులు వచ్చాయికానీ నీలో మార్పు రాలేదే" అని కాసేపాగి,

"నాకొక కోరిక ఉంది. తీరుస్తావా? "

కామాక్షి, వినయంగా అంది "తప్పక చెప్పండి"

సుబ్బమ్మ సాలోచనగా చూస్తూ చెప్పింది. "నా చివరి యాత్ర నీ చేతులమీదుగా జరగాలి. నేను చనిపోయినా మీరు నా ఇంట్లో దీపం వెలిగించాలి"

కామాక్షి వెంటనే "ఎవరుముందో! ఎవరు వెనుకో ఎవరు చెప్పగలరు? మీకు నా సేవ ఎప్పుడూ ఉంటుంది. నేను ఉండని పక్షంలో పద్మ సేవ ఉంటుంది" అంది.

సుబ్బమ్మ కామాక్షి మాటలకి కోప్పడింది. "ఏమంత వయసు అయిపోయిందని అలాగ మాట్లాడుతున్నావు? మనవలను, మనవరాళ్ళను ఎత్తవద్దా? "

కామాక్షి విరక్తిగా నవ్వింది. "ఇప్పటికే నేను నడిచినడిచి అలిసిపోయాను. ఎక్కువ కాలం బ్రతికేస్తున్నానేమోనన్పిస్తోంది" అంది.

ఆవిడ కామాక్షితో దెబ్బలాడింది. పిల్లల వైపు తిరిగి "మీ నాన్నని రమ్మనండిరా! ఎన్నాళ్ళు దేశ దిమ్మరిలాగ తిరుగుతాడు? ఆయనని ఒకసారి చూస్తే మీ అమ్మకి హుషారు వస్తుంది"

పండుకి రోజుకి ఒకసారైనా తల్లి ఒళ్ళో పడుకోపోతే తోచదు. ఆ విషయంలో అప్పుడప్పుడూ గిరిజ పోటీకి వస్తుంది.



పండు తల్లితో "అమ్మా! నా పెళ్ళి ఎప్పుడు చేస్తావు? " అన్నాడు.

అక్కడే ఉన్న గిరిజ "దానికేం భాగ్యం! వెధవ పనులు చేస్తే ఇప్పుడే చేస్తాం" అంది.

"నిన్ను మాట్లాడమనలేదే తల్లీ! అన్నింటికీ పుల్లారు బుడ్డిలాగ వస్తావు" అని మళ్ళీ తల్లివైపు తిరిగి,

"అమ్మా! చెప్పమ్మా! ఎప్పుడు చేస్తావు? "

"వెధవకి రాత్రిళ్ళు పెరట్లోకి వెళ్ళడానికి భయం. పెళ్ళి మాత్రం కావాలిట"

"నీకేం తెలుసునే నా బాధ. నువ్వు చూస్తే 'భీష్మిణి'లాగ పెళ్ళి వద్దంటావు. ఆడపిల్ల అదే చేసుకోకపోతే నీకెందుకురా పెళ్ళి అని అమ్మ అనెయ్యగలదు. లేదా నాన్నగారు మరో గజలక్ష్మిని నాకోసం తేగలరు. అందుకని ముందు జాగ్రత్తగా అడుగుతున్నాను"

కామాక్షి గిరిజని బతిమాలింది. "ఉద్యోగం అన్నావు. కాస్త దగ్గర ఊరులోనే పోష్టింగ్ వచ్చింది. నీవు ఉద్యోగం చేసినా ఇష్టపడే వాళ్ళను చూడమన్నావా? ఇద్దరూ హాయిగా ఉద్యోగం చేసుకొంటూ బతకవచ్చును"

పండు తనూ అందుకున్నాడు. "పనిలో పని. దీనితో పాటూ నాకూ చేసెయ్యమ్మా? "

"ఎవరైనా చదువూ సంధ్యా చూసుకొని అప్పుడు ఉద్యోగం ఏడ్చి, ఆ తర్వాత పెళ్ళి చేసుకొంటారు"

పండు అక్క మాటలని నోటితో చప్పరిస్తూ "ఆ... నూటికి తొంభైతొమ్మిది మంది లోకంలో అలాగే చేస్తున్నారు. మన దారి మాత్రం వేరు. మొదట పెళ్ళి, తర్వాత చదువు, తర్వాత ఉద్యోగం"

కామాక్షి వాడి మాటలకి నవ్వింది. గిరిజ చిరాకుపడింది.

"తగ్గు మేడమ్! మీ స్కూలుకి వచ్చి పిల్లలచేత నిన్ను అల్లరి పెట్టించెయ్యగలను. అప్పుడు కుదురుతుంది. అమ్మాయి పని"

పండు తల్లితో అన్నాడు. "అమ్మా! బావగారిని చూస్తే, ఆయనకి పద్మక్క చేస్తున్న సేవలు చూస్తే, గమ్మున పెళ్ళిచేసుకొని ఆ సేవలన్నీ పొందాలని ఉంది"

పద్మ తమ్ముడి వీపుమీద కొట్టి "వెధవ. అన్నీ చూడటమే! వాడికి అక్కరలేనివి లేవు" అంది.

"అమ్మా! మొన్న నేను బావకోసం గదిలోకి వెళ్ళినపుడు..."

పద్మ అతడినోరు మూసేసింది. ఆనంద్ నవ్వుతూ "పండూ నీకేం కావాలో చెప్పు.. ఈ అల్లరి ఎందుకు? " అన్నాడు.

"అమ్మని నా పాకెట్ మనీ పెంచమనండి. మరీ ఇబ్బందిగా ఉంది" అన్నాడు.

అందరూ నవ్వేశారు.

★ ★ ★

పద్మకి నెల తప్పిందని తెలిశాక కామాక్షి ఆనందానికి అంతులేదు. తనని 'అమ్మమ్మా' అని పిలిచే చిన్న తండ్రి ఒకడు వస్తున్నాడు. కామాక్షి, నాగమ్మ ఇద్దరూ పద్మని కాలు కిందపెట్టనీయడంలేదు. గిరిజమీద ఒత్తిడి పెరిగింది పెళ్ళి చేసుకోమని.

"అమ్మా! నన్ను ఇలాగ హాయిగా ఉండనీయవా? ఈ పెళ్ళిళ్ళు అంటే లాటరీ! సుఖపడతామో, కష్టపడతామో తెలియదు. నేను ఆ బాధలు పడలేను" అంది గిరిజ.

పండు తలకొట్టుకుంటూ అన్నాడు. "చెప్పానా? ఇది ఇలాగే నాకొంపమీదికి తెస్తుంది. దీనికి బుద్ధి ఎప్పుడు వస్తుందో? "

గిరిజ తమ్ముడిని కోపంగా చూసింది.

"అక్కని చూడు. చక్కగా ఎలా కాపురం చేసుకొంటోందో? అందరి బతుకులూ ఒకేలాగ ఉంటాయా? నీకూ మంచివాడిని చూస్తాను. నా మాట విను. లెక్చరర్‌గారి మేనల్లుడు ఉన్నాడుట. ఉద్యోగస్తురాలు కావాలంటున్నాడుట. అడగనా? " అంది కామాక్షి.

"నేను చెప్పలేనమ్మా! మనకి అర్థమైన





వాడు, మనల్ని అర్థంచేసుకొన్నవాడు దొరకా లంటే మాటలతో పనికాదు"

"మనకి అర్థమైనవాడు, మనల్ని అర్థం చేసుకొన్నవాడు తరువాత. అసలు అర్థమే లే నివవాడు జతపడితే బావుంటుంది గిరి జక్కా! నోట్లో వేలుపెట్టుకొని నీ వెనకాలే చక్కగా తిరుగుతాడు"

గిరిజ తల్లివైపు తిరిగి అంది. "అమ్మా! పండుగాడికి వస ఎక్కువపోశావా చిన్న ప్పుడు"

"ఆ... పాలు పోయలేనప్పుడు పోనీలే అని ఏ వసో పోసి ఉంటుంది. ఏం రేపు నీ పిల్లలకీ పొయ్యమన్నావా?" గిరిజ పద్మవైపు తిరిగి "అక్కా వీడినోరు మూయిం చవా?"

రెండురోజులు దాటాక పద్మ తల్లితో అంది. "గిరిజని తొందర పెట్టకమ్మా. మరో ఏడాది ఉద్యోగపు సరదా తీరాక అదే చేసు కొంటుంది. ఈలోపు మంచివనుకొన్నవి చూద్దాం"

గిరిజ విషయంలో వేచిచూడక తప్పదను కుంది కామాక్షి.

గుండ్రాయిలాగ తిరుగుతున్న షాహు కారు హార్ట్ఎటాక్ వచ్చి పోయినప్పటినుండీ కామాక్షికి మనసులో మరొక ఆలోచన బయలుదేరింది. ఎవరు ఎప్పుడు చనిపో తారో తెలియదు. ఈరోజుల్లో చావు మామూలైపోయింది. అందుకే గిరిజ పేర డబ్బు ఫిక్స్డ్ చేసేసింది. తను ఉంటుందో, ఊడుతుందో ఏం తెలుసుననుకుంది.

పండు చదువుకోసం ఎలానూ డబ్బు వేరేగా ఎప్పటినుండో వేస్తోంది. తను ఈ వ్యాపారం ప్రారంభించి, నిలద్రొక్కుకున్నా టినుండీ పిల్లలకి వేరువేరుగా డబ్బు వేయడం అలవాటు చేసుకొంది. పది రూపాయల దగ్గర ఒక రూపాయి అయినా దాచాలి. ఎంతో కొంత ఖర్చు పెడదామను కున్న దానిలో మిగల్చాలి. ఈ పొదుపును ఆమె తప్పనిసరిగా పాటించింది. చివరికి సామాను కొందామని వెళ్ళినా, దాంట్లో కొంత తీసి ఉంచేసేది. "జాగ్రత్త నీకు మరీ అధికం" అంటూ గేలిచేసినా చలించలేదు. చివరికి ఈ జాగ్రత్త ఆమెను ఎక్కడ వరకూ తీసికెళ్ళిందంటే ఇంట్లో వండుకొందామని తీసిన కూరలు, ఉల్లిపాయలు కూడా కొన్ని వెనక్కి మళ్ళీ ఉంచేది. ఆమె చేసే ఈ పొదుపు ఆమెకి ధైర్యాన్ని ఇచ్చింది. రేపటి గురించి బెంగ లేకుండా చేసింది. ఆమె చర్యలు చూసి సుబ్బమ్మ నవ్వేది. "నువ్వు మా అందరికీ ఒక పుస్తకంలాగ అయిపో యావే" అనేది. మంచి చెడ్డలు తెలియచేసే ఆ పిల్ల సాంగత్యం ఎన్నో విషయాల్లో అందరికీ ఆచరణయోగ్యం అంటూ ఆవిడ తన దగ్గరకి వచ్చేవాళ్ళకి చెప్పేది. పర్సులో గానీ ఇంట్లోగానీ ఆమాత్రం డబ్బు మిగల్చక పోతే నీకు నిద్రపట్టదు అని నవ్వేది. ఈ జాగ్రత్త వలన ఈమె అందరిలాగ సుఖపడ లేకపోతోంది. కావలసిన నగలుగానీ బట్ట లుకానీ కొనుక్కొందామని అనుకోదు. ఏ అవసరం ఎప్పుడు వచ్చి మీదపడుతుందో, బిడ్డలు ఏ ఇబ్బంది పడతారో అనే చూస్తుంది.

కామాక్షికి కలలువస్తాయి. ఇప్పటికీ ఆ కలలో బియ్యం ఇంట్లో నిండుకొంటున్నట్లో, తను వెళ్ళి నెమ్మదిగా తన ఇబ్బంది చెప్పి అప్పు అడుగుతున్నట్లో, గిరిజ ఆ కలలో ఏడుస్తున్నట్లో వస్తాయి. ఉలిక్కిపడి లేచి చుట్టూ చూస్తుంది. కలో, వాస్తవమో కాసేపు అర్థంకాదు. ఎదురుగా సుఖని ద్రలోనున్న పిల్లలను చూశాక అప్పుడు ప్రాణం కుదుటపడుతుంది.

రాధాకృష్ణమూర్తికి తెలిసిన దూరం బంధువులు కనబడి రమ్మంటే మొహమా టానికి వెళ్ళాడు. వెళ్ళిన రెండు రోజులకు ఒంట్లో బావుండలేదు. విపరీతమైన నీరసం, ఎప్పుడూ కాళ్ళు, చేతులూ పీకులు, ఎప్పటిక ప్పుడు ఆకలి! అక్కడికీ సిగ్గు విడిచి వాళ్ళని కాస్త కాఫీ ఇయ్యమ్మా, కాస్త ఏదైనా టిఫిన్

చెయ్యమ్మా అని అడిగేవారు. కొత్తలో వాళ్ళు ఆయనకి చాలా మర్యాదలు చేశారు. అటువంటి గొప్పవ్యక్తి తమ ఇంటికి రావడం తమ అదృష్టమన్నారు.

★ ★ ★

వారం రోజులు గడిచేసరికి రాధాకృష్ణ మూర్తికి నీరసం మరీ ఎక్కువైంది. బుగ్గలు లోపలికి పోసాగాయి. ఆయన చుట్టం ఆయనను తీసికొని మంచి డాక్టరు దగ్గరకి వెళ్లాడు. చుట్టం డాక్టరు ఆయన ఆర్టిస్టు అని తెలిసికొని ఎంతో సంతోషించి ఆత్మీయంగా పరీక్షలు జరిపించాడు. చివరికి ఆయనకి బ్లడ్‌షుగర్ అని తేల్చి చెప్పారు.

డాక్టరు ఆయనని వర్రీ అవవద్దని చెప్పి మందులు రాసిచ్చాడు. "ఈ మందులుకన్నా మీకు ఇంట్లో వాళ్లు చేసే ఉపచారాలు ముఖ్యం. చోళ్ల అంబలి చేసుకొని తాగండి. పంచదారను పొరపాటున కూడా దగ్గరికి రానీయవద్దు. అన్నం తక్కువ తినండి. కూరలు ఎక్కువ చేయండి" అంటూ ఎన్నో సూచనలు చెప్పాడు. ఎంత జాగ్రత్తగా ఉంటే అంత మంచిదని చెప్పాడు.

రాధాకృష్ణమూర్తికి బాధ కలిగింది. తనకి అనారోగ్యం! జాగ్రత్తగా ఉండాలి. కళ్లనీళ్లు తిరిగాయి. చిత్రాలు వేస్తోంటే చేతులు పీకినపుడు వయసు మళ్లుతోందికదా అనుకున్నాడుకానీ ఈ భయం కలగలేదు.

ఇంటికి వచ్చాక చుట్టం తన భార్యతో విషయం చెప్పాడు. రాధాకృష్ణమూర్తి వాళ్లకి ఐదువందలు తీసి ఇచ్చాడు ఉంచమని. మొదట్లో ఆవిడ బాగానే శ్రద్ధగా చూసింది. రానురాను ఆవిడకి ఇంట్లో పిల్లలకి, భర్తకి చేయలేక విసుగు వచ్చేస్తోంది. దానికి సాయం కదలని ఈ చుట్టం. 'మంచినీళ్లు ఇయ్యమ్మా, కాఫీ కాస్త ఇయ్యమ్మా' అంటూ అస్తమానూ పిలిచే ఆయనని భరించడం కష్టమనుకుంది. క్రమేపీ విసుక్కోవడం మొదలుపెట్టింది.

అతను తరచుగా వెళ్లి డాక్టరు దగ్గర టెస్టు చేయించుకుంటున్నాడు. "ఏమిటండీ షుగరు తగ్గడానికి బదులుగా పెరుగుతోంది. ఏవిధమైన బెంగలూ వద్దని చెప్పలేదా? మీరు సహకరించకపోతే ఇది మరీ ఇబ్బంది పెడుతుంది" అన్నాడు డాక్టర్.

ఓ నిట్టూర్పు విడిచి, డాక్టరుగారికి తను వేసి తెచ్చిన చిత్రాన్ని బహూకరించాడు. ఆ చిత్రం చూసి డాక్టర్ ముగ్ధుడయ్యాడు.

రాధాకృష్ణమూర్తికి ఏనాడూ విసుగులూ, చిరాకులూ పడటం తెలియదు. డబ్బు ధారాళంగా ఖర్చుపెడతాడు. కాలుమీద కాలు వేసికొని దర్జాగా బతికేవాడు. తన ఇంట్లో భార్య విసుగ్గా ఉండటం, తనని కసరడం, కోపగించడం ఎప్పుడూ అనుభవంలో లేదు. ఇక్కడ అతనికి ఇబ్బందిగా ఉంది. నీరసానికి ఏదో ఒకటి అడగకా తప్పటం లేదు. ఆవిడ ఏదో ఒకటి అంటూ ఇవ్వకా తప్పడంలేదు. మొదటిసారిగా తన రాకను ఇష్టపడనివారిని చూశాడతను. ఇంటాయన ఆవిడని బతిమాలుతూ "పాపం, ఎప్పటికప్పుడు డబ్బు ఇస్తున్నాడుకదే! కాస్త ఓర్చుకో! కాస్త ఆరోగ్యం చిక్కాక ఆయన వెళ్లక ఇక్కడే ఉంటాడా? " అనడం విన్పించింది.

"బావుందండీ! అనారోగ్యాలు వస్తే కట్టుకున్న భార్యో, కన్న పిల్లలో చేయాలి. ఇలాగ చుట్టరికం అంటూ వచ్చి తిష్ఠవేస్తే భరించవద్దా? మీకేం మీరు చెపుతారు. అన్నీ అమర్చేటప్పటికి నాకు నీరసం వస్తోంది" అంటూ నిర్మొహమాటంగా చెప్పడం విన్పించింది.

ఆయనకి ఇంక అక్కడ ఉండబుద్ధి పుట్టలేదు. ఊళ్లోనే హోటల్ చూసికొని వెళ్లిపోయాడు.

కామాక్షి అతనికి గుర్తు వస్తోంది. తనకి ఎన్ని ఉపచారాలు చేసేది. అడుగడుగునా ఎన్ని సౌకర్యాలు కల్పించేది. చంటిబిడ్డను సాకినట్లు సాకేది. తనకి పచ్చకామెర్లు వచ్చాయి ఒకసారి. అప్పుడు ఆవిడ చేసిన సేవలు అపూర్వం. తను మజ్జిగన్నం




తింటున్నాడని ఆవిడకూడా అదే తిందిట. గిరిజ చెప్పేవరకూ తనకి తెలియదు.

మరోసారి హైడ్రాసిల్ ఆపరేషన్ అయింది తనకి. అప్పుడు తనతో హాస్పిటల్‌కి వచ్చి, జాగ్రత్తగా ఇంటికి తెచ్చి ఎంత కనిపెట్టుకుని ఉండేది. కంచంలో అన్నం పెట్టి విసిరే ఆ ఇల్లాలు, కాళ్లు పీకుతున్నాయంటే ప్రేమతో పట్టే ఆ కామాక్షి, తను అడగకుండానే తనకి ఇష్టమైన పదార్థాలు చేసి సిద్ధం చేసి ఆప్యాయంగా కొసరికొసరి తినిపించే ఆ స్త్రీమూర్తి, తను సరదాగా చెప్పే కబుర్లు వింటూ ముసిముసిగా నవ్వే ఆ నిష్కల్మష హృదయిని గుర్తు వస్తోంది. కామాక్షి సాంగత్యం కోసం అతని మనసు పరితపిస్తోంది.

★ ★ ★

కామాక్షి మనవరాలిని తీసుకొని సుబ్బమ్మ ఇంటికి బయలుదేరింది. "టాటా... బైబై" అంటూ పాప ఒకటే అల్లరి చేస్తోంటే బయటికి తీసుకెళ్లక తప్పటం లేదు. ఉదయం, సాయంత్రం పాపకి షికార్లు కావాలి.

సుబ్బమ్మ "వచ్చారా అమ్మమ్మా, మనవరాలూ. రండి రండి" అంటూ పిల్లదానికి కాస్త మురమరాలు పళ్లెంలో పెట్టి ఇచ్చింది. ఇద్దరూ కబుర్లలో పడ్డారు. పాప మధ్యలో "అమ్మమ్మా" అంటూ పిలుస్తూనే ఉంటుంది. కామాక్షి ఓయ్ అంటూ పలుకుతూనే ఉంటుంది.

సుబ్బమ్మ నవ్వింది. "ఏం చిత్రమే! అమ్మనో, నాన్న అనో అంటారు. నీ మనవరాలు మాత్రం అమ్మమ్మ జపం చేస్తుంది. పిల్లా! దీని రూపం, పోలిక నీ భర్తవేనే!" అంది. కామాక్షి పాపను చూస్తూ, అవునన్నట్లు తల ఊపింది. "ఆయనగారు ఈ పిల్లని చూశాడా క్షణం వదలడు. ఇంక ఈ ఊళ్లు గీళ్లు బంద్"ఆవిడ నవ్వుతూ అంది.

"చూడటమంటూ జరగాలికదా" అంది కామాక్షి నిర్లిప్తంగా.

పాప "అమ్మమ్మా! పువ్వు" అంటూ అటు నడకసాగించింది. కామాక్షి లేచి వెళ్లి నాలుగు పువ్వులు కోసి ఇచ్చింది. పది నిముషాలు అయ్యాక "అమ్మమ్మా... ఊ ఊ" అంటూ వచ్చి ఒళ్లో వాలింది.

"పిల్లా! నీ దగ్గర దీనికి బాగా చేరికే" అందావిడ.

కామాక్షి నవ్వింది. "ఊ పడక, తిండి అన్నీ నేనే చెయ్యాలి. ఎవరుచేసినా ఇష్టపడదు" అంటూ పిల్లదాని ఉంగరాల జుట్టు ప్రేమతో నిమిరింది. "నిజం చెప్పమంటారా? నేను అమ్మనయినపుడు కూడా ఇంత ఆనందం పొందలేదు. దాని ప్రతీ చేష్టలూ నాకు ఆనందమే. దాన్ని క్షణం వదలాలనిపించదు"

సుబ్బమ్మ ముసిముసిగా నవ్వింది. "అందుకే అన్నారు అసలుకన్నా వడ్డీముద్దని. ఇందుకేనా నువ్వు ఇంక చీటీలు నడపలేనని అన్నావుట. మనవరాలు పుట్టి అమ్మమ్మ పనులు తగ్గిస్తోందా? వాళ్లందరూ గోలపెడుతున్నారు"

కామాక్షి ఆవిడవైపు చూసింది. "చాలా ఏళ్లుగా నడిపాను కదండీ! షాపు పెద్దదైపోయింది. అక్కడ మేం ముగ్గురం ఉండవలసి వస్తోంది. ఈ చీటీల హైరానా తగ్గించుకొందామని మానేశాను. గిరిజ, పద్మ ఖాళీ సమయాల్లో షాపు పని చేస్తున్నా అవడంలేదు" అంది.

ఆవిడ కామాక్షి మనసు కనిపెట్టినట్లు నవ్వేశారు. "ఇన్ని మాటలు ఎందుకు? మనవరాలితో ఆడుకొంటున్నాను. అందుకే నాకు టైమ్ చాలడంలేదు అని చెప్పవచ్చు కదా" అంది.

నిజమే కామాక్షికి పాపను, వదలాలని ఉండదు. దాని ముద్దు మాటలు, పనులు చూస్తూ మైమరచిపోతోంది.

"వస్తానండి" అంటూ బయలుదేరుతుంటే "నువ్వే మరొకసారి ఆయనకి ఉత్తరం రాయవే" అంది.



కామాక్షి అలాగేనన్నట్లు తలూపింది.

ఆయన ఉనికిని గమనించి ఆనంద్, పండు వెళ్లి బతిమాలారు. అయినా ఆయన రాలేదు. పండుతో "నన్ను కొన్నాళ్లు ఇలాగ ఉండనీయండి" అన్నారుట. రెండవ బావ గారు ఊళ్లో ఉన్నారంటే తను ఫోను చేసింది. ఆయనని రమ్మనమని బతిమా లింది. అలాగే అన్నారు. తను ఎదురు చూసింది. రాలేదు. వస్తానంటూనే కాలం గడుపుతున్నారు. పోనీ ఆయన ఎక్కడో అక్కడ సుఖంగా ఉంటే చాలు. మనసులో పాపను ఆయన చూడలేదే అని బాధ. తన ఇంట్లో మరొక తరం వెలిసింది. ఈ ఆనం దాన్ని ఆయనతో పంచుకోవడం అవలేదు. ఏ ఆనందం అతడితో కలిసి పంచుకోగలి గావు? మనసు నిలదీసింది.

నాగమ్మ వచ్చి ఏవో విషయాలు షాపుకి సంబంధించినవి చెప్పసాగింది. "మీరు పాపతో హాయిగా గడపండి. ఎంతసేపు ఆ పనులు చూస్తారు? " అంటూ కామాక్షి దెబ్బలాడింది.

"నీ మనవరాలు పెద్దదయ్యేసరికి మనం ఈ షాపుని ఇంకా పెద్దది చెయ్యాలికదా" అంటూ ఆవిడ నవ్వుతూ వెళ్లిపోయింది.

పాపని ఎత్తుకుని ముద్దులాడే గిరిజను ఆవిడ నవ్వుతూ అడుగుతుంది, "నీకూ ఇలాంటి బిడ్డలను ఎత్తుకోవాలని ఉండదా? "

"ఇదిగో ఎత్తుకున్నానుకదా! అక్కా! ఈసారి ఇద్దరు కవల పిల్లలని కనవే! ఒక బాబుని నాకు ఇచ్చెయ్యి" అంటున్న గిరిజతో ఆవిడ దెబ్బలాడింది.

"కనందే కడుపుకాదు. కట్టుకోనిదే బట్ట కాదు. గిరిజా! నా మాట వినవే! నీ బిడ్డ లను కూడా ఇలాగ ఎత్తుకోవాలని, ఆడుకో వాలని ఉందే!"

క్షణం ఆగి ఆవిడ అనునయంగా అంది "నేను ఎత్తుకొని ముద్దులాడి పెంచవద్దా? అడగకుండా జీతంతో చీరలు తెస్తావు. అడ గకుండా ఈ ఉంగరం బలవంతంగా ఇచ్చావు. అడగకుండా నా పనులు చూస్తావు. ఇప్పుడు మనసారా నాకై నేను అడుగుతుంటే పెళ్లి మాట తలపెట్టనీయవు". ఆవిడ బాధ గిరిజ చూడలేకపోయింది. "నాన్నగారిని రానీయమ్మా! పెళ్లికేమిటి? నీ ఇష్టప్రకారమే చేసుకొంటాను. ఈ సంసార సాగరంలో నన్ను కూడా పడేస్తేకానీ నీకు నిద్రపట్టదు. ఊ... కానీ... తండ్రికోసం తల్లికోసం ఎందరో ఎన్నో చేశారు. నేనూ వాళ్ల త్రోవలో నడుస్తున్నాను" గిరిజ తప్పదన్నట్లు చెప్పింది.

ఆవిడ ఆనందానికి అంతులేదు. పాపను ముద్దు పెట్టుకుని "నువ్వు పుట్టి మీ పిన్ని మనసు మార్చావే! నా బంగారు తల్లివి. నీకు పిన్ని పెళ్లికి గాజులు చేయిస్తాను" అంది.

కామాక్షి సంబరంగా ఈ విషయం అంద రికీ చెప్పేసింది. ఆనంద్ అడిగాడు, "అయితే మరదలా! దద్దోజనంగాడిని చూడాలా? చలి మిడి ముద్దను చూడాలా? "

గిరిజ బావగారిని చూస్తూ, "ఏంచేస్తాం? ఇప్పుడు మీ టైముగదా! ఎన్ని వేళాకోళా లైనా చేస్తారు" అంటూ తల్లివైపు తిరిగి, "అమ్మా, అక్కకి చూసినలాంటి 'ముద్దపప్పు' ని చూడు చాలు" అంది.

"నా భర్తని ఎందుకే అంటావు? " అని పద్మా, "ముద్దపప్పు ఆరోగ్యకరం తల్లీ!" అంటూ ఆనంద్ వెంటపడ్డారు.

పండు తల్లివైపు చూస్తూ, "ఇప్పటికే పెద్దక్క ఒక ఆడపిల్లని కంది. అందరూ నీ పెళ్ళాం పుట్టిందిరా అని ఏడ్పిస్తున్నారు. ఇంక దీనికి కూడా పెళ్ళి తలపెట్టావా? నా పిల్లని చేసుకో, నా పిల్లని చేసుకో అంటూ ఇద్దరూ నా ప్రాణం తినేస్తారు కాబోలు. అమ్మా, నాకు ఏది దారి? " అన్నాడు.

గిరిజ తమ్ముడిని ఎగతాళిగా చూస్తూ అంది, "మా పిల్లకి నీలాంటి ఆవారా గాడినిచ్చి చచ్చినా చేయనురా!"




పండు ఉడుక్కున్నాడు. "నన్ను... డాక్టర్‌ను కాబోయే నన్ను అంతమాట ఎలా అనగలిగావే? ఉండు... నీకు తప్పకుండా నోట్లో వేలుపెట్టుకుని, గిరిజా, గిరిజా అంటూ చొంగ కార్చుకుంటూ నీ వెనుక తిరిగేవాడినే చూస్తాను"

కామాక్షికి ఆ పిల్లలు, వాళ్ళ అల్లరి ఎంతో హాయిగా ఉన్నాయి. జీవితం అంటే ఇలా గుండాలి. పిల్లలతో, పాపలతో ఇలా సజీవంగా ఉండాలి. ఈ సందడులు కావాలి. ఈ కష్టాలు, కన్నీళ్ళు, బాధలు, సుఖాలు అన్నీ కావాలి. వీటిలోనే తృప్తి, వీటిలోనే ఆనందం. వీటిలోనే ముక్తి అనుకుంటూ ఆ ఇంటిని, ఆ పిల్లలని మనసారా చూసుకుంది. ఇది నా సామ్రాజ్యం. నేను ఇందులోనే తరిస్తాను. దీనినే ముక్తిసాధనంగా భావిస్తాను. ఆవిడ ఆ ఆనందాన్ని మనసులో నిక్షిప్తం చేసుకోవాలన్నట్లు వాళ్ళవైపు తదేకంగా చూడసాగింది.

పండు తల్లి దగ్గరికి వచ్చి పడుకున్నాడు. "అమ్మా! అల్లరి చేసి చేసి నీరసం వచ్చింది. నీ అమృతహస్తంతో టిఫిన్ చేసి పెట్టవా? "

ఆవిడ అది చాలా ఇష్టమైన పనిలాగా లేచింది.

★ ★ ★

రాధాకృష్ణమూర్తికి హోటల్ కూడా నచ్చడంలేదు. డబ్బు ఖర్చుపెడితే కొన్ని వస్తువులు లభిస్తాయి. కొన్ని లభించవు. అతనికిపుడు చిట్టిబూరెలు తినాలనిపిస్తోంది. కామాక్షి పెరుగుగారెలు ఎంత బాగా చేస్తుంది. సర్వర్ తెచ్చిన పెరుగుగారెలు పుల్లగా ఉన్నాయి. "పెరుగు కమ్మగా తోడుపెట్టి ఇవి వేయవచ్చు కదా" ఆయన వాడితో చిరాకుగా అన్నారు.

ఆ సర్వర్ ఓ తిక్కవాడు. ఈయన అస్తమానూ పిలుస్తూనే ఉంటాడు. ఏదో ఒకటి తెమ్మంటూనే ఉంటారు. ఏమాత్రం ఆలస్యం చేసినా ఇందుకేనా నీకు 'టిప్' ఇస్తున్నది అంటారు.

వాడు వెంటనే అన్నాడు, "ఇది మన ఇల్లు కాదుకదా సార్! హోటల్ టిఫిన్లు ఇలాగే ఉంటాయి"

వాడి సమాధానం ఛెళ్ళున తగిలిందతనికి.

"మీకు ఇష్టమైన పెరుగుగారెలు చేశాను. మరో రెండు, రెండు" అంటూ ప్రేమగా వడ్డించే భార్య మాటలు స్ఫురణలోకొచ్చి అన్యమనస్కంగా పడుకున్నాడు. డబ్బు ప్రస్తుతం ఉంది. ఇది అయ్యేలోపు మళ్ళీ చిత్రాలు వేయాలి. ఆ ఓపిక ఉంటుందా?

పెళ్ళి అయిన కొత్తలో తన భుజంమీద తలవాల్చి భార్య అడిగిన ప్రశ్న 'మీకు భవిష్యత్తు అంటే భయం లేదా? '

తను ఆ ప్రశ్నకి సమాధానం ఇవ్వడానికి క్షణం కూడా తీసుకోలేదు. "భయం ఎందుకు? నా చేతిలో కళ ఉంది. ప్రజలు అభిమానంగా ప్రోత్సహిస్తున్నారు. కాసులు రాలుతున్నాయి. నాకేంలోటు? " అన్నాడు.

"ఎల్లకాలం ఇలాగే ఉంటామా? వృద్ధులం కామా? జీవితానికి భద్రత వద్దా? "

ఆమెను తనవైపు తిప్పుకుంటూ అన్నాడతను. "ఇంతమంచి టైంలో ఇలాంటి పిచ్చి ప్రశ్నలేమిటి? "

"ఇది పిచ్చి ప్రశ్నా? "

"కాదా? వర్తమానాన్ని వదిలేసుకొని ఎప్పుడో ఉండేకాలంకోసం పరుగులు దేనికి? "

"జీవితానికి సుఖం ఒకటే పరమార్థమా? "

"ఇన్నాళ్ళకి ఇంటికి వచ్చిన భర్తను ఆనందపరచక ఈ పిచ్చిప్రశ్నలు ఎందుకు? " తను ఆప్యాయంగా ఆమెను దగ్గరికి తీసుకొన్నాడు.

అతను పరుపుమీద పడుకోలేకపోయారు. ఈ స్మృతులు ఇంత సజీవంగా ఉండి నన్ను నిలవనీయడంలేదేమిటి?

మరికాస్సేపు ఇటూ అటూ దొర్లాడు. ఇంక ఉద్విగ్నత ఆపుకోలేక వెంటనే



లేచాడు. ఆ రాత్రివేళ... ఆ నిశ్శబ్ద వాతావరణంలో అతని చేతిలో ఓ 'జీవనచిత్రం' రూపుదిద్దుకోసాగింది.

★ ★ ★

ఉన్నట్లుండి కామాక్షి తమందరినీ అక్కడ ఎందుకు భోజనం చేయమందో వారికి అర్థమవలేదు. మనవరాలి పుట్టినరోజు కూడా కాదు. ఆశ్చర్యంగా చూస్తున్నవాళ్ళతో "మనమందరం కలిసి తినాలని, సరదాగా గడపాలనీ నాకు అన్పించింది" అంటూ తన మనసు వివరించింది.

వాళ్ళు పదిమంది దాకా ఉంటారు. అందులో ఇద్దరే మగవాళ్ళు. మిగిలినవారందరూ ఆడవాళ్ళే.

కొందరు అప్పడాలు, వడియాలు, చక్కిలాలులాంటివి చేస్తారు. కొందరు పచ్చళ్ళు తయారుచేస్తారు. కొందరు స్వీట్లు, కారపూస, జంతికలు చేస్తారు. అమ్మకాల విషయం నాగమ్మ, పిల్లలు, కామాక్షి చూస్తారు. వీటన్నింటినీ స్వయంగా దగ్గరుండి కామాక్షి చూస్తుంది. ఆ ఊర్లో మంచి పదార్థాలు దొరికే షాపుగా దానికి గుర్తింపు వచ్చిందంటే ఆవిడ పర్యవేక్షణే కారణం.

నాగమ్మ ఆవిడకి కుడి భుజమే. పెదవి విప్పి మాట్లాడకుండా పనిలో పడటమే నాగమ్మకి తెలుసును. మొదట్లో పిల్లలు ఎక్కువగా పాటు పడేవారు. డబ్బు బాగా రావడం మొదలుపెట్టాక తన దగ్గరికి సహాయం కోసం వచ్చిన వాళ్లను పొమ్మనలేక ఆవిడ వ్యాపారం విస్తరింపచేసింది. అందులో నలుగురు వితంతువులు. మిగిలినవారు ఈ కరువురోజుల్లో సంసారం నడవక సహాయంగా ఏ పనో చేసి బతకాలని వచ్చిన మధ్యతరగతి స్త్రీలు. అందరికీ అది ఆసరా అయింది.

మర్నాడు ఆవిడ స్వయంగా వారందరి కోసం వంట చేసింది. అందరినీ కూర్చోమని తను వాళ్లకి, పిల్లలకి స్వయంగా వడ్డించింది. ఆవిడ చేతి వంట రుచి వారందరికీ తెలిసినదే.

తనుకూడా చివర్న వారితో కూర్చుని కామాక్షి వాళ్లందరితో చెప్పింది. "బతకాలనే పట్టుదలతో అందరం కలిసి ఇంతవరకు నడిచాం. నాగమ్మ వదినగారు నిన్న నాకు ఒక సూచన చేశారు" కామాక్షి చిన్నగా నవ్వింది. ఆవిడవైపు చూసి చెప్పింది. అందరూ నాగమ్మ ఏం చెప్పిందా అని ఆసక్తిగా చూడసాగారు.

కామాక్షి మళ్లీ విషయంలోకి వెళ్లింది. "మనం ఇంతవరకు మనకి వచ్చినవి వీలైనవి అమ్ముతున్నాం. ఇలాగ కాకుండా ఎవరైనా మన దగ్గరికి వచ్చి ఏ పెళ్లిళ్లకో, ఏ ఫంక్షనులకో, ఏ పేరంటాలకో వాళ్లకి కావలసిన ఐటమ్స్ చెపితే మనం ఆ ఆర్డరు ప్రకారం చేసి అందించడం. మనకి లాభసాటిగా ఉండేలాగ ధరలు నిర్ణయించుకుందాం. మనం అందరం కూడా ఒక స్థితికి చేరుకోవాలి. ఒక్క నేను చేరితే చాలదు. నా తర్వాత ఈ విషయాలన్నీ నాగమ్మగారు చూస్తారు. మీరు ఆవిడ సూచనలు పాటించండి"

అందరికీ ఎంతో సంతోషంగా అన్పించింది. సంఘంలో తామందరూ ఒక స్థితికి చేరుకొనే ప్రణాళికను ఆవిడ రూపుదిద్దుతోంది. ఆ త్రోవలో తాము పయనిస్తే చాలు. అందరూ ఇంత మంచి ఆలోచన చెప్పిన ఆమెను అభినందనగా చూశారు.

గేటు తీసుకొని వస్తున్న వ్యక్తిపై కామాక్షి చూపులు మళ్లాయి. "మీకు ఒక ఉత్తరం వచ్చిందమ్మా" అంటూ ఒక కవరు అతడు అందించాడు. ఆవిడ ఆశ్చర్యంగా దాన్ని అందుకుంది. తనకి కొరియర్‌లో ఉత్తరం పంపేవారు ఎవరు?

అక్కడున్న వాళ్లందరూ ఆవిడవైపు, కవరువైపు చూస్తున్నారు. ఆవిడ కవరు చింపి కాగితం తీసింది. గులాబిరంగు కాగితం మీద ముత్యాల్లాంటి దస్తూరి.

"రంజనీ"





కామాక్షి అది తన ఉత్తరం కాదేమోనని కవరు పైనున్న అడ్రస్ చూసింది. సందేహం లేదు. తన ఉత్తరమే. ఆవిడ ఆసక్తిగా చదవ సాగింది.

"రంజనీ!

నిన్నే ఇలాగ పిలుస్తున్నాను. ఇన్ని రోజులూ 'కళే' జీవితాన్ని రంజింపచేసేది అని అనుకొన్నాను. కానీ నా జీవన చిత్రాన్ని రంజింప చేసిన నిన్ను ఇలాగే పిలవాలన్పి స్తోంది. జీవితం చాలా గొప్పదని గ్రహిం చాను. జీవితం అందంగా ఎలా బతికి గడ పడమో నువ్వు ఆచరణలో చూపించావు. నీ నిర్ణయం పిల్లల విషయంలో సమంజసమైన దేనని ఎప్పుడో గ్రహించాను"

చదువుతున్న కామాక్షి కళ్లల్లో నీటి బిందు వులు. ఆవిడవైపు పిల్లలు ఆందోళనగా చూస్తున్నారు.

"ఎవరి దగ్గరనుండి ఉత్తరం అమ్మా?" పండు ఆత్రుతగా అడిగాడు.

ఆవిడ మళ్లీ చదవడంలో మునిగిపో యింది.

పద్మ తమ్ముడివైపు చూసి "నాన్నగారు రాశారేమో" అంది.

"మరి మీరు వెంటనే ఇంటికి రావచ్చును కదా అని నువ్వు అడగవచ్చు కాని రావడా నికి స్వాభిమానం, అహంకారం అడ్డువ చ్చాయి. ఇప్పుడు నువ్వు నాకు దూరంగా అన్పించడం లేదు. నా దృష్టికి నువ్వు, మన ఇల్లు, మనవరాలు, పిల్లలు అందరూ కన్పిస్తు న్నారు. నువ్వు ఎంత అందంగా కన్పిస్తు న్నావో తెలుసా? వాళ్లందరిలో నువ్వు కన్పి స్తున్నావు.

"ఇన్నాళ్లూ తీసుకోవడం తప్ప ఇవ్వడం తెలియని వాడిని. సేవలు చేయించుకోవడం తప్ప సేవలు ఏవిధంగా చేయనివాడిని. మనం చాలా కబుర్లు చెప్పుకోవాలి. నేను వస్తున్నాను. వస్తూ నీకు మంచి బహుమతి తెస్తున్నాను. నా మనసు కొత్త జీవితాన్ని కోరుతోంది. ఆ జీవితం అందించగల సమ ర్థత నా కామాక్షికి మాత్రమే ఉంది. రెక్కలు కట్టుకొని నీ ముంగిట వాలాలన్పిస్తోంది. త్వరలో వస్తున్నాను.

నీ రాధాకృష్ణ"

ఆవిడ కళ్లల్లోని నీటివలన ఉత్తరం మరో కసారి చదవాలనుకున్నా అస్పష్టంగా అక్ష రాలు కన్పిస్తున్నాయి. మనసు ఆనందో త్తుంగ తరంగం అయింది. ఆ ఉత్తరం తెరి చిన ఆయన మనసులాగ కన్పిస్తోంది. ఉద్వేగం, ఆనందం, విషాదం అన్నీ మనసుని కుదిపేస్తున్నాయి. ఆవిడ తట్టుకోలేకపో తోంది. "భగవాన్! ఇన్నాళ్లకి కరుణించావా? ఎంత దయ నామీద!" అని దేవుడిని తలు స్తోంది.

రాత్రి మనవరాలికి జోలపాడుతుంటే ఆవిడ మనసు తేలిపోయింది. ఆ పిల్ల బుగ్గలు ఎన్నిసార్లు ముద్దులతో ముంచె త్తిందో తెలియదు. అందరూ పడుకున్నా నిద్రా దేవత ఆవిడని కరుణించలేదు. జీవి తంలోని సంఘటనలన్నీ సినిమా రీళ్లలాగ కదులుతున్నాయి.

ఫర్వాలేదు. ఈ జీవితం ఒక కొత్త మలుపు తిరగబోతోంది. పరిపూర్ణమైన ఆనందం వెల్లివిరియబోతోంది.

ఉదయం లేచిన పద్మ తల్లి నిద్ర లేవక పోవడం గుర్తించి ఆందోళనగా ఆవిడ గది లోకి వెళ్లింది. నాగమ్మ రాత్రంతా ఆవిడ పడుకోకపోవడం గమనించింది. తెల్లవారు ఝామున నిద్రపోతున్న దాన్ని లేపడం ఎందుకని ఇవతలికి వచ్చి పనిలోపడింది.

కామాక్షి నిద్రలో నవ్వుతోంది. అలా అంత తృప్తిగా నవ్వి ఎంతకాలమయిందో!

**అంకితం**

జన్మనిచ్చిన కన్నతండ్రికి
కూతురిచ్చిన కూర్మి కానుక
చదువునేర్పిన మేటిగురువుకు
భక్తి నొసగిన భవ్యకానుక.
మా నాన్నగారు శ్రీ మానాప్రగడ శేషశాయి
గారి పాద పద్మములకు ప్రణమిల్లుతూ

-కళ్యాణి

# చతుర కథలు

## గుట్టు

"జగన్నాథంగారింటికలా వెళ్లొద్దామా గాయత్రీ?" మోహన్ ఆసక్తిగా అడిగాడు భార్యని.

"వెళ్లాలంటారా?" గాయత్రి ప్రశ్నకి ప్రశ్నే బదులిచ్చింది, ఎందుకు వెళ్లాలన్న భావన ధ్వనింపచేస్తూ.

"ఇంతకీ నువ్వు వస్తావా రావా?" మరో మారు రెట్టించాడు మోహన్.

జవాబు తప్పక ఇవ్వాలి అన్న మంకు పట్టు పడతున్నట్టుంది మోహన్ వైఖరి.

క్కుంది.

"నువ్వేం చెప్పావో నేనేం విన్నానో" గొణిగినట్టు చిన్నగా అన్నాడు.

"చెప్పడానికేముంది! ఇదివరకోసారి వెళ్లాం ఇలాగే. అదేమిటో! మనం వెళ్లడం ఆలస్యం ఆవిడ తలుపులు మూసుకుని లోపలకి వెళ్లిపోయింది. లోగుట్టు పెరుమాళ్లు కెరుక అని మనకేం తెలుస్తుంది. అరగంట తర్వాతగానీ బయటకిరాలేదు. అదీ అన్నయ్యగారు వెళ్లి పిలిస్తే అప్పుడు వచ్చింది కాఫీనూ మరేదో తీసుకుని... ఆ... వేయించిన శెనక్కాయలు కూడా అను




జవాబు చెప్పక తప్పలేదు గాయత్రికి.

"నేను రాను బాబూ"

"ఏం ఎందుకు?" నిరాశపడ్తూ అడిగాడు మోహన్.

"మళ్లీమళ్లీ చెప్పాలా?" గాయత్రి విసుకుంటా...."

"ఆరోజేమోలే. ఈరోజెడదాంరా. అయిదవుతూందా.... ఇప్పుడు బయలుదేరితే మళ్లీ గంటలో ఇంట్లో ఉంటాం."

గాయత్రి మౌనంగా ఆలోచిస్తోంది.

"ఇద్దరం చక్కగా వాకింగ్ వెళ్లినట్లుంటుంది రారాదూ గాయత్రీ"

భర్త కోరిన ఈ చిన్న కోరికను చిన్నబు




చ్ఛలేక అయిష్టంగానే 'సరే'నని తలవూపి అయిదు నిమిషాల్లో తయారయివచ్చింది గాయత్రి. తృప్తిగా తలపంకించాడు మోహన్.

"అరె మోహన్! ఎన్నాళ్లకు...? రండమ్మా రండి" ఆప్యాయంగా ఆహ్వానించాడు జగన్నాథం.

"కూర్చో గాయత్రీ" జగన్నాథం భార్య తాను కూర్చుంటూ గాయత్రికి సోఫా చూపించింది. అంతలోనే..."ఒక్కనిముషం" అంటూ లోపలికెళ్లి తలుపువేసుకుంది. అంతే! ఈసారి మోహన్ కూడా ఆశ్చర్యపోయాడు. ఆవిడ ధోరణి అంతుపట్టక తెల్లబోయాడు.

జగన్నాథం అదీ ఇదీ మాట్లాడుతూనే ఉన్నాడు. గాయత్రి ముళ్లమీదున్నట్టుగా కూర్చుంది. కనులలోని కోపజ్వాలలు కనుబొమల్ని వికృతంగా ముడిచాయి.

"మంచినీళ్లేమయినా కావాలా? " మోహన్ తానే ఆ ఇంటి గృహస్థు అయినట్లు భార్యకు అతిథి మర్యాదలు చేస్తున్నాడు.

"అరెరే! నేను తెస్తానుండండి" తలుపు తెరుచుకుని వెళ్లి నీళ్లు తెచ్చాడు జగన్నాథం. అతడి వెనుకనే ఆవిడ! మళ్లీ తలుపులు మూసేసుకుంది. ఈసారి మోహన్ కూడా గాయత్రి లాగే కొద్దిగా హర్ట్ అయ్యాడు.

జగన్నాథం ప్రశ్నలకు మోహన్ అన్యమనస్కంగానే జవాబివ్వ నారంభించేడు. గాయత్రి ముఖాన లేని చిరునవ్వును అద్దెకు తెచ్చుకుని సంభాషణలో తుదీ,మొదలూ వినకుండానే అప్పుడప్పుడు 'నిజమే' నంటూ తలవూపుతోంది. పైగా పాదాలపై దాడి చేస్తున్న దోమలు, అవి పుట్టించే దద్దుర్లు, వాటి తాలూకు దురదలు గాయత్రి అసౌకర్యాన్ని మరింత పెంచుతున్నాయి. నలుగురిలో కూర్చున్నప్పుడు అసహ్యంగా గోక్కోలేక అప్పటికి ఒకటి రెండు దోమలను చప్పట్ల మధ్య ఇరికించింది.

జగన్నాథం గాయత్రి అవస్థ చూడనే చూశాడు.

"సాయంత్రం కాస్త తలుపు తీస్తే చాలు మనకన్న ముందే దూరిపోతాయి. ఇక ఆ రాత్రంతా సంగీత కచేరీయే. లేదంటే దోమల తోపాటు మనమూ 'హుక్కా' పీల్చాల్సిందే" అంటూ లేచివెళ్లి మస్కిటో మ్యాట్ ఆన్ చేశాడు.

"మ్యాట్ పొగ హుక్కాలా వుందా నీకు" మోహన్ నవ్వుతూ అడిగాడు.

"అంత సీన్ లేదు కానీ మా ఆవిడకు ఆ వాసన పడదు."

"మరి ఎలా? " దోమలు కరిచిన దద్దుర్లు మరోమారు రుద్దుకుంటూ జాలిగా అడిగింది గాయత్రి.

"దాందేముంది. ఆవిడ . జాగ్రత్త ఆవిడ చేసుకుంటుంది. ఆ డ్రాయింగ్‌రూమ్ తప్ప మిగతా గదులన్నీ బంద్. దోమలన్నీ తలుపులకు కొట్టుకుని వెనక్కు మళ్లాల్సిందే!" హ్హహ్హహ్హ- నవ్వుతున్నాడు జగన్నాథం.

ప్లేటునిండా పకోడీలు, టమాటో సాస్ బరువుగా బ్యాలన్స్ చేస్తూనే అవకాశం వున్న వేళ్లతో తలుపులు దగ్గరకు లాగాలని ప్రయత్నం చేస్తోంది శ్రీమతి జగన్నాథం.

'ఈవిడ లోపల పకోడీలు చేస్తోందా? అయ్యో ఎంత అపార్థం చేసుకున్నానూ?' అనుకుంటూ గాయత్రే లేచివెళ్లి తలుపులు దగ్గరకు వేసింది. గాయత్రికి అర్థమైంది పరిస్థితి.

"థాంక్స్ గాయత్రీ! రండి పకోడీలు తీసుకోండి. అన్నయ్యగారికి వేడివేడి పకోడీలు ఇష్టమని చెప్పారీయన ఓసారి" అంటూ ఆప్యాయంగా ప్లేటు అందిస్తోంది శ్రీమతి జగన్నాథం.

మోహన్ పంటికింద పకోడీలోని ఉల్లిపాయ ముక్క కరకరమంటోంది.

అపార్థాన్ని కరకరమని నమిలి మింగుతోంది గాయత్రి.

–సి.ఉమాదేవి

# హార్ట్ ఎటాక్

ఆ నగరం అనేక విధాల ప్రసిద్ధి చెందింది. ప్రాచీన కళలకు, ఆధునిక నాగరికతకు ఆ నగరం పెట్టింది పేరు. అంతే కాదు ఘరానా మోసాలకు, పంగనామాలు పెట్టడంలోనూ ఆ నగరం పైమెట్టుమీదే ఉంటుంది.

ఆ నగరంలో పట్టపగలే పోలీసు అధికారుల ముందే స్వైర విహారం చేసే జాతి ఒకటుంది. వారే ఆటోరిక్షా డ్రైవర్లు. అక్కడ దాదాపు అన్ని ఆటోలవీ దొంగ మీటర్లే. పి.టి ఉష , మిల్కాసింగ్‌లని మించిన వేగంతో పరిగెత్తుతూ ఆ ఆటో మీటర్లు ప్యాసింజర్లకి హార్ట్‌ఎటాక్ తెప్పిస్తాయి. అటువంటి మీటర్లతో ఆటోలు నడిపే డ్రైవర్లు మీటర్ మీద పదో,పదిహేనో ఇవ్వాలని ప్యాసింజర్ల దగ్గర డిమాండ్ చేస్తారు కూడా.

"ఎందుకు ఇవ్వాలి? , అసలు మీటరే గోల్‌మాల్" అని ధైర్యం చేసి ఎవరేనా అడిగితే వారు తమ గౌరవాన్ని సైడ్ కాలవలో వదిలివేసుకోవలసి వస్తుంది.

అంతటి ఘన చరిత్ర గల ఆ నగరంలో ఒక ఆదివారం సాయంత్రం భార్యా సమేతంగా బీచ్ కి వెళ్దామని శ్రీకాంత్ నిర్ణయించుకున్నాడు. ముందుగా కాలినడకనే క్వార్టర్స్ దగ్గరలోనే ఉన్న 'ఈట్ అండ్ ఎంజాయ్' హోటల్‌కెళ్లి టిఫిన్ తిని కాఫీ తాగి భార్యతో బయటకి వచ్చి అక్కడే ఆగి ఉన్న ఆటోని పిలిచాడు.




"ఎక్కడికి? " అడిగాడు డ్రైవరు.

"బీచ్‌కి" చెప్పాడు శ్రీకాంత్.

"అక్కడికి వెళ్తే రిటర్న్ ట్రిప్ దొరకదు. ఖాళీగా రావాలి" అన్నాడు డ్రైవరు.

"అయితే ఎంతిమ్మంటావ్? " అడిగాడు శ్రీకాంత్.

"సెవెంటీఫైవ్" చెప్పాడు డ్రైవరు.

"పోన్లే. మీటర్ వెయ్యి. మీటర్ ప్రకారం ఇస్తాను." అన్నాడు శ్రీకాంత్

"మీటరు గిట్టుబాటు అవదు. పైన పది




హేను ఇవ్వండి." అన్నాడు డ్రైవరు.

"సరే" అన్నాడు శ్రీకాంత్.

భార్యా సమేతంగా ఆటోలో కూర్చున్నాడు శ్రీకాంత్.

డ్రైవర్ మీటర్ వేసి ఆటో స్టార్ట్ చేశాడు. ఆటో స్టార్ట్ అవడంతోనే మీటర్ అమిత వేగం అందుకుంది.

"ఇదేమి మీటర్. అదుపు లేకుండా తిరుగుతోంది." అన్నాడు శ్రీకాంత్.

"అది అంతే! మీటర్ వేయమన్నదీ మీరే, మీటర్‌మీద పదిహేను ఇస్తానని ఒప్పుకున్నదీ మీరే" అన్నాడు డ్రైవరు.

"ఈ రేటులో నూరయిపోతుంది. పర్స్ ఖాళీ అయిపోతుంది" అన్నాడు శ్రీకాంత్.

"మీకు మోసం అనిపిస్తే ఆటోనంబర్ నోట్ చేసుకుని పోలీసు రిపోర్ట్ ఇవ్వండి. అలాచేస్తే మటుకు మీకు మర్యాద దక్కదు. జాగ్రత్తగా ఉండండి. ఇన్నేళ్లబట్టీ ఆటో నడుపుతున్నాను. అందరూ నోరు మూసుకుని ఆటో ఎక్కుతున్నారు. మీరేదో మహా ఊడ బొడిచినట్టు మాట్లాడుతున్నారు." అన్నాడు డేంజర్ సిగ్నల్ ఇస్తున్నట్లు ఆటో డ్రైవరు.

ఇంతలో బీచ్ వచ్చేసింది. ఆటోలోంచి దిగి మీటర్ లో అయినదానికన్నా పదిహేను రూపాయలు ఎక్కువ ఇచ్చాడు శ్రీకాంత్. దానిని అతి నిర్లక్ష్యంగా తీసుకున్నాడు ఆటోడ్రైవరు.

ఆ మర్నాడు ఆటోస్టాండ్ దగ్గరకి ఇద్దరు పోలీసులు వచ్చి ఆటోనంబరు చూసి ఆ ఆటోడ్రైవరు ఎవరో తెలుసుకుని "రేపు ఉదయం పదిన్నరకి పోలీసుకమిషనరు ఆఫీసుకు రా. మరిచిపోకు" అని చెప్పి వెళ్లారు అతనితో.

'ఒకసారి వెళ్లి అటెండెన్స్ వేయించుకుని వద్దాము. ఎవడో కంప్లెయింట్ ఇచ్చి ఉంటాడు. డ్యూటీ చేస్తున్నట్లు నటించడానికే పోలీసులు వచ్చి ఉంటారు. ఆ తర్వాత కథ మామూలేకదా!' అనుకున్నాడు ఆటోడ్రైవరు సత్యం.

ఆమర్నాడు అతడు ఆఫీసుకు చెప్పిన రోజుకి, చెప్పిన టైముకి వెళ్లాడు. అక్కడ ఎవరిని తాను కలవాలో తెలుసుకుని ఆ వ్యక్తి గదిలోకి వెళ్లాడు.

అంతే...! అతనికి హార్ట్‌ఎటాక్ వచ్చినంత పనయింది. "ధైర్యం ఉంటే పోలీసు రిపోర్ట్ ఇవ్వండి ఆ తర్వాత మీ మర్యాద దక్కదు" అని ఎవరికి వార్నింగ్ ఇచ్చాడో ఆయన ఆటోడ్రైవర్ల ఆగడాలు పరిశీలించి అరికట్టడానికి ప్రభుత్వం ప్రత్యేకంగా నియమించిన అధికారహోదాలో అక్కడ కూర్చుని ఉన్నాడు.

**—తాజీప్రసాద్**

---

## కష్టమైన పని

"తొంభై కేజీలు" అన్నది నర్స్ సుబ్బారావు వెయిట్ చూసి.

డాక్టర్ నోట్ చేసుకుని, "అయామ్ వెరీ సారీ సుబ్బారావు గారూ! మీలాంటి ఎడ్యుకేటెడ్‌కి కూడా వెయిట్ కంట్రోల్ గురించి చెప్పాల్సివస్తోంది." అన్నాడు.

సుబ్బారావు కుర్చీలో కూర్చుంటూ, "ఏం చెయ్యమంటారూ? ఈ ప్రమోషన్ వచ్చినప్పటినుంచీ వర్క్ విపరీతంగా పెరిగిపోయింది. ఎప్పుడు ఏం తింటున్నానో నాకు తెలీడంలేదు. టీలు, కాఫీలు లెక్కలేకుండా తాగాల్సివస్తోంది, ప్రతిరోజూ ఆఫీసర్స్‌తో మీటింగ్స్ కంపల్సరీ. అవి అయ్యేసరికి..." అంటూ నిట్టూర్చాడు.

డాక్టరు తలాడిస్తూ, "ఐ కెన్ అండర్‌స్టాండ్ యువర్ ప్రాబ్లెమ్. ఎనీవే ఇప్పుడు నేను చెప్పినట్లు స్ట్రిక్ట్‌గా ఫాలో అవ్వండి" అని గొంతు సవరించుకున్నాడు. ఇక వారి మధ్య సంభాషణ ఇలా సాగింది.

"ఎర్లీ మార్నింగ్ లేచి అరగంట వాకింగ్

చేయండి. ఫ్యాట్ బాగా ఉన్న ఫుడ్ బాగా తగ్గించండి. కాఫీలు, టీలు గణనీయంగా తగ్గించుకుని ఏవైనా జ్యూస్‌లు తాగండి. ఫ్రెష్ ఫ్రూట్స్ తీసుకోండి. నైట్ పుల్కాలు తినండి. వీలైనంతవరకు ఆఫీసుకు నడిచిపోయి నడిచి రండి. ఇక అన్నిటికన్నా ముఖ్యమైన విషయం... రోజుకు ఒక సిగరెట్ తాగండి చాలు. తర్వాత మెల్లగా మానెయ్యండి."

"డాక్టర్! మీరు చెప్పినవన్నీ చేస్తాను. కానీ ఆ చివర చెప్పింది మాత్రం నా వల్ల కాదు."

"ఏంటి సార్ ఇది. ఇప్పుడు స్మోకింగ్ వల్ల వచ్చే నష్టాలగురించి లెక్చర్ ఇచ్చే తీరికలేదు. చెప్పినట్టు ఫాలో అవ్వండి"

"కానీ రోజుకి ఒక్క..."

"మనం ఫ్యామిలీ ఫ్రెండ్స్ కాబట్టి ఇంతసేపు చెబుతున్నాను. ఏం సార్! నాకు తెలియక అడుగుతాను. సిగరెట్ తాగకపోతే చస్తారా? మీకోవిషయం తెల్సా? నేనూ ఒకప్పుడు చైన్ స్మోకర్‌నే. ఇప్పుడు కంప్లీట్‌గా మానేశాను. మిమ్మల్ని ఒక్కసారి మానెయ్యమనలేదే. రోజుకి ఒక్కటి తాగమన్నాను కదా!"

"అదే సార్! రోజుకి ఒకటి అంటే ఎలా?"

"మళ్లీ అదే మాట. సార్! కొంచెం కష్టమైనా అలవాటు చేసుకోండి. ఓన్లీ ఒన్ పెర్ డే"




"ఎలా డాక్టర్! నాకు చిన్నతనం నుండీ సిగరెట్ వాసన కూడా పడదు. ఇప్పటివరకూ నా యాభై ఏళ్ల లైఫ్‌లో ఒక్కసారి కూడా సిగరెట్ తాగలేదు. ఇప్పుడు వెయిట్ కంట్రోల్ కోసం రోజుకి ఒకటి తాగమంటే మాత్రం అది నా వల్లకాదు." అనేసి వెనుదిరిగి చూడకుండా వెళ్లిపోయాడు సుబ్బారావు.

–సి.అరుణ

# 'డాక్టరేట్' పై సమీక్షలు

ఆగస్ట్ చతురలో ప్రచురితమైన అశ్వని నవల 'డాక్టరేట్' పై మాకందిన ఉత్తమ సమీక్షలు

## క్రెడిట్ టు 'డాక్టరేట్'



(ప్రథమ బహుమతి రూ. 100 పొందిన సమీక్ష)

ఆకట్టుకొనే శైలితో ఆద్యంతం అలరించిన నవల 'డాక్టరేట్' చదివాక ఎన్నో సమస్యలకు పరిష్కారం ఏమిటో ఎలాగో తెలియకపోయినా మనకేం కావాలో తెలుసుకొని ఆ మార్గంలో ఎదురయ్యే ఒడిదుడుకులను అధిగమిస్తూ లక్ష్యాన్ని సమీపిస్తేనే తృప్తి అన్న స్ఫూర్తిని మాత్రం కలిగిస్తుంది. ముఖ్యంగా ఈ నవలలో ఆకట్టుకొన్న అంశం రచయిత్రి స్వంత అభిప్రాయాలు అనిపించకుండా యదార్థ సంఘటనలనే మన ముందుంచినట్లు అనిపించడం. పాత్రలన్నిటినీ ఎంతమేరకు కథా గమనానికి అవసరమో అంతమేరకే ఉపయోగించిన విధానం రచయిత్రి నైపుణ్యాన్ని తెలియజేస్తోంది.

యూనివర్శిటీలు, గవర్నమెంటు ఆఫీసులు, పబ్లిక్ సెక్టార్లు వీటిల్లో కనిపించే అనేక మంచిచెడుల కలయికవల్ల ఎప్పటికప్పుడు సమస్యలను ఆమూలాగ్రం ఆకళింపు చేసుకొని శాశ్వత చర్యలు చేపట్టకుండా తాత్కాలిక ఉపశమన చర్యలవల్ల కొంత మందికి మేలు, కొంతమందికి కీడు ఎలా జరుగుతోందో అలాగే అవకాశమున్న పై స్థాయి వారు తమమేలు కోసమే ఆలోచించడంవల్ల సమిష్టిగా మనం ఎంత నష్టపోతున్నామో ఈ నవల చదివాక గుర్తుకు వచ్చి ఆలోచనలు రేకెత్తిస్తుంది.

ధనకాంక్ష, పదవీవ్యామోహం ఉన్నవారు



ప్రొఫెసర్ ఉద్యోగానికి అర్హులుకారన్నది నిజం. బంగారం విలువ అందరికీ ఒకటే కాదు అన్న ముక్త మాటలు బంగారం కన్నా విలువైనవి. బ్యాంకు ఉద్యోగాలు, ఐ.ఎ.ఎస్‌లు, ఇంజనీరింగ్, మెడిసిన్, కంప్యూటర్స్ ఇవే అందరికీ చాలా ముఖ్యమైనవి అన్న భావన తల్లితండ్రులలలో విద్యార్థులలో పోయి ఎవరు ఏ రంగానికి సరిపోతారో తెలుసుకొని కృషి చేస్తే విజయం సాధిస్తారు అని తెలుసుకోవాలి. ఈ పాయింట్ చెప్పడంలో రచయిత్రి సఫలీకృతులయ్యారు.

అయితే పవన్‌లో మార్పు, సుమిత్ర క్వశ్చన్ పేపర్ ఉదంతం, వరద రాజేశ్వరి ప్రతీమాటని సినీ దర్శకురాలు ఆశ్చర్యంగా రిసీవ్ చేసుకోవడం అంత కన్విన్సింగ్‌గా లేవు. సత్యం ట్రీట్‌మెంట్ విధానం నాటకీయంగా ఉన్నట్లు అనిపించింది.

ఇవన్నీ పానకంలో పుడకలులా ఉన్నాయి తప్ప డాక్టరేట్ మంచి నవల అనే అభిప్రాయానికి అడ్డంకావు. భవిష్యత్తులో రచయిత్రినుంచి మంచి రచనలు ఆశించవచ్చు. ఏ ప్రేమ వ్యవహారాలూ లేని వెరైటీ నవలను అందించిన చతురకు అభినందనలు.

—చావలి గురుప్రసాద్

విశాఖపట్నం- 530032

## మెదడుకు పని...!

**(ద్వితీయ బహుమతి రూ.75/–**

**పొందిన సమీక్ష)**

**అ**శ్వని నవల 'డాక్టరేట్' ఒక చక్కని ప్రయత్నం.

చిక్కని కథనం, ధారాళమయిన శైలితో సరళంగా సాగిన కథ చదువరిని తనతో లాక్కెళ్తుంది. చదవడం పూర్తయ్యేదాకా పుస్తకం కిందపెట్టబుద్ధేయదు.

విశ్వవిద్యాలయాల్లో కొన్ని దశాబ్దాలుగా నెలకొని ఉన్న వాతావరణాన్ని యధాతథంగా విశ్వసనీయంగా ఈ నవల చిత్రీకరించింది. ఆదర్శవంతులయిన విద్యార్థులూ, మత్సరపూర్ణమతులయిన బుద్ధిజీవులూ, విద్యారాజకీయ చదరంగంలో విచక్షణ మరచిన మేధావులూ నవలలో సజీవంగా కనిపిస్తారు.

ఉన్నంతలో కథానాయిక ముక్త పాత్రనూ, కొన్ని ఇతర ముఖ్య పాత్రలనూ ముచ్చటగా బహుముఖంగా ఆవిష్కరించిందీ నవల. ఇందులో దేవతలూ, దానవులూ లేరు. సంఘంలోని మనుషులే కనిపిస్తారు. వారిలోని మంచీచెడుల కలయికే కనిపిస్తుంది. ఆ మంచికీ చెడుకీ కారణమయిన పరిస్థితుల ప్రోద్బలం కనిపిస్తుంది.

నవలలో పాత్రలనూ వారి మనస్తత్వాలనూ రచయిత ఏకపక్షంగా కాకుండా నిష్పక్షపాతంగా మలిచి చూపారు. ఉన్నత విద్యారంగాన్ని చిత్తశుద్ధిగల సాక్షిలా వర్ణించారు.

ఇలాంటి విషయాన్ని రచయిత్రి చెప్పదలుచుకున్న పద్ధతిలో చెప్పడానికి పెట్టుకున్న పరిమితులవలన నవల నిడివి కొంత తక్కువయిందేమోననిపిస్తుంది. మరికొంత విస్తారమయిన కాన్వాస్ మీద అయితే రచన మరింత హృదయంగమంగా ఉండేది. ప్రొఫెసర్ కోలా మనస్తత్వంలో వచ్చిన మార్పుకు కారణాలూ ప్రొఫెసర్ సత్యం చికిత్స వృత్తాంతం కృతకంగా కాకుండా సినిమాటిక్‌గానయినా వివరించేందుకు అవకాశం ఉండేది. సుమిత్ర, నిత్యానంద్ వంటి పాత్రల్ని ఇంకొంచెం స్పష్టంగా చిత్రీకరించడానికీ ఆ పాత్రలకూ అసలు కథకూ ఉన్న సంబంధాన్ని మరింత బలపరచడానికీ వెసులుబాటు ఉండేది. నింపాదిగా మొదలయి సాఫీగా నడిచిన కథను హడావిడిగా ముగించే అవసరం ఉండేదికాదు.

మొత్తం మీద పఠితకు తృప్తినిచ్చే నవల డాక్టరేట్. మెదడుకు పని కల్పించిన రచ





యిత్రికు అభినందనలు.

–శ్రీరామ్ మల్లాది
హైదరాబాద్-44

## కొండ అద్దమందు...

(మూడవ బహుమతి రూ. 50/–
పొందిన సమీక్ష)

'డాక్టరేట్' నవలలో ఉన్నత విద్యావ్యవస్థలోని అవకతవకలను, పరిశోధన పేరిట యూనివర్శిటీల్లో జరుగుతున్న ప్రహసనాన్నీ తన శక్తికొద్దీ ఆవిష్కరించారు రచయిత్రి. ఈ పరిశోధన అనే తతంగాన్ని సమూలంగా ప్రక్షాళన చెయ్యాల్సిన ఆవశ్యకతను పరోక్షంగా చెప్పారు.

విద్యార్థుల ఉన్నతికన్నా స్వీయ ప్రయోజనాలే మిన్నగా భావించే కోలా, సత్యంలాంటి స్వార్థపరులు, అవకాశవాదులు మన యూనివర్శిటీల్లో కొల్లలుగానే కన్పిస్తుంటారు. తమ పర్యవేక్షణలో ఎంతమంది డాక్టరేట్‌లు పొందారనే రాశి మీదే వీరి దృష్టి తప్ప సదరు పరిశోధనల్లో వాసిని వీరు పట్టించుకోరు. వేదవతి లాంటి నిజాయితీ, నిబద్ధతగల ప్రొఫెసర్లు చాలా తక్కువ.

పరిశోధనపట్ల ప్రగాఢ తృష్ణగల ముక్త, సాగర్‌లాంటి విద్యార్థులు ఎదుర్కొనే సాధక బాధకాలను నవలలో కళ్లకు కట్టినట్లు వర్ణించారు.

ఇంటిని చక్కదిద్దుకోలేని, తను వార్డెన్‌గా పనిచేస్తున్న హాస్టల్‌లోని విద్యార్థినుల సమస్యలను పరిష్కరించలేని వరద ఏకంగా ఇంటర్నేషనల్ ఉమెన్స్ ఆర్గనైజేషన్‌లో స్థానం సంపాదించుకోవడం ఉట్టికెగరలేనమ్మ స్వర్గానికి ఎగిరినట్లు హాస్యాస్పదంగా వుంది.

విద్యార్థుల భవిష్యత్తు, దేశశ్రేయస్సు గాలికొదిలి విదేశాల్లో పరిశోధనలు చేస్తూ కాలం గడిపే సత్యంలాంటి ప్రొఫెసర్లు ఈ దేశంలో ఆరాధనీయులు కావడం శోచనీయం.

ఓవైపు మెరిట్ వుండీ పిహెచ్‌డీలో సీటు దొరకని సాగర్, మరోవైపు మొక్కుబడిగా పరిశోధన ముగించి ఎలాగోలా డాక్టరేట్ పొందాలనుకునే నీరజలను ఉదహరిస్తూ నాణేనికి రెండు పార్శ్వాలూ చూపించారు రచయిత్రి.

పరిశోధనా క్రమంలో నానాపాట్లూ పడి చివరకు విరమించుకొని రిజర్వు బ్యాంకులో చేరిన ముక్త ఉద్యోగం వదిలి మళ్లీ థీసిస్ వైపు మొగ్గుచూపడంలో వాస్తవిక దృష్టి కొరవడిందనిపించింది.

కొండను అద్దంలో చూపినట్లు పరిశోధన అనే విస్తృతపరిధి గల ఇతివృత్తాన్ని తన రచనలో ప్రతిబింబింపచేయడంలో రచయిత్రి చాలావరకు సఫలీకృతులయ్యారు.

–యన్.మధుసూదనయాదవ్
-బాపట్ల- 522101

## అతి సహజంగా..

(నాల్గవ బహుమతి రూ. 50/– పొందిన సమీక్ష)

విశ్వవిద్యాలయాల్ని సరస్వతీ నిలయాలుగా, విజ్ఞానానికి ప్రతీకలుగా వర్ణిస్తారు. ఏ దేశమైనా యువతలోని ప్రతిభాపాటవాల్ని వెలికి తీసి మానవాళికి మహోపకారంచేసే పవిత్ర కార్యస్థలాలు విశ్వవిద్యాలయాలు. నీతి నియమాలకు, క్రమశిక్షణకు మారు పేరు చరిత్రలో తక్షశిల విశ్వవిద్యాలయం. చాణక్యచంద్రగుప్తుల నాటి విశ్వవిద్యాలయం క్రమశిక్షణ, విద్యార్జనలో కఠోర పరిశ్రమ, నిరంతర పరిశోధన, నియమాల ఆచరణ మొదలైన విషయాలు గుర్తుకొస్తాయి.

కాని నేటి విశ్వవిద్యాలయాల తీరుతెన్నులు చూస్తుంటే బాధగా ఉంది. కులమతాలకు, భాషా ప్రాంతాలకు అతీతంగా, అత్యున్నతంగా నైతిక విలువలతో ఎంతో ఉన్నతంగా ఉండవలసిన విశ్వవిద్యాల

యాల్లో కులాలు, మతాలు, వర్గాలు, ప్రాంతాలు, రాజకీయాలు మొదలైన సంకుచిత ధోరణులతో, బోధనా సిబ్బందిలోని అంతర్గత కుమ్ములాటలతో యీర్ష్యా ద్వేషాలతో నిండిపోయి కుళ్లు కంపుకొడుతున్నాయి. అవినీతి, బంధుప్రీతి, అంతులేని స్వార్థం, ఫేవరిటిజమ్ మొదలైన అంటువ్యాధులు విశ్వవిద్యాలయాల ఉనికికి అపఖ్యాతిని అంటగడుతున్నాయి. అన్ని విశ్వవిద్యాలయాలూ అలాగే ఉన్నాయని జనరలైజ్ చేయకపోయినా చాలావరకూ అంతే.

యూనివర్సిటీల్లోని వాతావరణాన్ని విద్యార్థినీ విద్యార్థుల అలవాట్లను, బోధనా సిబ్బందిలోని లొసుగులు, అపోహలు, అసూయలు సాదాసీదాగా అతి సహజంగా చెప్పిన అశ్వని గారి డాక్టరేట్ మామూలుగానే ఉంది. మొత్తం నవలలో రెండుసార్లు దర్శనమిచ్చిన ప్రొఫెసర్ అరుంధతిలాంటి వాళ్లు చాలా మంది కనిపిస్తారు.

ప్రొఫెసర్ కోలా, ప్రొఫెసర్ సత్యం, ప్రొఫెసర్ వేదవతిల పాత్రలు, ముక్త అనుభవాలు, కథ నడిపిన తీరు డాక్టరేట్‌ల కోసం అవస్థలు పడే వాళ్లకు అతి సహజంగా అనిపిస్తాయి.

–డాక్టర్ దమ్ము శ్రీనివాసబాబు
హైదరాబాద్–500048

## పిచ్చాస్పత్రి?

**(అయిదవ బహుమతి రూ. 50/– పొందిన సమీక్ష)**

'డాక్టరేట్' యూనివర్సిటీ నేపథ్యంలో వచ్చిన ఇతర నవలలకోవకు చెందిందే అయినా చాలాకాలం తర్వాత మళ్లీ ఉన్నత, అత్యున్నత విద్యావిధానాల వెనుకనున్న గురివిందల నలుపును వెలుగులోకి తెచ్చింది.

కళ్లముందే ఎన్నో విద్యావిషయక, సామాజిక, ఆర్థిక మార్పులు చోటుచేసుకుంటున్నా ఈ యూనివర్శిటీ డాక్టరేట్ల విషయంలో మాత్రం ఎవ్వరూ ఎటువంటి సంస్కరణలకీ ముందుకు రావడంలేదు. ఎందరో విద్యార్థులు ఈ పిహెచ్‌డి వ్యామోహంలో వయస్సు, శక్తి కోల్పోయి నిర్వ్యాపారులుగా మారుతున్నారు. అదే జీవితం, ఆ డిగ్రీతోనే ఆ వర్శిటీ కాంపౌండులోనే ఉద్యోగార్హత, ఆ సైంటిస్టు ముద్రతోనే విదేశయానం అనే భ్రమ కొన్ని సుదీర్ఘ సంవత్సరాల జీవితాన్ని మింగేసి మిస్ ఫిట్స్ ఆఫ్‌ది సొసైటీగా మిగిల్చేస్తుందన్న సత్యాన్ని ఇంకా యువకులు, విద్యా సంస్కర్తలు గుర్తించకపోవడం, ఫలితంగా ఒక తీవ్రవాది, ఒక ఉన్మాది తయారు కావడం తీవ్రంగా పరిగణించాల్సిన విషయం. మా ఇంట్లోనే డాక్టరేట్ డిగ్రీ పొందలేక బలైన ముగ్గురున్నారు. ఇద్దరు కుంటి జాబుల్లో చేరారు. మరొక్కరు డిప్రెషన్‌కిలోనై జీవితాన్నే స్తంభింపచేసుకున్నారు. ఈ నవలలో కనీసం కోలా ఆత్మవిమర్శ చేసుకుని ముక్తకు బతుకునిచ్చారు. అలాగే వేదవతిలాంటి ప్రిన్సిపుల్డ్ వ్యక్తి కూడా ఉంటేగింటే జోహార్లందుకుంటారు. ఇలాకాక ప్రలోభపెట్టి ఉద్యోగపు వయసు ఉడిగేదాకా రీసెర్చి చేయించి తర్వాత డిగ్రీ ఇవ్వక, కొట్టించుకున్న ప్రొఫెసర్లు, పిచ్చెక్కి రోడ్లమీద తిరిగే పరిశోధకులు ఈ విషవలయాన్ని ఛేదించి టైంబౌండ్‌గా పరిశోధన కాలం, డిగ్రీ ప్రదాన కాలం నిర్ణయం చేస్తే ఈ సమస్య కొంతవరకు పరిష్కారం కావచ్చునేమో ప్రయత్నించాలి.

ఇకనైనా వర్శిటీలు తీవ్రవాదుల్నీ, నిరాశోపహతుల్నీ తయారుచేసే సంస్థలుగా మిగిలిపోకుండా ఆలోచించవల్సిన అవసరాన్ని చాటిందీ నవల.

–ఆర్.ఎల్.చూడామణి
సి. మల్లవరం-517505

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd., Hyderabad, Tel: 3730328. Office Address: CHATURA, Telugu Monthly, Eenadu Compound, Somajiguda, Hyderabad. Tel: Hyderabad: 3318181, 3398787; Madras: 8270434, 8251044; Vijayawada: 476685; Visakhapatnam: 552211; Tirupati: 75757; Anantapur: 33777; Rajahmundry: 79170; Karimnagar: 23216; Suryapet: 21146; Guntur: 512149; Nellore: 338734; Kurnool: 52122; Srikakulam: 26060.

CHATURA Telugu Monthly Hyderabad- 500 482 Regd. No. H/HD/402-RNI/32186/78








ఈసారి వెజిటేరియన్, నాన్ వెజిటేరియన్, ఏ వంటకమైన
వండాలనుకున్నప్పుడు సంసిద్ధంగా ఉండే 'ప్రియ' వారి శ్రేష్ఠమైన అల్లం
వెల్లుల్లి, చింతపండు పేస్ట్‌లను వాడండి. అత్యంత పరిశుభ్ర పరిసరాలల
అత్యుత్తమ పదార్థాలతో తయారు చేసిన పేస్ట్‌లు ఇవి
మీ ఇంటి రుచులను మైమరపించే
ఈ ప్రియ రుచుల్ని అస్వాదించండి.




Culinary Pastes

## అత్యుత్తమ పదార్థాలు
## నోరూరించే రుచులు!

priya
Tamarind Paste

priya
Ginger & Garlic Paste

priya
Ginger Paste

priya
Garlic Paste

• అల్లం మిశ్రమం • అల్లం-వెల్లుల్లి మిశ్రమం • వెల్లుల్లి మిశ్రమం • చింతపండు మిశ్రమం

Manufactured by : USHODAYA ENTERPRISES LIMITED (Priya Foods Divisi
EENADU COMPLEX, SOMAJIGUDA, HYDERABAD - 500 082, INDIA. Ph: 040-3323717/3324727 Fax: 040-3393640 Website: www.priyafoods.c

Mudra: P: 99322